# విజయ బ్యాంక్ వారి
# వినాయక చవితి శుభాకాంక్షలు



ఆనందకరమైన
హోమ్, కారు &
ఎడ్యుకేషన్
రుణాలు.

• ఆకర్షణీయమైన వడ్డీ రేట్లు • సత్వర మంజూరు
• సులభతరమైన కాలపరిమితులు

*షరతులు వర్తిస్తాయి



विजया बैंक
విజయ బ్యాంక్
(A GOVT. OF INDIA UNDERTAKING)
A friend you can bank upon

VIJAYA BANK & YOU
CONNECTED 24 x 7 NOW...
Say Hello to us on:





టోల్ ఫ్రీ నంబర్. 1800 425 5885 వినియోగదారులచే, టెక్నాలజీతో వృద్ధి చెందినది www.vijayabank.com

# అతి తక్కువ వడ్డీ రేటు మరియు ఇ.ఎమ్.ఐ.

మీ హోమ్ లోన్ ను బ్యాంక్ ఆఫ్ బరోడా కు మార్చుకోండి

## బరోడా హోమ్ లోన్

**8.35% P.A.**

- గరిష్ట రుణ అర్హత
- గరిష్ట కాల పరిమితి 30 సంవత్సరాల వరకు
- ఉచిత వ్యక్తి గత ప్రమాద భీమా కవర్
- అవాంతరాలు లేని టాప్ - అప్ లోన్ సౌకర్యం

## బరోడా కార్ లోన్

**8.85% P.A.**

- గరిష్ట రుణ అర్హత
- గరిష్ట కాల పరిమితి 7 సంవత్సరాల వరకు.
- ఆన్ రోడ్ ప్రైస్ పై 95% వరకు రుణ సౌకర్యం.








K Srikant

కె శ్రీకాంత్

ఎసిఇ బాడ్మింటన్ ప్లేయర్

*Conditions Apply.

Call toll free no. 1800 22 33 44 / 1800 102 44 55
6 am - 10 pm
Web Chat-24X7
www.bankofbaroda.co.in
Follow us on



बैंक ऑफ़ बड़ौदा
**Bank of Baroda**
*India's International Bank*



పాఠకులకు
ప్రకటనకర్తలకు
ఏజెంట్లకు
శ్రేయోభిలాషులకు
**వినాయకచవితి**
**శుభాకాంక్షలు**



## సీరియల్స్



## ఫీచర్స్



ముఖచిత్రం: *ఓం గం గణపతయేనమః*


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com


## మార్నింగ్ కాఫీ



### పిచ్చాసుపత్రి

పిచ్చాసుపత్రిలో రోగులు ఎక్కువైపోయారు. పిచ్చి తగ్గినా అక్కడే సుఖంగా ఉంటున్నారని అధికారులకూ, డాక్టర్లకూ అనుమానం. వారిని తగ్గించాలని సర్కారు వారు హుకుం జారీ చేశారు. దాంతో రోగులను తగ్గించేందుకు పిచ్చివాళ్ళందరినీ ఓ గదిలో కూర్చోబెట్టారు. ఓ పరీక్షపెట్టారందరికీ. డాక్టర్ ఒకరు గదిలో ఉన్న బ్లాక్‌బోర్డు మీద ఓ బొమ్మగీశాడు. తలుపుబొమ్మ. నిజంగా తలుపేనేమో అన్నంతగా గీశాడు దాన్ని. గీసి అన్నాడిలా.

"ఎవరైతే ఈ తలుపు తెరుస్తారో వారికి మాంచి ఐస్‌క్రీం ప్రెజెంట్ చేస్తాను. ప్రయత్నించి చూడండి."

డాక్టర్ మాట పూర్తికానేలేదు. పిచ్చివాళ్ళంతా ఒకరి మీద ఒకరు పడేట్టుగా బొమ్మ తలుపు తెరిచేందుకు ప్రయత్నించసాగారు. డాక్టర్‌సహా అధికారులంతా తలలు పట్టుకున్నారు అది చూసి. అంతలో కూర్చున్న చోటు నుంచి కదలక పగలబడి నవ్వుతున్న ఓ పిచ్చివాణ్ణి చూసి ఆశ్చర్యపోయారు. ఆనందించారు కూడా. పిచ్చికుదిరిన వాడు ఒకడున్నాడు. దొరికాడు ఆఖరికి అనుకున్నారు. ఆ వ్యక్తిని అడిగారిలా.

"ఏంవయ్యా! అందరూ ఐస్‌క్రీం కోసం బోర్డు మీది తలుపు తెరిచేందుకు ప్రయత్నిస్తూ ఒకరి మీద ఒకరు పడుతోంటే నువ్వేంటయ్యా, ఇక్కడే కూర్చుని నవ్వుతున్నావు?"

"అదా! ఆ తలుపుతాళం నా దగ్గరే ఉంది. ఆ సంగతి తెలీక పిచ్చివాళ్ళు ఒకరిమీద ఒకరు పడుతున్నారు." అన్నాడు ఆ వ్యక్తి నవ్వుతూ. ఆ నవ్వుకీ, అతని మాటకీ అధికారులు సహా డాక్టర్ అవాక్కయ్యాడు.

### హాయి

భర్త బతికి ఉన్నంతకాలం అతన్ని సతాయిస్తూనే ఉంది భాగ్యం. ఇటీవలే చనిపోయాడతను. భర్తలేని లోటు తెలిసిందప్పుడు. బాధ కలిగింది భాగ్యానికి. భర్త ఆత్మతో మాట్లాడి, క్షమాపణ కోరుకుందామనుకున్నది. ఓ బాబాగారిని కలిసింది. తన బాధంతా వెళ్ళబోసుకుని, భర్తతో మాట్లాడాలన్నది. భర్త ఆత్మను పిలిచాడు బాబా. మాట్లాడమన్నాడు భాగ్యంతో.

"ఏంవండీ నేను, మీ భార్యను మాట్లాడుతున్నాను, మిమ్మల్ని బాగా హింసించాను, క్షమించి నాతో ఓ క్షణం మాట్లాడండి. ఎలా ఉన్నారు?"

"హాయిగా, ఆనందంగా ఉన్నాను, నువ్వెలా ఉన్నావు?"

"మీరు లేనిలోటు తెలుస్తోంది. చాలా బాధగా ఉంది. అన్నట్టు, ఇక్కడికంటే అక్కడ అంత హాయిగా ఉందా?"

"చాలా హాయిగా ఉంది. చెప్పలేనంత ఆనందంగా ఉంది భాగ్యం."

"అయితే స్వర్గంలో ఉన్నారన్నమాట."

"కాదు, నరకంలో ఉన్నాను."

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 26

30-8-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజి

# నిరీక్షణ

నవరాత్రులు ముగిశాయి. గణపతినిమజ్జనోత్సవం ప్రారంభం అయింది. చిన్నితల్లిని చేరదీసి చెప్పాడు తండ్రి. సాయంత్రం గణపతిని వాళ్ళమ్మ దగ్గరకు పంపించేద్దాం! గంగలో కలిపేద్దాం. తొమ్మిదిరోజులు నీతో ఉన్నాడు, చాలుకదా అన్నాడు. చాలు అనలేదు చిన్నితల్లి. గణపతి తనతో ఇంకా ఉంటే బాగుణ్ణనుకుంది. చవితికి ముందు మూడురోజులూ, తర్వాత తొమ్మిదిరోజులూ మొత్తం ఆ పన్నెండురోజులూ గణపతితోడిదే లోకం అయింది చిన్నితల్లికి. చవితికి మూడురోజులు ముందుగానే గణపతిబొమ్మలు అమ్మకానికి వచ్చాయి. పిల్లలంతా బొమ్మలదగ్గరే ఉన్నారు. ఈ బొమ్మ బాగుందంటే ఈ బొమ్మ బాగుందంటూ ఎంతంటే ఎంతని అమ్మకందారుని అడుగుతూ అక్కడే గడిపారు. నాన్నా! గణపతిని ఎప్పుడు కొంటావు? అడిగింది చిన్నితల్లి. కొందాం, తొందరేముంది? అడిగాడు తండ్రి. తొందరపడకపోతే ఎలా? బొమ్మనిబట్టే పందిరి. పందిరిబట్టే తోరణాలూ, సరంజామా అంతా. ఎంత వెంటపడినా బొమ్మను ముందు కొనలేకపోయాడు తండ్రి. రేపు పండగనగా ఈ రోజు రాత్రి కొన్నాడు. వందరూపాయలుపెట్టి కొన్నాడు. ముద్దొచ్చాడు గణపతి. ముద్దుపెట్టుకుంది చిన్నితల్లి. మర్నాడు పొద్దున పూజనగా ఈ రాత్రి నుంచే బొమ్మను ముస్తాబు చేస్తూ కూర్చుంది. గణపతికి పసుపురాసింది. బొట్టు పెట్టింది. చిత్రంగా శిరసున నెమలిపింఛం పెట్టింది. వేదిక చేసి ఆసీనుణ్ణి చేసింది. తెల్లవారవస్తోంది, నిద్రపోవే తల్లీ అని తండ్రి కేకేస్తే ఇంక నిద్రదేనికి? పూజకు వేళవుతోంటే అంది చిన్నితల్లి. అన్నట్టుగానే అలాగే పూజకు కూర్చుంది. చేసిన ఉండ్రాళ్ళు, పాయసంసహా తాను దాచిన చాక్లెట్లను కూడా నైవేద్యం పెట్టింది గణపతికి. ప్రసాదం స్వీకరించి, పడుకున్నదప్పుడు.

అది మొదలు తొమ్మిదిరోజులూ అదేతీరు. రాత్రంతా బొమ్మను చూస్తూ కూర్చోవడం, దానితో మాట్లాడడం, పొద్దున ప్రసాదం స్వీకరించి పడుకోవడం. చిన్నితల్లికి గణపతి బొమ్మకాదు. వీధిచివరి మేడింటి పిల్లాడిలా స్నేహితుడు, పార్కుదగ్గరి పెద్దపాపలా మంచినేస్తం. ఆ నేస్తాన్ని నీటిపాలు చెయ్యాలంటే బాధగా ఉంది. ఏడుపొస్తోంది చిన్నితల్లికి. ఏడ్చింది. వద్దు వద్దంది. అయినా వినలేదు తండ్రి. చిన్నారి నేస్తాన్ని నదిలో నిమజ్జనం చేశాడు. ఆ రాత్రంతా ఏడుస్తూనే ఉంది చిన్నితల్లి. తెల్లారుతూనే పరిగెత్తుకుని వచ్చి నదిగట్టున కూర్చుంది. గణపతిని పిలుస్తూ, బదులు వినరాక కాళ్ళూ చేతులూ కొట్టుకుంటూ పెద్దగొంతుతో రోదించసాగింది. గమనించారది జగదానందస్వామి. అక్కడే గట్టు మీది ఆశ్రమంలో ఉంటున్నారాయన. నవ్వుతూ చిన్నితల్లిని సమీపించారు. ఏమైందని అడిగారు. జరిగిందంతా చెప్పింది చిన్నితల్లి. నా బొమ్మ నాకు కావాలి! నా గణపతి నాకు కావాలి అన్నది. వస్తాడమ్మా! అమ్మ దగ్గరకు వెళ్ళాడు కదా! కొన్నాళ్ళు అమ్మదగ్గర ఉండి, ఆ తర్వాత నీకోసం మళ్ళీ తప్పకుండా వస్తాడు. ఈలోపు నీకు ఉత్తరం రాస్తాడు చూడు అన్నారు స్వామి. అన్నట్టుగానే మర్నాడు సాయంత్రం నదిగట్టుకు వచ్చిన చిన్నితల్లికి గణపతి రాశాడంటూ జేబులోంచి ఉత్తరం తీసి చదివారాయన.



చిన్నితల్లికి! నేను క్షేమం! నువ్వు కూడా క్షేమం అని తలుస్తాను. నేను మా అమ్మ దగ్గర హాయిగా ఉన్నాను. నవరాత్రులు అయిపోవడంతో సెలవులు అయిపోయాయి కదా, స్కూళ్ళు తెరిచారు. స్కూల్లో జాయినైపోయాను. బాగా చదువుకుంటున్నాను. నువ్వు కూడా బాగా చదువుకో! నిన్ను చూడాలనీ, నిన్ను కలవాలనీ ఉంది. వచ్చి కలుస్తాను, అయితే ఎప్పుడు అన్నదీ చెప్పలేను. టైం చూసుకుని వస్తాను, ఉంటాను, నీ గణపతి. ఆ ఉత్తరానికి ఎంతో సంతోషించింది చిన్నితల్లి. గణపతికోసం ఏడవడం, బాధపడడం ఆనాటి నుంచీ మానుకుంది. కొన్నాళ్ళకు మళ్ళీ మరో ఉత్తరం చదివి వినిపించారు స్వామి. చిన్నితల్లీ! సంక్రాంతిరోజులు కదా! బాగా చలిగా ఉందిక్కడ. ఎన్ని రగ్గులు కప్పుకుని పడుకున్నా చలి తీరడం లేదు. మొన్న జ్వరం కూడా వచ్చినట్టయింది. అమ్మ ఎంత బాధపడిందో! అక్కడ మీకు ఎలా ఉంది? చలి ఎక్కువగా లేదుకదా? ఉంటే జాగ్రత్త! ఉంటాను, నీ గణపతి. ఉత్తరం ముగించారో లేదో స్వామి, ఇక్కడ కూడా బాగా చలిగా ఉంది. అందుకే స్వెట్టర్ వేసుకున్నాను అంది చిన్నితల్లి. తాను వేసుకున్న స్వెట్టర్ స్వామికి చూపించింది. శీతకాలం గడిచి, ఎండాకాలం వచ్చింది. వెళ్ళింది. వెంటనే వర్షాకాలం వచ్చింది. గణపతినవరాత్రులు వచ్చాయి. చిన్నితల్లికి గణపతిబొమ్మ ఇచ్చారు స్వామి. గత ఏడాదికంటే కొంచెం పెద్దబొమ్మ. ఏడాదిలో చూడు, నీ గణపతి ఎంత పెద్దవాడయ్యాడో! అన్నారు. అవునవును అన్నది చిన్నితల్లి. బొమ్మని ఆనందంగా చూసింది. పదిపన్నెండేళ్ళు గడిచిపోయాయి అలా. ఒకరోజు మరో గణపతిని ఇస్తూ చిన్నితల్లితో అన్నారిలా స్వామి.

**నువ్వు ప్రేమించినవన్నీ నీకు కాకుండాపోవడం సహజం తల్లీ! అయితే అంతేసహజంగా అవన్నీ అంతో ఇంతో తేడాతో నీ ప్రేమకోసం మళ్ళీ తిరిగివస్తాయి. ఎదురుచూడాలంతే!**

నవ్య

# అధిక బరువుకి చెక్ పెట్టండిలా

**హార్మోన్ల అసమతుల్యత, వంశపారంపర్యత అనారోగ్యకర ఆహారపు అలవాట్లు శారీరక శ్రమ లేకపోవడం వంటి కారణాల వల్ల వచ్చే స్థూలకాయం అనేక ఆరోగ్య సమస్యలకు దారితీస్తుంది. వ్యాయామాలు, డైటింగ్‌తో ఈ సమస్య తొలగిపోవడం అంత సులువు కాదు. టైప్ 2 డయాబెటిస్, హై బ్లడ్ ప్రెషర్, హై కొలెస్ట్రరాల్ తదితర వ్యాధులకు దారితీసే అధిక బరువును బేరియాట్రిక్ సర్జరీలతో చాలా సులభంగా తగ్గించవచ్చని అంటున్నారు. డాక్టర్ నందకిషోర్ దుక్కిపాటి.**


## డాక్టర్ నందకిషోర్ దుక్కిపాటి
ఎండి, జనరల్ సర్జరీ (యుఎస్ఎ)
Advanced Laproseopic Bariatric Surgery
మేనేజింగ్ డైరెక్టర్, లివ్‌లైఫ్ హాస్పిటల్స్
ప్లాట్ నం.719, రోడ్ నెం.36, హైదరాబాద్
ఫోన్స్: 040 30 888 888 / 996 104 1234
బ్రాంచ్: సూర్యరావు పేట, విజయవాడ,
ఫోన్: 0866 3688888




ప్రపంచ వ్యాప్తంగా అభివృద్ధి చెందిన చెందుతున్న దేశాలను అధ్యయనం చేస్తే అధికంగా భయపెడుతున్న సమస్య, అధిక బరువు ఒకప్పుడు ధనిక దేశాలలో, ధనిక కుటుంబాలలో కనబడే ఈ సమస్య, మధ్య తరగతి కుంటుంబాలలో మరీ ముఖ్యంగా నగర నివాసులలో ఎక్కువగా కన్పిస్తోంది. మన దేశంలో అధిక బరువుతో ఇబ్బంది పడ్తున్న వారి శాతం 16%. ఈ విషయంలో మరింత వేగంగా ముందుకు దూసుకు వెళ్లడం, దక్షిణ భారతదేశం మరింత బరువు ఎక్కడం విచారకరమైన విషయాలు, ప్రపంచ వ్యాప్తంగా తీసుకుంటే అమెరికా, చైనా తరువాత మూడవ స్థానంలో మనదేశం ఉంది. వ్యాయామం, నడక, యోగా వంటివి మనం అంతగా అలోచించం కాని పిజ్జాలు, బర్గర్‌లు, బిరియాని, నూడుల్స్ రకరకాల ఐస్‌క్రీమ్‌లు మధ్య తరగతి వారూ రుచి మరుగుతున్నారు, బయటకు వెళ్ళే కల్చర్ పెరిగింది, నగరాల లోనే కాకుండా చిన్న చిన్న పట్టణాలకూ కూడా ఫాస్ట్‌ఫుడ్ సెంటర్‌లు పాకిపోయాయి. పార్టీ, పండుగ, పెళ్ళి, పుట్టినరోజు ఏదైనా మనం రకరకాల విందు వినోదాలతోనే ముగిస్తాం. ఏది ఏమైనా ఇన్‌పుట్ (అంటే తిండి) పెరిగింది అవుట్‌పుట్ (అంటే వర్కఅవుట్) తగ్గింది ఫలితంగా ఊబకాయం మనలో కొంత మంది అంత ఎక్కువ ఏమి తినటం లేదు అయినా ఎందుకు లావు ఎక్కుతున్నాం అని మధన పడ్తుంటారు. వారిలో చాలా మంది తీసుకునే ఆహార పదార్థాలు ఎలా ఉండాలో తెలుసుకోకపోవటం, హార్మోన్ల అసమతుల్యతకు గురవ్వటం, ఎక్సర్‌సైజ్ అస్సలు చేయకపోవటం కావచ్చని గమనించకపోవటం, వలన కూడా ఇలా జరుగుతూ ఉంటుంది.

చిన్నప్పటి నుండి వయస్సుతో పాటు అధిక బరువుకు గురవుతూ వచ్చేవారు కొందరయితే, డెలివరి, సర్జరి తరువాత లేదా మధ్య వయస్సులో సడన్‌గా బరువు పెరిగే వారు మరి కొందరు. సాధారణంగా ఇంట్లో కుటుంబ సభ్యులు అందరి అలవాట్లు ఆహారపు అలవాట్లు ఒకేలా ఉంటాయి. అందుకనే కొన్ని కుటుంబాలలో ఈ అధిక బరువు ఎక్కువగా కన్పిస్తూ ఉంటుంది అయితే వారు ఇది మా వంశపారం పర్య సమస్య: ఏమి చేస్తాలేం అనుకుంటూ సర్ది పెట్టుకుంటూ ఉంటారు. ఇక్కడి జీన్స్ కంటే ఎక్కువ వారి అలవాట్ల వల్లనే ఈ సమస్యకు గురవుతున్నారని గమనించి తగిన చర్యలు చేపట్టితే మంచిది.

డాక్టర్ దగ్గరకు వెళితే ముందుగా చేసేపని మీ బరువు చెక్ చేయటం అంటే అన్ని రకాల ఆరోగ్య సమస్యలకు ప్రధాన కారణం ఊబకాయమే. కొంచెం బరువు తగ్గితే మీ ఆరోగ్య సమస్యల నుండి దూరంగా కావటం గమనించి మీరే ఆశ్చర్య పోతారు. కాళ్ల నొప్పులు, కీళ్ల నొప్పులు, మధుమేహం, అధిక రక్తపోటు, గుండె సంబంధిత సమస్యలు, సంతానలేమి చివరికి కొన్ని రకాల క్యాన్సర్‌లను కూడా దూరంగా ఉండవచ్చు సరిమైన వెయిట్ మెయిన్‌టైన్ చేస్తే. అందుకే వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ (WHO) అస్సలు అధిక బరువే ఒక పెద్ద ఆరోగ్య సమస్య అని ప్రకటించింది. తమ మీద తాము శ్రద్ధ చూపించకపోవటం వలన, డెలవరీ, సర్జరీల తర్వాత ఫిట్‌నెస్‌కు ప్రాధాన్యత ఇవ్వకపోవటం వలన ఇంకా ఏదో ఒకటి అని మిగిలినవి, నిల్వవున్న పదార్థాలను తినటం మనదేశం స్త్రీలలో స్థూలకాయం మరింత ఎక్కువే. ఇంకా వీరు హైపోథైరాయిడిజం, Pcodకి గురయితే సమస్య మరింత జటిలమవుతుంది. ఏ ఆరోగ్య సమస్యను అయినా ముందుగా గుర్తిస్తే చికిత్స తేలిక అవుతుంది. అలాగే ఈ సమస్యకు కూడా 4, 5, కిలోలు పెరగగానే తగ్గించటం తేలిక ఇంకా 10, 15 కిలోలు ఆపైబడి ఉందంటే స్థిర నిర్ణయాలతో పాటు మెడికల్ హెల్ప్ కూడా అవసరమవుతుంది. అధిక బరువుని బాడీమాస్ ఇండెక్స్‌తో లెక్కవేస్తారు. ఈ BMIని ఎలా లెక్కిస్తారంటే బరువు(కిలోలలో)ని, ఎత్తుని మీటర్ స్క్వేర్‌లలో కొలిస్తే వచ్చేదన్నమాట.

$$\frac{\text{Weight in Kgs}}{\text{Height in meter 2}} = \text{BMI}$$

ఇలా భాగించగా వచ్చినది. 25 లోపల ఉంటే (18-25) సరిమైన బరువని, 25-30 వరకు అధిక బరువని 30 ఆపై ఉంటే స్థూలకాయమని అంటారు. ముందుగా అధిక బరువుకి ఎలా చెక్ పెట్టవచ్చో మాట్లాడుకుందాం.

అన్నింటి కంటే ముందు స్థిర నిర్ణయం తర్వాత సరిమైన గైడెన్స్ ఉండాలి. పెరగటం తేలికే కాని తగ్గటం కష్టతరం. కొంచెం శారీరక శ్రమతోపాటు మానసికంగా స్ట్రెస్‌కు కూడా గురవుతూ ఉంటారు కాబట్టి తప్పని సరిగా సైంటిఫిక్‌గా సరియైన కౌన్సిలింగ్‌తో ట్రీట్‌మెంట్ అందించే సెంటర్ చూసుకోవటం చాలా ముఖ్యమైన పని.

నెట్‌లో/మార్కెట్‌లో అనేక రకాల వెయిట్ రెడ్యూసింగ్ మెడిసిన్స్ అందుబాటులో ఉంటాయి. కాని వాటిలో చాలా వరకు నకిలివి లేక ఏ విధంగానూ పని చేయనివే ఎక్కువ. ఇంకా కొన్నింటి సైడ్ ఎఫెక్ట్స్ చాలా భయంకరంగానూ ఉంటాయి. కొన్ని మందుల ప్రభావం గుండె, కిడ్నీ, లివర్‌ల మీద కూడా వుండవచ్చు అజీర్తి, విరేచనాలు, నిద్రపట్టకపోవటం, పొట్ట ఉబ్బరం, కడుపులో నొప్పి, బి.పి. ఎక్కువ అవటం, వణుకు రావటం, దేనిమీద శ్రద్ధ పెట్టలేకపోవటం ఈ మందులలో ఎక్కువగా కన్పించే దుష్ఫలితాలు. అందుకే, రుజువు అయిన మీకు సరిగ్గా సరిపోయే మందులు ఒక అనుభవజ్ఞుడైన డాక్టర్ దగ్గర తీసుకోవటం తప్పనిసరి. ఇంకా ఈ రోజుల్లో బరువు తగ్గించటానికి ఎన్నో నిర్ధాలితమైన నాన్ సర్జికల్ పద్ధతులు, థర్మోపాక్స్, ఎన్నో సైంటిఫిక్, మెడికల్‌గా నిర్ధారితమైన పద్ధతులు, డైటీషియన్ సలహాలు అందుబాటులోకి వచ్చేశాయి. బరువు తగ్గించటం అనేది ఒక టీమ్ వర్క్. స్థిర నిర్ణయంతో సమగ్రమైన సెంటర్‌కు వెళ్ళితే చాల తేలిక. సర్జికల్, నాన్ సర్జికల్ పద్ధతులతో, అన్ని రకాల స్పెషలిస్ట్‌లు, సలహాలు, సూచనలతో వేల మంది బరువు భారం తగ్గించిన సెంటర్‌ను, వారి టెస్టిమోనియల్స్ చూసి భారం తగ్గించుకోండి తేలిగ్గా ఆరోగ్యకరంగా జీవించండి.

### బేరియాట్రిక్ సర్జరీ పద్ధతులు:

1) గ్యాస్ట్రిక్ బెలూన్
2) గ్యాస్ట్రిక్ బ్యాండ్
3) గ్యాస్ట్రిక్ స్లీవ్
4) గ్యాస్ట్రిక్ బైపాస్
5) గ్యాస్ట్రిక్ ఇంబ్రికేషన్
6) ఏండో బ్యారియర్

### లివ్‌లైఫ్ హాస్పిటల్ విశిష్టత

- ఉన్నత ప్రమాణాలు, ఫైవ్‌స్టార్ సౌకర్యాలు గల మా హాస్పిటల్ హైదరాబాద్, విజయవాడలో పేషెంట్లకు అందుబాటులో ఉంది.
- పేషెంట్ల పట్ల తీసుకునే జాగ్రత్తలు అత్యుత్తమ ఫలితాలను పురస్కరించుకొని అమెరికాలోని సర్జికల్ రివ్యూ కార్పొరేషన్ మా హాస్పిటల్‌కు ఇంటర్నేషనల్ సెంటర్ ఆఫ్ ఎక్సలెన్స్‌గా గుర్తింపు ఇచ్చింది.
- మా హాస్పిటల్ వైద్య బృదంలో సర్జన్లు, ఫిజీషియన్లు, అనస్థిషియాలజిస్ట్‌లు, సైకాలజిస్టులు, కౌన్సిలర్లు, ప్రత్యేక శిక్షణ పొందిన నర్సులు, డైటీషియన్లు ఫిజియోథెరపిస్టులు తదితర నిపుణులు ఉన్నారు.
- పేషెంట్లపై ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం మా హాస్పిటల్ విశిష్టత. ఒక నర్సు పర్యవేక్షణలో ఒక పేషెంట్ మాత్రమే ఉంటారు. నర్సు పెషెంట్ నిష్పత్తి 1:1 రీతిలో ఉంటుంది. అలాగే సర్జరీ తర్వాత కూడా పేషెంట్ తీసుకోవలసిన ఆహారం జీవన శైలి వంటి విషయాలపై సంపూర్ణ అవగాహన కల్పించడంతోపాటు ఎప్పటి కప్పుడు సమీక్షించడం జరుగుతుంది.




**బుధవారం: 23 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్ష రుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** విదియ రా. 9.03 తదుపరి తదియ
**నక్షత్రం:** పుబ్బ మ. 2.04 తదుపరి ఉత్తర
**వర్జ్యం:** రా. 9.15 నుంచి 10.51 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 11.53 నుంచి 12.43 వరకు
**అమృతఘడియలు:** ఉ. 7.51 నుంచి 9.24 వరకు
**రాహుకాలం:** మ. 12.00 నుంచి 1.30 వరకు
**సూర్యోదయం:** 6.04
**సూర్యాస్తమయం:** 6.33

**గురువారం: 24 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** తదియ రా. 8.27 తదుపరి చవితి
**నక్షత్రం:** ఉత్తర మ. 2.00 తదుపరి హస్త
**వర్జ్యం:** రా. 10.37 నుంచి 12.15 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 10.13 నుంచి 11.03 వరకు, మ. 3.13 నుంచి 4.02 వరకు
**అమృతఘడియలు:** ఉ. 6.50 నుంచి 8.25 వరకు
**రాహుకాలం:** మ. 1.30 నుంచి 3.00 వరకు
**సూర్యోదయం:** 6.04
**సూర్యాస్తమయం:** 6.32

**శుక్రవారం: 25 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్ష రుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** చవితి రా. 8.32 తదుపరి పంచమి
**నక్షత్రం:** హస్త మ. 2.36 తదుపరి చిత్త
**వర్జ్యం:** రా. 11.01 నుంచి 12.42 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 8.34 నుంచి 9.23 వరకు, మ. 12.43 నుంచి 1.32 వరకు
**అమృతఘడియలు:** ఉ. 8.27 నుంచి 10.05 వరకు
**రాహుకాలం:** ఉ. 10.30 నుంచి 12.00 వరకు
**సూర్యోదయం:** 6.04
**సూర్యాస్తమయం:** 6.31

**శనివారం: 26 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్ష రుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** పంచమి రా. 9.18 తదుపరి షష్ఠి
**నక్షత్రం:** చిత్త మ. 3.51 తదుపరి స్వాతి
**వర్జ్యం:** రా. 9.54 నుంచి 11.38 వరకు
**దుర్ముహూర్తం:** ఉ. 6.04 నుంచి 6.54 వరకు
**అమృతఘడియలు:** ఉ. 9.07 నుంచి 10.48 వరకు
**రాహుకాలం:** ఉ. 9.00 నుంచి 10.30 వరకు
**సూర్యోదయం:** 6.04
**సూర్యాస్తమయం:** 6.30

**ఆదివారం: 27 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్ష రుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** షష్ఠి రా. 10.42 తదుపరి సప్తమి
**నక్షత్రం:** స్వాతి సా. 5.45 తదుపరి విశాఖ
**వర్జ్యం:** రా. 11.55 నుంచి 1.41 వరకు
**దుర్ముహూర్తం:** సా. 4.50 నుంచి 5.40 వరకు
**అమృతఘడియలు:** ఉ. 8.15 నుంచి 9.59 వరకు
**రాహుకాలం:** సా. 4.30 నుంచి 6.00 వరకు
**సూర్యోదయం:** 6.05
**సూర్యాస్తమయం:** 6.30

**సోమవారం: 28 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్ష రుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** సప్తమి రా. 12.37 తదుపరి అష్టమి
**నక్షత్రం:** విశాఖ రా. 8.10 తదుపరి అనూరాధ
**వర్జ్యం:** రా. 12.38 నుంచి 2.25 వరకు
**దుర్ముహూర్తం:** మ. 12.42 నుంచి 1.31 వరకు, మ. 3.11 నుంచి 4.00 వరకు
**అమృతఘడియలు:** ఉ. 10.28 నుంచి 12.14 వరకు
**రాహుకాలం:** ఉ. 7.30 నుంచి 9.00 వరకు
**సూర్యోదయం:** 6.05
**సూర్యాస్తమయం:** 6.28

**మంగళవారం: 29 ఆగస్టు 2017**

**శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్ష రుతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం**
**తిథి:** అష్టమి రా. 2.53 తదుపరి నవమి
**నక్షత్రం:** అనూరాధ రా. 10.57 తదుపరి జ్యేష్ఠ
**వర్జ్యం:** తె. 5.51 మొదలు
**దుర్ముహూర్తం:** ఉ. 8.34 నుంచి 9.23 వరకు, రా. 10.16 నుంచి 11.01 వరకు
**అమృతఘడియలు:** ఉ. 11.21 నుంచి 1.08 వరకు
**రాహుకాలం:** మ. 3.00 నుంచి 4.30 వరకు
**సూర్యోదయం:** 6.05
**సూర్యాస్తమయం:** 6.28

## మెయిల్ బాక్స్

**అభినందనీయం**

రూపం, నటన, వాచకాలలో ప్రతిభగల నటుడు మురళీమోహన్. తనదైన అరుదైన క్రమశిక్షణ, అంకితభావాలతో విజయభేరి మోగించి వ్యాపార, రాజకీయ రంగాలలో దక్షుడై విజయసోపానాలు అధిరోహించారు మురళీమోహన్. వారి జీవిత విశేషాలు ప్రచురించడం అభినందనీయం.

'జీవనరాగం' కథలో అన్నపూర్ణ రచయిత్రి నిజ జీవితంలోని అనురాగ పరంపరను చక్కగా చెప్పారు. నిఖిలేశ్వర్ 'మౌనం ఆవహించేదాకా' కవిత చక్కని పదశబ్ద సౌందర్యంతో ఒప్పారింది. దేవుడు బాగా ప్రియంలో చేదునిజాలను సబబుగా చర్చించారు.

*–డా.శివభూషణం, కర్నూలు*

**నవ్య చదివి వ్రతం ఆచరించాం**

ఇక్కడ మా మహారాష్ట్రవీధిలో ఉండే మహిళలందరం నవ్య వీక్లిలో ప్రచురించిన సౌభాగ్యప్రదం వరలక్ష్మీవ్రతం' ఆర్టికల్‌కు అనుగుణంగానే వ్రతం ఆచరించాం. మా అభిమాన పత్రిక నవ్య వీక్లికి మా మహారాష్ట్రవీధి తరపున కృతజ్ఞతలు. మొదటిపేజీ కబుర్లు వరలక్ష్మి ఎందుకు తాను సాదాజీవితం గడిపిందో తెలిసింది. ఓ వారాలబ్బాయి విజయభేరి మురళీ మోహన్‌గారి జీవితంలో జరిగిన విషయాలు ముందు ముందు మరిన్ని తెలుసుకుంటామని ఆశిస్తున్నాం.

*–తేనేటి రమ్యదీప్తి, సత్తెనపల్లి*

**ఆకట్టుకున్న స్కిట్**

మార్నింగ్‌కాఫీలో ముగ్గురు తాగుబోతుల స్కిట్ ఆకట్టుకుంది. మొదటిపేజీ హృద్యంగా ఉంది. సీరియల్స్ అన్నీ పోటాపోటీగా విభిన్న కథాంశాలతో కొనసాగుతున్నాయి. తారకరామారావుగారి సేకరణ అంశాలు ఆసక్తికరం. జీవనరాగం కథా రచయిత అన్నపూర్ణగారికి అభినందనలు. సురభి వారం వారం కొత్త అంశాల్ని ప్రోదిచేస్తోంది. కార్టూన్లు, ఇతర శీర్షికలు ఆహ్లాదపరిచాయి. సంతోషి లక్ష్మిగారి వ్యాసాలు స్ఫూర్తిదాయకం.

*–నేమానసుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం*

**తమాషాగా ఉంది**

జైలు జీవితం ఎలా ఉంటుందో తెలుసుకోవడానికి ఫీజు చెల్లించిమరీ సరదాగా ఒకరోజు జైలులో గడిపి రావడానికి అవకాశం ఇవ్వడం తమాషాగా ఉంది. చెన్నైలో జైలు వాతావరణం సృష్టించి టిఫిన్లు, భోజనం పెట్టే ఒక హోటల్ ఉందని విన్నాం. ఏమిటో ఈ జైలు ప్రేమ, సంగతులు, సందర్భాలు ఎంతో ఆహ్లాదకరంగా ఉంటున్నాయి. ముఖ్యంగా రచనా విధానం బాగుంది. ఈ వారం 'ఇరకాటంలో పెట్టే పొరపాట్లు' అలరించాయి. ప్రముఖ నటీనటుల జీవితగాథలు వారిమాటల్లోనే అందించడం ఒక సరికొత్త ప్రయోగం. వారాలబ్బాయి జయభేరి ఆసక్తికరంగా ఉంది. కథలు, సీరియల్స్ అన్నీ మనోరంజకంగా ఉంటున్నాయి.

*–కె.సుభాష్, శ్రీనగర్.తూ.గో.జిల్లా*

**జయభేరి రసవత్తరం**

ఈ వారం నవ్య వీక్లీ చాలా బాగుంది. ముఖ్యంగా నటుడు మురళీమోహన్ పరిచయం ఓ వారాలబ్బాయి జయభేరి రసవత్తరంగా ఉంది. వరలక్ష్మీవ్రతం ప్రత్యేక వ్యాసం ఇంటిల్లిపాదినీ ఆకర్షించేలా ఉంది. తెలుగింటి నవ్య వారపత్రిక వెలుగింట్లో ఆనందాలు పంచేలా ఉంది.

*–ఎల్.ప్రఫుల్లచంద్ర, ధర్మవరం*

**ధన్యవాదాలు**

ఈ వారం వరలక్ష్మీవ్రతకల్పం వ్యాసం ప్రచురించినందుకు ధన్యవాదాలు. ఫిదా హీరోయిన్ సాయిపల్లవి ఇంటర్వ్యూ బాగుంది. వారాలబ్బాయి జయభేరి మనసుకు హత్తుకుంది. 75 ఏళ్ళ మురళీమోహన్ గారిని అభినందిస్తున్నాం.

*–కోలిపాక శ్రీనివాస్, బెల్లంపల్లి*

## నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో

# తురగా జానకీరాణి కథల పోటీ ఫలితాలు

నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్తంగా నిర్వహించిన తురగా జానకీరాణి కథలపోటీకి 726 కథలు వచ్చాయి. వర్ధమానరచయితలతో పాటు లబ్ధప్రతిష్టులైన రచయితలు కూడా ఈ పోటీలో పాల్గొన్నారు. ఈ కథలన్నిటినీ నవ్య సంపాదకవర్గంతోపాటు ముగ్గురు ప్రముఖ రచయితలు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించి చదివారు. బహుమతికథలను ఎంపిక చేశారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులకు తగిన కథలు లేనందున ఆ బహుమతులను రద్దు చేశారు. ఆ బహుమతుల మొత్తాన్ని మరో 5 విశేష బహుమతులకు అందజేసి, విశేషబహుమతులను 5నుంచి 10కి పెంచారు. బహుమతికథలతో పాటు సాధారణ ప్రచురణకు 93 కథలను ఎంపిక చేశారు. ఈ కథలన్నీ వీలువెంబడి నవ్యవీక్లిలో ప్రచురితమవుతాయి. ఈ కథల ప్రచురణ గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు. పోటీలో విజేతలైన రచయితలకు అభినందనలు. పోటీలో పాల్గొన్న వారందరికీ ధన్యవాదాలు.

–సంపాదకుడు

### రూ.5000 బహుమతి పొందిన కథలు

1. **అడవితనం** – మల్లిపురం జగదీశ్
2. **అమృతవర్షిణి** – ఒలేటి శ్రీనివాసభాను
3. **బరువు–బాధ్యత** – గంటి భానుమతి
4. **బయోడైవర్సిటి** – డా. నక్కా విజయరామరాజు
5. **జీవనధర్మం** – వారాల కృష్ణమూర్తి
6. **పల్లెకుపోదాం** – తుల్లి రాజగోపాల్
7. **పతివ్రత** – ఆదోని బాషా
8. **వారసుడు** – బి.మురళీధర్
9. **ఊబి** – సలీం
10. **సోల్‌మేట్** – ప్రభాకర్ జైని

### సాధారణ ప్రచురణకు స్వీకరించిన కథలు

1. తానొకటి తలచిన – డి.కామేశ్వరి
2. ఒకరికొకరం – జి.ఎస్.లక్ష్మి
3. ఇదీ మానవతే – జి.ఎస్.లక్ష్మి
4. రోల్‌మోడల్ – ఎం.వెంకటేశ్వరరావు
5. అద్దెకు దొరకనిది – వసుంధర
6. సంస్కృతి – వియోగి
7. బరువు–బాధ్యతలు – వియోగి
8. ప్రకృతి – వారణాసి ప్రసాదరావు
9. తీరని ఋణం తీరిపోయిందా – శ్రీమతి తాటికోల పద్మావతి
10. పెద్దరికం – అత్తలూరి విజయలక్ష్మి
11. మాయజలతారు – సలీం
12. బాపుబొమ్మ – సింహప్రసాద్
13. రామాయణం – సింహప్రసాద్
14. బంధాలు–అనుబంధాలు – బి.నర్సన్
15. సహజీవనం – చెన్నూరి సుదర్శన్
16. అవివిక్త – డా.మంథా భానుమతి
17. అమ్మకూ కావాలి బ్రేక్ – జ్యోతి వలబోజు
18. మట్టిమనిషి – కె.కె.రఘునందన
19. పరిమళం – డా. ఆలూరి విజయలక్ష్మి
20. శ్రీరామ్మూర్తిగారి ఇల్లు – పోలాప్రగడ రాజ్యలక్ష్మి
21. చెదపురుగులు – డా. డి.విద్యేశ్వరి
22. లయ తప్పిన గుండె – యస్.డి.వి.అజీజ్
23. దూరం దూరం – డేగల అనితాసూరి
24. పిడుగు మంత్రం – డేగల అనితాసూరి
25. మేనేజ్ చేసేద్దాం – ప్రఫుల్లచంద్ర
26. లోపం – ప్రఫుల్లచంద్ర
27. పచ్చతోరణాలు – జయంతి ప్రకాశశర్మ
28. డబ్బులేని జీవితం – బి.వి.ఎల్
29. జాతస్య మరణం ధ్రువం – జియోలక్ష్మణ్
30. గోమాలచ్చిమి – బి.వి.రమణమూర్తి
31. గోవత్సం – బి.వి.రమణమూర్తి
32. నిర్ణయం – గోనుగుంట మురళీకృష్ణ
33. అర్జెంట్ పెళ్ళి – వి.వి.సత్యప్రసాద్
34. దానం – ర్యాలి ప్రసాద్
35. ఉరిశిక్ష – డాక్టర్ దిలావర్
36. పరిస్థితిని బట్టే ప్రవర్తన – దూరి వెంకటరావు
37. జీవితం మైనస్ జీవితం – ఆదెళ్ళ శివకుమార్
38. క్షేత్రపాలకుడు – వేదగిరి రాంబాబు
39. మృగాళ్ళు – విరించి
40. ఒక్కడు – డి.ఆర్.ఇంద్ర
41. రాజు రాజు గుమ్మడిపండు – ఐతా చంద్రయ్య
42. రెండు శవాలు కొంటే ఒక శవం ఉచితం – శీరం నారాయణస్వామి
43. తోడేళ్ళు – శీరం నారాయణస్వామి
44. అమ్మ ఒడి – సౌజన్యకిరణ్
45. ఆనందం.... అదృష్టం – మానస
46. ఆమె – అంగర వెంకటశివప్రసాదరావు
47. ఆలి కోరిన చీర – రాచపూటి రమేష్
48. సాక్ష్యం – గంధం యాజ్ఞవల్క్యశర్మ
49. మా వీధిలో దుఖాణం – శ్రీకంఠస్ఫూర్తి
50. శ్వేతపత్రం – యస్వీకృష్ణ
51. చేసిందెక్కడికీ పోదు – యన్.కె.నాగేశ్వరరావు
52. అమ్మ ఒడి – గొల్లపూడి రాజ్యలక్ష్మి
53. శాలినీ వెడ్స్ సుందరం – జయంతి వెంకటరమణ
54. ప్రాప్తం – జయంతి వెంకటరమణ
55. కాంతంతో కాసేపు – డాక్టర్ యన్.రామచంద్ర
56. తితిక్ష – పి.ఎస్.నారాయణ
57. కుందనం బొమ్మ – డి.వి.రమణి
58. ....క్షోదీయనపి గచ్ఛతి – షేక్ అహమద్‌బాష
59. అమ్మ – షేక్ అహమద్‌బాష
60. ప్రజాసేవ – భమిడిపాటి గౌరీశంకర్
61. బహుమతి – భమిడిపాటి గౌరీశంకర్
62. దేవుడు–మనిషి – తటవర్తి నాగేశ్వరి
63. నానమ్మ – తటవర్తి నాగేశ్వరి
64. అరుంధతి – అనురాధ(సుజలగంటి)
65. ఎవరు బాధ్యులు – అనురాధ (సుజలగంటి)
66. గమ్యం – గన్నవరపు నరసింహమూర్తి
67. తూర్పు సంధ్యారాగం – గన్నవరపు నరసింహమూర్తి
68. సుమంగళి – సోమవరపుల నాగేంద్రప్రసాదు
69. ఆనంద నిలయం – సోమవరపుల నాగేంద్రప్రసాదు
70. చేతకాని మనిషి – శరత్‌చంద్ర
71. జరీనా – శరత్‌చంద్ర
72. మార్పు – సి.ఉమాదేవి
73. అమ్మదగ్గరున్నాను – వాణిశ్రీ
74. చేపలక్క – పోట్లూరు సుబ్రహ్మణ్యం
75. ఆత్మానుబంధాలు – జాస్తి రమాదేవి
76. రంగులరాట్నం – ఎన్.తారకరామారావు
77. చీకటిపూలు – సి.యస్.రాంబాబు
78. ఆదరణ – వి.రాజారామమోహనరావు
79. ప్రతిరూపాలు – చంద్రశేఖర్ అజాద్. పి
80. అనుబంధం – పోలాప్రగడ జనార్దనరావు (జెన్ని)
81. వలస కలలు – అత్రిపత్రి ధర్మశాంత్ ప్రభాకర్‌రావు
82. దర్శనం – నెల్లుట్ల రమాదేవి
83. బంధం – వల్లూరు శివప్రసాద్
84. అమ్మేనా ప్రాణం – దుర్గమహాన్తి మోహనరావు
85. ఇదో న్యాయం – సి.యమున
86. ఆద్మి, ఔరత్ ఔర్ జమీన్ – పుప్పాల కృష్ణమూర్తి
87. బాజా భజంత్రీలు – జంధ్యాల మాలతి
88. మునిమాపు వేళ – మంత్రవాది మహేశ్వర్
89. చందమామ మసకేసి పోయే – శ్రీధర
90. నిమిత్తమాత్రులు – పి. అమరజ్యోతి
91. దర్శనం – మణి వడ్లమాని
92. 'ప్రేమించే మనసు' – ఎం.రమేష్‌కుమార్
93. నెక్ టై – యస్.వివేకానంద

నవ్యవీక్లి-తురగా ఫౌండేషన్ సంయుక్త నిర్వహణలో

# తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీ ఫలితాలు

నవ్యవీక్లి–తురగా ఫౌండేషన్ సంయుక్తంగా నిర్వహించిన తురగా కృష్ణమోహనరావు హాస్యకథల పోటీకి 522 కథలు వచ్చాయి. వర్ధమాన రచయితలతోపాటు లబ్ధప్రతిష్టులైన రచయితలు కూడా ఈ పోటీలో పాల్గొన్నారు. ఈ కథలన్నిటినీ నవ్య సంపాదక వర్గంతోపాటు ముగ్గురు ప్రముఖరచయితలు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించి చదివారు. బహుమతి కథలను ఎంపిక చేశారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులకు తగిన కథలు లేనందున ఆ బహుమతులను రద్దు చేశారు. ఆ బహుమతుల మొత్తాన్ని మరో 5 విశేష బహుమతులకు అందజేసి, విశేష బహుమతులను 5నుంచి 10కి పెంచారు. బహుమతికథలతో పాటు సాధారణ ప్రచురణకు 47 కథలను ఎంపిక చేశారు. ఈ కథలన్నీ వీలువెంబడి నవ్యవీక్లిలో ప్రచురిత మవుతాయి. ఈ కథల ప్రచురణ గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు. పోటీలో విజేతలైన రచయితలకు అభినందనలు. పోటీలో పాల్గొన్న వారందరికీ ధన్యవాదాలు.

–సంపాదకుడు

## రూ.5000 బహుమతి పొందిన కథలు

| | | | |
|---|---|---|---|
| 1. | టైమొచూజాగు | – | 'మానస' |
| 2. | అయ్యవారికి చాలు అయిదు కలహాలు | – | తులసి బాలకృష్ణ |
| 3. | ఎలుకలుకలుకలు | – | సరసి |
| 4. | మురళీమోహనం | – | గుమ్మడి రవీంద్రనాథ్ |
| 5. | కౌటిల్యుడి కజిన్ సిస్టర్ | – | శ్రీధర |
| 6. | రోబో సుందరి పెళ్ళికూతురాయెనే! | – | పి.వి.డి.ఎస్.ప్రకాష్ |
| 7. | కామెడీ వర్క్‌షాప్ | – | ద్విభాష్యం రాజేశ్వరరావు |
| 8. | భేతాళ ప్రశ్న | – | శ్రీమతి పి.వి.శేషారత్నం |
| 9. | కరెంట్ షాక్ | – | పోలాప్రగడ జనార్దనరావు (జెన్ని) |
| 10. | స్వర్గం! నరకం! | – | బాచి |

## సాధారణ ప్రచురణకు స్వీకరించిన కథలు

| | | | |
|---|---|---|---|
| 1. | ఆచూకి | – | గంధం యాజ్ఞవల్క్యశర్మ |
| 2. | యన్నార్రైఅన్నారన్నయ్యో | – | రాంపా |
| 3. | పుష్కరస్నానం | – | తటవర్తి నాగేశ్వరి |
| 4. | శ్రీరాములవారి సహాయం కావలెను | – | విరించి |
| 5. | భజన సామ్రాట్ | – | శ్రీకంఠస్ఫూర్తి |
| 6. | అయిదుగంటల సుబ్బారావు | – | నడిమింటి నరసింగరావు |
| 7. | సెల్ఫీ వెడ్స్ వాట్సాప్ | – | ఎమ్వీ రామిరెడ్డి |
| 8. | రాగం... తాళం....!! | – | ఆకునూరి మురళీకృష్ణ |
| 9. | "రాంబాబు వర్సెస్ ర్యాంబో | – | ఆదోని బాషా |
| 10. | బ్లాక్ & వైట్ చిత్రం | – | బి.కె. ఈశ్వర్ |
| 11. | గీకుడు గుండె | – | భమిడి వెంకటేశ్వర్లు |
| 12. | అవార్డు | – | వాణిశ్రీ |
| 13. | ఇలా జరిగేను... | – | వాణిశ్రీ |
| 14. | షరతులు వర్తిస్తాయి | – | శ్రీఉదయిని |
| 15. | వంటొచ్చిన పెళ్ళాం | – | డి.కామేశ్వరి |
| 16. | కోపంకోపేన శీతలం | – | పి.చంద్రశేఖర్‌ఆజాద్ |
| 17. | వింతమనిషి విశ్వనాథం | – | వి.రాజారామమోహనరావు |
| 18. | గజ స్నానంతు నిష్ఫలం | – | ఎ.శ్రీధర్ |
| 19. | వినూత్న ప్రణాళిక | – | పి.వి.ఆర్.శివకుమార్ |
| 20. | జీవితాంతం – జీవితానంతరం | – | ఎం.సుగుణరావు |
| 21. | క(ల)థయో నిజమో.... | – | సి.యమున |
| 22. | యాంకర్ | – | సి.జయపాల్‌రెడ్డి |
| 23. | లక్షస్నేహాల వ్రతం | – | తిరుమలశ్రీ |
| 24. | బాహుబలి | – | జి.రవీంద్రనాథ్ |
| 25. | ఆవాహయామి | – | ఎం.వెంకటేశ్వరరావు |
| 26. | అ(అప్పలకొండ)–ఆ (ఆనందరావు) | – | మణి వడ్లమాని |
| 27. | నాన్నా.... క్రయ్... | – | వారణాసి ప్రసాదరావు |
| 28. | ఉప్పేంద్రా....! | – | చెన్నూరి సుదర్శన్ |
| 29. | వాస్తుమేరా దోస్త్ | – | తుల్లి రాజగోపాల్ |
| 30. | తస్సాదియ్యా | – | శీరం నారాయణస్వామి |
| 31. | రేపటికి నేటిపురాణం | – | ఎలక్ట్రాన్ |
| 32. | వదిన – వేలం పాట | – | జి.ఎస్.లక్ష్మి |
| 33. | ద(దిశ) మారింది | – | కె.కె.భాగ్యశ్రీ |
| 34. | రారండోయ్... వేడుక చూద్దాం | – | పి.వి.డి.ఎస్.ప్రకాష్ |
| 35. | మన బంగారం మంచిదయితే... | – | పెనుమాక నాగేశ్వరరావు |
| 36. | డ్రైవింగ్ స్కూల్ | – | యస్ కందుకూరి |
| 37. | కనకపు సింహాసనమున | – | ఆనందరావ్ పట్నాయక్ |
| 38. | గడగడా కల్యాణం | – | రాచపూటి రమేష్ |
| 39. | మామ అల్లుడు ఓ శునకం | – | అనపర్తి సీతారామ్ |
| 40. | పాపం! బంగారయ్య | – | ఇందూ రమణ |
| 41. | 4జి పెళ్ళికూతురు | – | కెయస్సార్ కొత్తపల్లిశేష్ |
| 42. | దాహం... దాహం... | – | ఎం.రమేష్‌కుమార్ |
| 43. | చీమ.... చీమ.... చీమ | – | యలమర్తి అనురాధ |
| 44. | నవ్వా... నవ్వించు | – | తటవర్తి నాగేశ్వరి |
| 45. | వాడంతే | – | నమ్మికనక నాగేశ్వరరావు |
| 46 | క్రేజీ పీపుల్ | – | సింహప్రసాద్ |
| 47. | నభీ–7102 | – | సింహప్రసాద్ |




# వినాయక వ్రతకల్పం

వినాయకుడినే ముందుగా ఎందుకు ధ్యానించాలి? ఎందుకు పూజించాలి? అనే ప్రశ్నలు చాలామందిలో తలెత్తుతుంటాయి. వీటికి సమాధానాలు 'స్కంధపురాణం'లో ఉన్నాయి. సాక్షాత్తు పరమశివుడే వినాయకుడి గొప్పతనాన్ని దేవతలందరికీ చెప్పాడు. ఏ శుభకార్యం తలపెట్టినా ముందుగా వినాయకుడిని పూజిస్తే ఆపదలు తొలగుతాయని, తలపెట్టిన పనిలో జయం కలుగుతుందని శివుడు చెప్పాడు. వినాయక వ్రత విధానాన్ని పరిశీలిస్తే అన్నీ మనం సులువుగా చేసుకునే అంశాలే ఉంటాయి.

### వినాయక పూజకు కావలసిన వస్తువులు

పసుపు, కుంకుమ, గంధం, అక్షతలు, రెండు పాత్రలు, రెండు భరిణెలు, అగరువత్తులు, హారతి కర్పూరం, రెండు కొబ్బరికాయలు, డజను అరటి పళ్లు, 40 తమలపాకులు, 12 వక్కలు, పత్తి, వెడల్పుగా ఉండే రెండు పళ్లాలు, జేగంట, తుండుగుడ్డ, పాలవెల్లి, పత్తితో చేసిన రెండు యజ్ఞోపవీతాలు, కుంకుమలో అద్దిన ఎర్రటి వస్త్రాలు, దీపారాధన నూనె, అయిదు తమలపాకులు, రెండు వక్కలు, రెండు అరటి పండ్లతో ఉన్న ఆరు తాంబూలాలు, వినాయక ప్రతిమలు ఒకటి మట్టిది, రెండవది మామూలుది, 21 రకాల ఆకులు, విడిపూలు, పిల్లలు చదువుకునే పుస్తకాలు, పండుగరోజు సాయంత్రంవేళ ధరించే కొత్త వస్త్రాలు, పంచామృతం.

### పూజా విధానం

పూజా విధానంలో ప్రధానంగా 27 అంశాలు ఉంటాయి. ఈ 27 అంశాల్లోనే పదహారు ఉపచారాలు (షోడశోపచారాలు) ఉంటాయి. ధ్యానం, ఆచమనం, భూతోచ్చాటనం, ప్రాణాయామం, సంకల్పం, కలశపూజ, వినాయక ధ్యానం, ఆవాహనం, ఆసనం, అర్ఘ్యం, పాద్యం, ఆచమనం, పంచామృత స్నానం, ఫలోదకం (కొబ్బరి నీరు)తో స్నానం, వస్త్రం, యజ్ఞోపవీతం, గంధం, ధవళాక్షతలు, అంగ పూజ, పత్రిపూజ, అష్టోత్తర, శతనామపూజ, ధూపం, దీపదర్శనం, నైవేద్యం, తాంబూలం, మంత్రపుష్పం, వినాయక పద్యాలు చదవటం అనే ఈ 27 అంశాలను ఒక దాని తర్వాత ఒకటి చేస్తూ రావాలి.



### ధ్యానం....

శ్లో: శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే

శ్లో: అగజానన పద్మార్కం గజానన మహర్నిశం
అనేక దంతం భక్తానామ్ ఏకదంత ముపాస్మహే

శ్లో: సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో వినాయకః

శ్లో: ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః
వక్రతుండ శూర్పకర్ణః హేరంబస్కందపూర్వజః
షోడశైతాని నామాని యః పఠేత్ శృణుయాదపి
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయితే

శ్లో: గజాననం భూతగణాది సేవితం
కపిత్థ జంబూఫలసార భక్షణం..
ఉమాసుతం శోకవినాశ కారణం
నమామి విఘ్నేశ్వర పాదపంకజమ్

### ఆచమనం..

పంచపాత్రలోని నీటిని ఉద్ధరణితో తీసుకుని కేశవనామాలు జపిస్తూ మూడుసార్లు ఆచమనం (చేతిలో ఉద్ధరణితో నీటిని కుడి అరచేతిలో పోసుకొని చప్పుడుకాకుండా తాగాలి) చేయాలి.

ఓం కేశవాయ స్వాహా
ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయ స్వాహా
(అనంతరం చేతిని శుద్ధి చేసుకోవాలి.)

ఓం గోవిందాయనమః (అంటూ.... ఉద్ధరణితో అరచేతిలోకి నీటిని తీసుకుని కిందకు వదలాలి)

### కేశవనామాలు

ఓం విష్ణవేనమః, ఓం మధుసూదనాయనమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయనమః, ఓం శ్రీధరాయనమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః ఓం దామోదరాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అధోక్షజాయ నమః, ఓం నారసింహాయ నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్దనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః, ఓం శ్రీకృష్ణాయ నమః

### భూతోచ్చాటనం...

శ్లో: ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమి భారకాః
ఏతేషాం అవిరోధేన బ్రహ్మకర్మ సమారభే

అని అన్ని దిక్కులవైపూ కొద్దికొద్దిగా నీళ్లు చల్లాలి.

ఆ తర్వాత ప్రాణాయామం (బొటన వేలితో ముక్కు కుడి వైపు రంధ్రాన్ని మూసి ఎడమ వైపు రంధ్రం గుండా గాలిని పీల్చి కొద్దిసేపటి తరువాత ఎడమ వైపు రంధ్రాన్ని వేలితో మూసి కుడివైపు రంధ్రం గుండా గాలిని బయటకు వదలాలి)

"ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్స వితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్.. ఓ మాపో జ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం"

### సంకల్పం

మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం. శుభే శోభనే ముహూర్తే శ్రీ మహావిష్ణోరాజ్ఞాయ ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే, శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూ ద్వీపే, భరతవర్షే, భరత ఖండే, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య వాయువ్య ప్రదేశే, కృష్ణా, గోదావర్యో మధ్యదేశే, స్వగృహే (సొంత ఇల్లు కానప్పుడు "వసతిగృహే" అనుకోవాలి) సమస్త దేవతా హరిహర సన్నిధౌ అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చాంద్ర మానేన శ్రీ దుర్ముఖి నామ సంవత్సరే, దక్షిణాయనే, వర్షరుతౌ, భాద్రపదమాసే, శుక్లపక్షే చతుర్థ్యాం తిథౌ లక్ష్మీవాసరే, శుభనక్షత్రే, శుభ యోగే, శుభకరణే, ఏవంగుణ శేషణ విశిష్టాయం శుభ తిథౌ మమ... శ్రీమాన్/శ్రీమతః... గోత్రోద్భవస్య (ఇక్కడ మీ గోత్రం చెప్పుకోవాలి) నామధేయస్య (ఇంటి యజమాని పేరు) ధర్మపత్నీ సమేతాయం (ఇంటి యజమానురాలి పేరు) సహకుటుంబానాం, క్షేమస్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థ ఫలసిద్ధ్యర్థం, అష్ట ఐశ్వర్యాది యోగ్యతా ఫలసిద్ధ్యర్థం, ధన కనక వస్తు వాహనాభివృద్ధ్యర్థం సర్వదేవతా ప్రసాద సిద్ధ్యర్థం శ్రీ వరసిద్ధి వినాయక ప్రేరణ్యా శ్రీ వరసిద్ధి వినాయక ప్రీత్యర్థం ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే... (ఉంగరం వేలితో నీటిని స్పృశించాలి).

### కలశపూజ

శ్లో: కలశస్య ముఖే విష్ణుః, కంఠే రుద్ర స్సమాశ్రితః
మూలే తత్రస్థితోః బ్రహ్మ, మధ్యే, మాతృ గణాస్మృతః
కుక్షౌతు సాగరా స్సర్వే, సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదో యజుర్వేదో స్సామవేదోహ్యధర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః

**గణపతి ధ్యానం**

శ్లో: భవ సంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణా
విఘ్నాంధకార భాస్వంతం విఘ్నరాజాం అహంభజే

శ్లో: ఏక దంతం శూర్ప కర్ణం గజవక్త్రం చతుర్భుజం
పాశాంకుశ ధరం దేవం ధ్యాయేత్ సిద్ధి వినాయకం

శ్లో: ఉత్తమం గణనాథస్య వ్రతం సంపత్కరం శుభం
భక్తాభీష్ట ప్రదం తస్మాత్ ధ్యాయేత్ విఘ్ననాయకం
శ్రీ సిద్ధి వినాయకాయనమః ధ్యాయామి ధ్యానం సమర్పయామి

**ఆవాహనం**

శ్లో: అత్రాగచ్ఛ జగద్వంద్య సుర రాజార్చితేశ్వర
అనాథ నాథ స్సర్వజ్ఞ గౌరీగర్భ సముద్భవ
శ్రీ సిద్ధి వినాయకాయనమః ఆవాహయామి, ఆవాహనం సమర్పయామి

**ఆసనం**

శ్లో: మౌక్తికైః పుష్యరాగైశ్చ నానారత్న విరాజితం
రత్న సింహాసనం చారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం
శ్రీ సిద్ధి వినాయకాయనమః రత్న సింహాసనం సమర్పయామి

**అర్ఘ్యం**

శ్లో: గౌరీపుత్ర నమస్తేస్తు శంకర ప్రియనందన
గృహాణార్ఘ్యం మయాదత్తం గంధపుష్పాక్షితైర్యుతం
శ్రీ సిద్ధి వినాయకాయ నమః అర్ఘ్యం సమర్పయామి అని ఉద్ధరణితో నీటిని తీసుకొని వదలాలి.

**పాద్యం**

శ్లో: గజవక్త్రం నమస్తుభ్యం సర్వాభీష్ట ప్రదాయకం
భక్తాపాద్యం మయాదత్తం గృహాణ ద్విరదానన
శ్రీ సిద్ధి వినాయకాయ నమః పాద్యం సమర్పయామి అని ఉద్ధరణితో నీటిని వదలాలి

**ఆచమనం**

శ్లో: అనాథ నాథ సర్వజ్ఞ గీర్వాణ వరపూజితః
గృహాణాచమనం దేవతుభ్యం దత్తం మయా ప్రభో
శ్రీ సిద్ధి వినాయకాయ నమః ఆచమనీయం సమర్పయామి అని ఉద్ధరణితో నీటిని వదలాలి.

**మధుపర్కం**

శ్లో: దధిక్షీర సమాయుక్తం మధ్వాజ్యేన సమన్వితం
మధుపర్కం గృహాణేదం గజవక్త్ర నమోస్తుతే



శ్రీ సిద్ధి వినాయకాయ నమః మధుపర్కం సమర్పయామి

**పంచామృత స్నానం**

శ్లో: స్నానం పంచామృతైర్దేవ గృహాణ గణనాయక
అనాథ నాథ సర్వజ్ఞ గీర్వాణి గణపూజితా
శ్రీ సిద్ధి వినాయకాయ నమః పంచామృత స్నానం సమర్పయామి

**కొబ్బరి నీటితో స్నానం**

శ్లో: గంగాది సర్వ తీర్థేభ్యః ఆహృతైరమలైర్జలైః
స్నానం కరిష్యామి భగవాన్ ఉమాపుత్ర నమోస్తుతే
శ్రీ సిద్ధి వినాయకాయ నమః శుద్ధోదక స్నానం సమర్పయామి

**వస్త్రం**

శ్లో: రక్త వస్త్రద్వయం చారు దేవయోగ్యంచ మంగళం
శుభప్రదం గృహాణత్వం లంబోదర హరాత్మజ
శ్రీ సిద్ధి వినాయకాయనమః వస్త్రయుగ్మం సమర్పయామి

**యజ్ఞోపవీతం**

శ్లో: రాజితం బ్రహ్మసూత్రంచ కాంచనం చోత్తరీయకం
గృహాణ దేవ ధర్మజ్ఞ భక్తనామిష్ట దాయకః
శ్రీ సిద్ధి వినాయకాయనమః యజ్ఞోపవీతం సమర్పయామి

**గంధం**

శ్లో: చందనాగరు కర్పూర కస్తూరీ కుంకుమాన్వితం
విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతి గృహ్యతాం
శ్రీ సిద్ధి వినాయకాయనమః గంధం సమర్పయామి

**అక్షతలు**

శ్లో: అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాన్ తండులాన్ శుభాన్
గృహాణ పరమానంద ఈశపుత్ర నమోస్తుతే
శ్రీ సిద్ధి వినాయకాయ నమః అక్షతాన్ సమర్పయామి

**పుష్పాలు**

శ్లో: సుగంధాని సుపుష్పాణి, జాజీకుంద ముఖానిచ
ఏకవింశతి పత్రాణి సంగృహాణ నమోస్తుతే
శ్రీ సిద్ధి వినాయకాయ నమః పుష్పం సమర్పయామి

**అథాంగపూజ**

ఓం గణేశాయ నమః - పాదౌ పూజయామి
ఓం ఏకదంతాయ నమః - గుల్ఫౌ పూజయామి
ఓం శూర్పకర్ణాయ నమః - జానునీ పూజయామి
ఓం విఘ్నరాజాయ నమః - జంఘే పూజయామి
ఓం అఖువాహనాయ నమః - ఊరూ పూజయామి
ఓం హేరంబాయ నమః - కటిం పూజయామి
ఓం లంబోదరాయ నమః - ఉదరం పూజయామి
ఓం గణనాథాయ నమః - నాభిం పూజయామి
ఓం గణేశాయ నమః - హృదయం పూజయామి
ఓం స్థూల కంఠాయ నమః - కంఠం పూజయామి
ఓం స్కందాగ్రజాయనమః - స్కందౌ పూజయామి
ఓం పాశహస్తాయ నమః - హస్తౌ పూజయామి
ఓం గజవక్త్రాయ నమః - వక్త్రం పూజయామి
ఓం శూర్పకర్ణాయ నమః - కర్ణౌ పూజయామి
ఓం ఫాలచంద్రాయ నమః - లలాటం పూజయామి
ఓం సర్వేశ్వరాయ నమః - శిరఃపూజయామి
ఓం విఘ్నరాజాయ నమః - సర్వాణ్యంగాని పూజయామి
ఇవి చదువుతూ అక్షతలతోగాని, పుష్పాలతో గాని వినాయకుని పూజించాలి.

**పత్రి పూజ**

ఓం సుముఖాయ నమః - మాచీపత్రం పూజయామి
ఓం గణాధిపతయే నమః - బృహతీపత్రం పూజయామి
ఓం ఉమా పుత్రాయ నమః - బిల్వపత్రం (మారేడు) పూజయామి


MEDICAL COMPRESSION STOCKINGS


EXERCISE CYCLES


BACK REST


INFLATABLE TRAVEL NECK PILLOW



OSTOMY PASTE FROM COLOPLAST


SINGLE PIECE COLOSTOMY BAGS


HEEL CUSHIONS


HEEL GEL CUSHION


SHOULDER SUPPORT


HERNIA SUPPORT


ASH BRACE


2-PIECE COLOSTOMY BAGS





WEEKLY TABLET PLANNER


TABLET CUTTER


DIAMOND BP APPARATUS



DIGITAL BP MONITORS


FOOT-UP FOOT DROP BRACE


DIABETIC GEL SOCKS


FINGER EXERCISERS


GEL EXERCISE BALL


FLAT FOOT INSOLE


SHOULDER PULLEY

## BUY A WIDE RANGE OF SURGICAL GOODS AT WWW.SURGINEEDS.COM


DYNAMIC COCK UP SPLINT



KNEE WRAP- UNIVERSAL SIZE


L S BELT


EXERCISE THERAPY BANDS AND TUBES


KINESIOLOGY TAPES



EAR PLUGS



CIRONA-DVT PUMP



DVT PUMP SLEEVES




INFLATABLE ROUND PILLOW FOR PILES


SILICONE FOOT CARE PRODUCTS


LYMPHEDEMA PUMPS


WHEELCHAIRS


BATH CHAIR


BATH STOOL


COCCYX CUSHION


DONUT CUSHION FOR PILES


COMMODE ELEVATOR

SITZ BATH


**DAKSHIN MEDICAL SUPPORT SYSTEMS**
15C, MAHESWARI CHAMBERS,6-3-650,
SOMAJIGUDA,HYDERABAD-500082
TEL-040-23392681
WWW.SURGINEEDS.COM



ఓం గజాననాయ నమః – దూర్వాయుగ్మం (గరిక) పూజయామి
ఓం హరసూనవే నమః – దత్తూరపత్రం (ఉమ్మెత్త) పూజయామి
ఓం లంబోదరాయ నమః – బదరీపత్రం (రేగు) పూజయామి
ఓం గుహాగ్రజాయ నమః – అపామార్గపత్రం (ఉత్తరేణి) పూజయామి
ఓం గజకర్ణాయ నమః – తులసీ పత్రం పూజయామి
ఓం ఏకదంతాయ నమః – చూతపత్రం (మామిడి) పూజయామి
ఓం వికటాయ నమః – కరవీరపత్రం (గన్నేరు) పూజయామి
ఓం భిన్న దంతాయ నమః – విష్ణుక్రాంత పత్రం పూజయామి
ఓం వటవే నమః – దాడిమీపత్రం (దానిమ్మ) పూజయామి
ఓం సర్వేశ్వరాయ నమః – దేవదారుపత్రం పూజయామి
ఓం ఫాలచంద్రాయ నమః – మరువక పత్రం పూజయామి
ఓం హేరంబాయ నమః – సింధువార పత్రం (వావిలి) పూజయామి
ఓం శూర్పకర్ణాయ నమః – జాజీపత్రం పూజయామి
ఓం సురాగ్రజాయ నమః – గండకీపత్రం పూజయామి
ఓం ఇభవక్త్రాయ నమః – శమీపత్రం (జమ్మి) పూజయామి
ఓం వినాయకాయ నమః – అశ్వత్థ పత్రం (రావి) పూజయామి
ఓం సురసేవితాయ నమః – అర్జునపత్రం (తెల్లమద్ది, గన్నేరు) పూజయామి
ఓం కపిలాయ నమః  అర్కపత్రం (జిల్లేడు) పూజయామి
శ్రీ సిద్ధి వినాయకాయ నమః – ఏకవింశతి (21) పత్రాణి పూజయామి.

## అష్టోత్తర శతనామ (108) పూజ

ఓం గజాననాయ నమః
ఓం గణాధ్యక్షాయ నమః
ఓం విఘ్నరాజాయ నమః
ఓం వినాయకాయ నమః
ఓం ద్వైమాతురాయ నమః
ఓం ద్విముఖాయ నమః
ఓం ప్రముఖాయ నమః
ఓం సుముఖాయ నమః
ఓం కృతినే నమః
ఓం సుప్రవేశాయ నమః
ఓం సుఖనిధయే నమః
ఓం సురాధ్యక్షాయ నమః
ఓం సురారిఘ్నాయ నమః
ఓం మహాగణపతయే నమః
ఓం మాన్యాయ నమః
ఓం మహాకాలాయ నమః
ఓం మహాబలాయ నమః
ఓం హేరంబాయ నమః
ఓం లంబజఠరాయ నమః
ఓం హ్రాస్వగ్రీవాయ నమః
ఓం మంగళస్వరూపాయ నమః
ఓం ప్రమదాయ నమః
ఓం ప్రథమాయ నమః
ఓం ప్రాజ్ఞాయ నమః
ఓం విఘ్నకర్త్రె నమః
ఓం విఘ్నహంత్రే నమః
ఓం విశ్వనేత్రే నమః
ఓం విరాట్పతయే నమః
ఓం శ్రీపతయే నమః
ఓం వాక్పతయే నమః
ఓం శృంగారిణే నమః
ఓం ఆశ్రితవత్సలాయ నమః
ఓం శివప్రియాయ నమః
ఓం శీఘ్రకారిణే నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం బలాన్వితాయ నమః
ఓం బలోత్థితాయ నమః
ఓం భవాత్మజాయ నమః
ఓం పురాణ పురషాయ నమః
ఓం పూష్ణే నమః
ఓం పుష్కరోక్షిప్త వారినే నమః
ఓం మంత్రకృతే నమః
ఓం చామీకర ప్రభాయ నమః
ఓం పరస్మై నమః
ఓం సర్వోపాస్యాయ నమః
ఓం సర్వకర్త్రే నమః
ఓం సర్వనేత్రే నమః
ఓం సర్వ సిద్ధి ప్రదాయ నమః
ఓం పంచహస్తాయ నమః
ఓం పార్వతీనందనాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం కుమార గురవే నమః
ఓం అక్షోభ్యాయ నమః
ఓం కుంజరాసుర భంజనాయ నమః
ఓం ప్రమోదాత్తాయ నమః
ఓం మోదక ప్రియాయ నమః
ఓం కాంతిమతే నమః
ఓం ధృతిమతే నమః
ఓం కామినే నమః
ఓం కపిత్థవన ప్రియాయ నమః
ఓం మహోదరాయ నమః
ఓం మదోత్కటాయ నమః
ఓం మహావీరాయ నమః
ఓం మంత్రిణే నమః
ఓం విష్ణు ప్రియాయ నమః
ఓం భక్త జీవితాయ నమః
ఓం జితమన్మథాయ నమః
ఓం ఐశ్వర్య కారణాయ నమః
ఓం జ్యాయసే నమః
ఓం యక్షకిన్నర గంధర్వ సేవితాయ నమః
ఓం గంగాసుతాయ నమః
ఓం గణాధీశాయ నమః
ఓం గంభీర నినదాయ నమః
ఓం వటవే నమః
ఓం అభీష్ట వరదాయ నమః
ఓం జ్యోతిషే నమః
ఓం పుష్కరోక్షిప్త వారిణే నమః
ఓం అగ్రగణ్యాయ నమః
ఓం అగ్రపూజ్యాయ నమః
ఓం అగ్రగామినే నమః
ఓం భక్తనిధయే నమః
ఓం భావగమ్యాయ నమః
ఓం మంగళప్రదాయ నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం అప్రాకృత పరాక్రమాయ నమః
ఓం సత్యధర్మిణే నమః
ఓం సఖ్యై నమః
ఓం సరసాంబునిధయే నమః
ఓం మహేశాయ నమః
ఓం దివ్యాంగాయ నమః
ఓం మణికింకిణీ మేఖలాయ నమః
ఓం సమస్త దేవతామూర్తయే నమః
ఓం బ్రహ్మచారిణే నమః
ఓం బ్రహ్మరూపిణే నమః
ఓం బ్రహ్మ విద్యావిభవే నమః
ఓం జిష్ణవే నమః
ఓం సహిష్ణవే నమః
ఓం సతతోత్థితాయ నమః
ఓం విఘాత కారిణే నమః

ఓం విస్వధృతే నమః
ఓం విశ్వరక్షాకృతే నమః
ఓం కళ్యాణ గురవే నమః
ఓం ఉన్మత్త వేషాయ నమః
ఓం అపరాజితయే నమః
ఓం సమస్త జగదాధారాయ నమః
ఓం పరంజయినే నమః
ఓం సర్వైశ్వర్య ప్రదాయ నమః
ఓం అక్రాంత చిదచిత్రభవే నమః
ఓం శ్రీ విఘ్నేశ్వరాయ నమః
నానావిధ పరిమళ పత్రపుష్పాక్షితైః పూజాం సమర్పయామి

**ధూపం**

శ్లో: దశాంగం గుగ్గిలోపేతం
సుగంధం సుమనోహరం
ఉమాసుత నమస్తుభ్యం
గృహాణ వరదోభవ
శ్రీ సిద్ధి వినాయకాయ నమః ధూపమాఘ్రాపయామి



**దీపదర్శనం**

శ్లో: సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా
గృహాణ మంగళం దీపం ఉమాపుత్ర నమోస్తుతే
శ్రీ సిద్ధి వినాయకాయనమః దీపం దర్శయామి

**నైవేద్యం**

శ్లో: సుగంధాః సుకృతాశ్చైవ మోదకాన్ ఘృతపాచితాన్
నైవేద్యం గృహ్యతాం దేవ చణ ముద్గైః ప్రకల్పితాన్
భక్ష్యం భోజ్యంచ లేహ్యంచ చోష్యం పానీయ మేవచ
ఇదం గృహాణ నైవేద్యం మయాదత్తం వినాయక,
శ్రీ సిద్ధి వినాయకాయ నమః నైవేద్యం సమర్పయామి

**తాంబూలం**

శ్లో: పూగీఫలం సంయుక్తం నాగవల్లీ దళైర్యుతం
కర్పూర చూర్ణ సమాయుక్తం
తాంబూలం ప్రతి గృహ్యతాం
శ్రీ సిద్ధి వినాయకాయ నమః తాంబూలం సమర్పయామి

**నీరాజనం**

శ్లో: మంగళం సుముఖోదేవ మంగళం అఖువాహన
మంగళం విఘ్నరాజాయ మంగళం స్కంద పూర్వజః
శ్రీ సిద్ధి వినాయకాయ నమః
ఆనంద కర్పూర నీరాజనం సమర్పయామి
వక్రతుండ మహాకాయ
కోటి సూర్య సమప్రభ
నిర్విఘ్నం కురుమే దేవ
సర్వకార్యేషు సర్వదా

**మంత్ర పుష్పం**

శ్లో: సచ్చిదానంద విఘ్నేశ
పుష్కలాని ధనానిచ
భూమ్యాం స్థితాని భగవాన్
స్వీకురుష్వ వినాయక
శ్రీ సిద్ధి వినాయకాయనమః
సువర్ణ దివ్య మంత్ర పుష్పం సమర్పయామి

**చేతిలోనికి అక్షతలు తీసుకుని వినాయక వ్రత కథను ప్రారంభించండి.**

## వినాయక వ్రతకథా ప్రారంభం

సూత మహాముని శౌనకాది మహామునులకు విఘ్నేశ్వర జననం, ఆయన జన్మదినం రోజున చంద్రుని దర్శిస్తే కలిగే దోషాన్ని నివారించడం గురించి చెప్పసాగాడు.

పూర్వ కాలంలో గజాసురుడు అనే రాక్షసుడు శివుని గూర్చి తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చిన పరమశివుడు ప్రత్యక్షమయ్యాడు. నీకేం వరం కావాలో కోరుకో అని శివుడు చెప్పడంతో "నీవు ఎల్లప్పుడు నా కడుపులో నివసించాలి" అని గజాసురుడు కోరాడు. అప్పట్నుంచి శివుడు అతని కడుపులో ఉండసాగాడు. దీంతో కైలాసంలోని నంది, భృంగి, వీరభద్రుడు, ప్రమథ గణాలకు శివదర్శనం లభించలేదు. వీరందరూ పార్వతి దగ్గరకు వెళ్లారు. భర్త జాడ తనకు కూడా తెలియకపోవడంతో పార్వతి, ప్రమథాది గణాలతో కలిసి విష్ణుమూర్తిని ఆశ్రయించింది. విష్ణుమూర్తి కూడా పార్వతీదేవితో కలసి శివుడిని వెదకడానికి బయలుదేరాడు. చివరకు గజాసురుని కడుపులో శివుడు ఉన్నట్టు విష్ణువు తెలుసుకున్నాడు. అతని కడుపులోంచి శివుడిని బయటకు రప్పించటానికి ఒక ఉపాయాన్ని ఆలోచించాడు.

శివుని వాహనమైన నందిని అలంకరించాడు. బ్రహ్మతో పాటు తను, మిగిలిన దేవతలు రకరకాల వేషాలు ధరించి గజాసురుడు నివాసం ఉండే పట్టణానికి వెళ్లి నందిచేత నాట్యం చేయించడం మొదలు పెట్టారు. నంది అద్భుతంగా నాట్యం చేస్తున్న విషయం గజాసురుని వరకు వెళ్లింది. అతడు విష్ణుమూర్తి బృందాన్ని తన వద్దకు పిలిపించాడు. నంది నాట్యానికి ఆశ్చర్యపోయాడు. ఆనంద పారవశ్యంలో ఉన్న గజాసురుడు 'మీకేం కావాలో కోరుకోండని' మారు వేషాల్లో ఉన్న విష్ణు, బ్రహ్మలను అడిగాడు.

అప్పుడు విష్ణువు మాట్లాడుతూ నంది ఈశ్వరుని వాహనమని, గజాసురుడి గర్భంలో ఉన్న శివుడి కోసం వచ్చిందని చెప్పాడు. ఇచ్చిన మాట ప్రకారం ఈశ్వరుని అప్పగించాలని కోరారు. గజాసురుడికి నందితో ఉన్నవారంతా దేవతలని అర్థమయింది. ఇక తనకు చావు తప్పదని నిర్ధారించుకున్నాడు. అందుకని తన ముఖానికి శాశ్వతత్వాన్ని ప్రసాదించమని దేవతలను కోరాడు. నంది తన వాడి కొమ్ములతో గజాసురుని వక్షస్థలాన్ని చీల్చి సంహరించింది. అప్పుడు శివుడు గజాసురుని కడుపు నుంచి బయటకు వచ్చాడు. తర్వాత దేవతలు ఎవరి లోకానికి వారు వెళ్లిపోయారు. ఈశ్వరుడు గజాసురుని శిరస్సును చేతితో పట్టుకుని కైలాసానికి బయల్దేరాడు.

### వినాయకుని ఆవిర్భావం

భర్త కైలాసానికి వస్తున్నట్టు తెలుసుకున్న పార్వతి ఎంతగానో సంతోషించింది. అభ్యంగన స్నానం చేయడానికి వెళుతూ నలుగుపిండితో ఒక బాలుడి బొమ్మను తయారుచేసి ప్రాణం పోసింది. ఆ బాలుడిని వాకిలి వద్ద కాపలా ఉంచి స్నానానికి వెళ్లింది. ఆ సమయంలో శివుడు కైలాసం చేరుకున్నాడు. లోనికి వెళ్లనీయకుండా శివుడిని బాలుడు అడ్డుకున్నాడు. ఇద్దరి మధ్య వాగ్వాదం జరిగింది. కోపానికి గురైన శివుడు బాలుడి తలను ఖండించి లోనికి వెళ్లాడు. పార్వతీదేవి స్నానం చేసి, సర్వాలంకారాలతో శివుడి వద్దకు వచ్చింది. ఇద్దరూ మాట్లాడుకుంటూండగా వాకిట్లో తనను అడ్డగించిన బాలుడిని సంహరించినట్టు శివుడు చెప్పాడు. ఆ వార్తతో పార్వతి దుఃఖించడం మొదలు పెట్టింది. పార్వతిని ఓదార్చి



తాను తెచ్చిన గజాసురుని ముఖాన్ని బాలుడి మొండేనికి అతికించి ప్రాణం పోశాడు శివుడు. ఆదిదంపతులు ఆ బాలుడిని కుమారుడిగా స్వీకరించారు. అతడికి ఎలుకను వాహనంగా ఇచ్చారు. కొన్ని రోజులకు శివపార్వతులకు కుమార స్వామి జన్మించాడు. ఇతడిని దేవతలకు సేనా నాయకుడిగా నియమించారు. ఒక రోజు దేవతలు, మునులు కలిసి కైలాసానికి వచ్చారు. విఘ్నాలకు ఒకరిని అధి పతిగా చేయమని పరమేశ్వరుని వేడుకున్నారు. గజాననుడు మరుగుజ్జు, అస మర్థుడని, ఆ ఆధిపత్యాన్ని తనకే ఇవ్వమని కుమారస్వామి తండ్రిని కోరాడు. దీంతో శివుడు "ముల్లోకాలలోని పుణ్య నదులలో స్నానం చేసి ఎవరు ముందుగా నా వద్దకు వస్తారో, వారికి ఆధిపత్యాన్ని ఇస్తాను" అని చెప్పాడు. వెంటనే కుమార స్వామి నెమలి వాహనం ఎక్కి ముల్లోకాలు తిరగడం మొదలు పెట్టాడు.

గజాననుడు బాధతో తండ్రి వద్దకు వచ్చి "నాన్నా..నా అసమర్థత తెలిసీ ఇలాంటి పరీక్షను పెట్టారు. దీనికి తగిన ఉపాయాన్ని కూడా మీరే చెప్పండి" అని వేడుకున్నాడు. తల్లిదండ్రులకు ప్రదక్షిణం చేసిన వాడికి ఆ ఫలితం లభి స్తుందని శివుడు చెప్పాడు. వెంటనే గజాననుడు ఆ విధంగా చేశాడు. మూడు కోట్ల యాభై లక్షల నదులలో స్నానానికి వెళ్లిన కుమారస్వామికి తనకన్నా ముందుగా స్నానం చేసి వెళుతున్న గజాననుడు కనిపించాడు. చివరకు తండ్రి వద్దకు వచ్చిన కుమారస్వామి తన ఓటమిని అంగీకరించాడు. దీంతో శివుడు గజాననునికి విఘ్న ఆధిపత్య పదవి ఇచ్చాడు. ఆరోజు భాద్రపద శుద్ధ చవితి. ఆ రోజు వినాయకునికి కుడుములు, ఉండ్రాళ్లు ఇచ్చి పూజించిన వారికి అన్ని విఘ్నాలు తొలగిపోతాయని శివుడు వరం ఇచ్చాడు. ఆ రోజు భక్తులు పెట్టిన కుడుములు, ఉండ్రాళ్లు తిని కైలాసానికి వచ్చిన వినాయకుడు తల్లిదండ్రులకు సాష్టాంగ ప్రణామం చేయడానికి అవస్థ పడుతుండటం చూసిన చంద్రుడు వికటంగా నవ్వాడు. చంద్రుని దిష్టి తగిలి వినాయకుని కడుపు పగిలింది. మర ణించిన వినాయకుని చూసి పార్వతి దుఃఖించింది. "నిన్ను చూసిన జనం పాపాత్ములై, నీలాపనిందలు పొందుతారు" అని చంద్రుని శపించింది.

## ఋషి పత్నులకు నీలాపనిందలు

పార్వతీదేవి చంద్రుని శపించిన సమయంలో సప్తఋషులు భార్యలతో కలసి యజ్ఞం చేస్తూ, అగ్నిదేవునికి ప్రదక్షిణం చేస్తున్నారు. అగ్నిదేవుడికి ఋషి పత్నుల మీద మోహం కలిగింది. కోరిక తీరక, శపిస్తారేమో అనే భయంతో అగ్ని క్షీణింపసాగాడు. భర్త కోరిక తెలుసుకున్న స్వాహాదేవి ఋషుల భార్యల రూపంలో అగ్నిదేవుడిని చేరింది. అగ్నిదేవునితో ఉన్నది తమ భార్యలేనని భ్రాంతి చెందిన ఋషులు, వారిని విడిచిపెట్టారు. శాపగ్రస్థుడైన చంద్రుని చూడటం వలనే ఋషుల భార్యలు నీలాపనిందలకు గురయ్యారని దేవతలు గ్రహించారు. వీరందరూ బ్రహ్మదేవునితో కలసి కైలాసానికి వెళ్లారు. మరణించిన విఘ్నేశ్వరుడిని బ్రహ్మదేవుడు తిరిగి బతికించాడు. తర్వాత పార్వతీదేవితో "అమ్మా నీవు చంద్రు నికి ఇచ్చిన శాపం వలన ఆపద కలిగింది. కావున శాపాన్ని ఉపసంహరించుకో" అని కోరాడు. అప్పుడు పార్వతీదేవి "ఏ రోజున చంద్రుడు విఘ్నేశ్వరుడిని చూసి నవ్వాడో ఆ రోజు చంద్రుణ్ణి చూడకూడదు" అని శాపాన్ని సవరించింది. ఆ రోజునుంచి అందరూ భాద్రపద శుద్ధ చవితి నాడు చంద్రుణ్ణి చూడకుండా జాగ్రత్తగా ఉండి, సుఖంగా ఉన్నారు. ఇలా కొంతకాలం గడిచింది.

## శమంతకోపాఖ్యానం

ద్వాపరయుగంలో ద్వారకలో నివాసం ఉన్న శ్రీకృష్ణుడిని నారదుడు కలి శాడు. కాసేపు పిచ్చాపాటి మాట్లాడాక "స్వామీ! ఈ రోజు వినాయక చవితి. పార్వతి శాపం కారణంగా చంద్రుని చూడకూడదు. నేను వెళ్తాను" అని కృష్ణు డికి చెప్పి నారదుడు వెళ్లిపోయాడు. ఆ రోజు రాత్రి ఎవ్వరూ చంద్రుణ్ణి చూడ కూడదని పట్టణంలో శ్రీకృష్ణుడు చాటింపు వేయించాడు. శ్రీకృష్ణుడికి పాలంటే ఇష్టం. ఆ రోజు రాత్రి శ్రీకృష్ణుడు ఆవు పాలను తాగుతుండగా పాత్రలోని పాలలో చవితి చంద్రుడి ప్రతిబింబాన్ని చూశాడు. దాంతో తనకెలాంటి అప నింద వస్తుందో అని చింతించాడు.

కొన్ని రోజులు గడిచాయి. సత్రాజిత్తు సూర్యుని వరంతో శమంతకమణిని సంపాదించాడు. రోజుకు పది బారువుల బంగారాన్ని ఇచ్చే ఆ మణిని తీసు కుని ద్వారకకు వెళ్లాడు. శ్రీకృష్ణుడు సత్రాజిత్తుకు అతిథి మర్యాదలు చేసి ఆ మణిని తనకు ఇవ్వమని కోరాడు. అందుకు సత్రాజిత్తు ఒప్పుకోలేదు. తర్వాత ఒక రోజు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు శమంతకమణిని మెడలో వేసుకుని అడవికి వేటకు వెళ్లాడు. అడవిలో ఒక సింహం ఆ మణిని చూసి మాంసం ముక్క అనుకుని ప్రసేనుణ్ణి చంపింది. మణిని నోట కరచుకుని పోతూన్న సింహాన్ని జాంబవంతుడు చంపాడు. శమంతకమణిని కొండగుహలో ఉన్న తన కూతురు జాంబవతికి ఆట వస్తువుగా ఇచ్చాడు. మరుసటి రోజు సత్రా జిత్తు తమ్ముడి మరణవార్త విన్నాడు. శ్రీకృష్ణుడే తన తమ్ముడిని చంపి శమం తకమణిని అపహరించాడని నిందించాడు. శ్రీకృష్ణుడు అది విన్నాడు. భాద్రపద శుద్ధ చవితి రోజు చంద్రబింబాన్ని చూసిన దోషంవల్ల తన మీద నింద పడిం దనుకున్నాడు. శమంతకమణిని వెదుకుతూ అడవికి వెళ్లాడు. ఒక చోట ప్రసే నుడి శవం కనిపించింది. అక్కడి నుంచి సింహం అడుగులు కనిపించాయి. వెదుకుతూ వెళ్లి ఒక పర్వత గుహలోకి ప్రవేశించాడు. అందులో ఉన్న ఉయ్యాలకు కట్టిన మణిని చూసి, దానిని తీసుకుని బయటకు రాసాగాడు. వెంటనే జాంబ వతి పెద్దగా ఏడ్వసాగింది. కూతురి ఏడుపు విని జాంబవంతుడు కోపంతో శ్రీకృష్ణుడిపై యుద్ధానికి తలపడ్డాడు. వారిద్దరి మధ్య ఇరవై ఎనిమిది రోజులు యుద్ధం జరిగింది. జాంబవంతుని శక్తి తగ్గిపోయింది. తనతో యుద్ధం చేస్తున్న వాడు శ్రీరామచంద్రుడని తెలుసుకున్నాడు జాంబవంతుడు. త్రేతాయుగంలో జాంబవంతుడు శ్రీరాముడితో యుద్ధం చేయాలని కోరాడు. ఆ కోరికను ఇప్పుడు శ్రీకృష్ణుని రూపంలో వచ్చి తీర్చాడని గ్రహించాడు. శ్రీకృష్ణుడికి నమ స్కరించి శమంతకమణితో పాటు తన కుమార్తె జాంబవతిని కూడా ఆయనకు సమర్పించాడు. శ్రీకృష్ణుడు శమంతకమణిని తెచ్చి సత్రాజిత్తుకు ఇచ్చాడు. నిజం తెలుసుకున్న సత్రాజిత్తు తనను క్షమించమని శ్రీకృష్ణుడిని వేడుకున్నాడు. తన కుమార్తె సత్యభామను ఇచ్చి వివాహం జరిపించాడు. శమంతకమణిని కూడా శ్రీకృష్ణుడికి ఇచ్చాడు.

ఆ సమయంలో అక్కడకు వచ్చిన మునులు శ్రీకృష్ణుడితో "మీరు సమర్థులు కనుక మీపై పడిన నిందను పోగొట్టుకోగలిగారు. మావంటి వారికి ఏది గతి?" అన్నారు.

"భాద్రపద శుద్ధ చవితినాడు యథావిధిగా వినాయకుని పూజించి ఈ శమంతకోపాఖ్యానాన్ని విని అక్షతలు తలపై వేసుకున్న వారికి, ఆరోజు చంద్ర దర్శనం అయినా కూడా అపనిందలు కలగవు" అని శ్రీకృష్ణుడు చెప్పాడు.

ఆ నాటి నుంచి ప్రతి సంవత్సరం భాద్రపద శుద్ధ చవితి రోజు దేవతలు, మహర్షులు, మనుషులు తమ శక్తికి తగినట్లుగా గణపతిని పూజించి తమ కోరికలు తీర్చుకుంటున్నారు.

ఈ కథను చదివి గాని, విని గాని తలపై అక్షతలు వేసుకొని వినాయక వ్రతం ముగించాలి. చివరగా వినాయకుని ఎదుట వీలైనన్ని గుంజీలు తీసి, సాష్టాంగ నమస్కారాలు చేయాలి.

—ఆచార్య




**బృందావనం అంతటా శరదృతువు సోయగం ఒప్పారింది. గోపాలకులంతా ఆహ్లాదభరితులైనారు. అదే అవకాశంగా మన్మథుడు బాణాలను పుంఖానుపుంఖంగా సంధించి, విరహిణులను వేధించసాగాడు. అది చాలదన్నట్టుగా కృష్ణుని వేణుగానం ఒకటి, జగన్మోహనమై వినవచ్చింది. కృష్ణుడు వేణుగానం చేస్తోంటే... చెవులకు అలంకారమై నిలిచిన కొండగోగుపూల కాంతి అతని చెక్కిళ్ళను మెరిపించింది. ఎడమ వైపునకు కొంచెం ఒంగి, రాగాలాపన చేస్తుంటే...అతని కనుబొమల కదలికలు, గోపకుల హృదయాలను ఉర్రూతలూగించాయి. మురళిపై నర్తిస్తున్న కృష్ణుని చేతివేళ్ళను చూడడమే ఓ కళగా అనిపించింది అందరికీ. సిగలోని నెమలిపింఛం కాంతి, మెడలోని పువ్వులతో కలగలసి శోభిల్లింది.**

కృష్ణుని వేణుగానం విన్న గోపికలు తన్మయావస్థలో అల్లనల్లన నడచి పొదరిళ్ళకు చేరుకున్నారు. అల్లంత దూరాన నిలిచిన కృష్ణుని క్రీగంట చూస్తూ సిగ్గుపడుతూ అనుకున్నారిలా.

సించడం మన అదృష్టం.

అదృష్టంగాక...ఆ వేణుగానలోలుణ్ణి చూడక జీవించగలమా చెప్పు? ఆ వేణువును చూస్తే అసూయగా ఉన్నదే! కృష్ణుని కెమ్మోవితావినంతా ఆ వేణువే

విలో సంచరిస్తోన్న ఆ లేళ్ళగుంపుని చూడు! వేణుగానానికి విస్తుపోతూ ఇటే చూస్తున్నాయి. పాలు తాగుతున్న ఆ లేగల్ని చూడు! వంశీనాదానికి వెర్రెత్తిపోతున్నాయి. పాలుకూడా కాదనుకుని ఇటుగా పరుగులుదీస్తున్నాయి. లేగలే కాదు, ఆ ఆవుల్ని చూడు! నెమరులుమాని, మోరపైకెత్తి కృష్ణుణ్ణే చూస్తున్నాయి. కన్నార్పక చూస్తూ ఆనందిస్తున్నాయి.

ఇటు చూడవే! చెట్లకొమ్మలపై నిలిచిన పక్షులన్నీ, వేణునాదానికి మైమరచి అరమోడ్పులైనాయి. నిద్రిస్తున్నట్టనిపిస్తున్నది. ఈ చిత్రం చూడు! ఈ నదీనదాలను చూడు! వేణుగానానికి పొంగి, తరంగ హస్తాలు చాచి, కృష్ణుణ్ణి రారమ్మని పిలుస్తున్నట్టుగా ఉన్నాయి. అరరె! ఆ బోయపడతిని చూడండే! జవజవలాడుతున్న లేనడుముతో వచ్చి, కృష్ణుని వెనుగ్గా నిల్చుంది. చేతిలోని చెంగల్వదండను సమర్పిస్తున్నదతనికి. తన్మయంగా చెట్లూ, కొండలూ ఊగుతున్నాయి చూడు. చెట్లు చిగురిస్తున్నాయి. సకలప్రాణికోటి మైమరచిపోతున్నది.

ఈరోజెంత గొప్పదో! బలరామకృష్ణుల పాదముద్రలు పొందిన ఆ గోవర్ధనగిరిదేనాటి పుణ్యమో!

# హేమంతప్రవేశం : గోపికావస్త్రాపహరణం

చెలీ! చెవినిండా ఆ పువ్వులు చూడు! బంగారు రంగు ఆ పట్టువస్త్రం చూడు! శిరస్సుపై నెమలి పింఛం, మెడలో ఎర్రతామరపూలమాల ధరించి, అందంగా, ఆనందంగా వేణువూదుతున్న కృష్ణుణ్ణి చూశావా? భువనాలనే ఉర్రూతలూగిస్తున్న ఆ వేణుగానానికి నేనెంత? నిలువలేకున్నాను సఖీ! నా గుండె ఝల్లుమంటున్నది. కృష్ణుని మనసారా కోరుకుంటున్నది.

నా పరిస్థితీ అంతే! ఆ మోహనకృష్ణుని అంత దవ్వున చూస్తూ నిలువలేను. పద! కొంటెకృష్ణుణ్ణి దగ్గర నుంచి చూద్దాం. కమ్మని వేణుగానానికి కరగిపోదాం.

పదపద!

ఊగిపోతూ, సోలిపోతూ మెల్లమెల్లగా నడచి కృష్ణుడు అక్కడ ఉన్నాడనగా, అతనికి కొద్దిదూరంలో ఉన్న ఓ చెట్టుకిందకి చేరారంతా. గుసగుసలాడుకున్నారిలా.

తమ్ముడు కృష్ణుడుసహా అన్న బలరాముడు కూడా ఉన్నాడే! దూరం నుంచి మనకి కనిపించలేదుగాని, దగ్గరికొస్తే తెలిసింది. చూడుచూడు! అన్నగారు కూడా కొండగోగుపూలు పెట్టుకున్నాడు. నెమలిపింఛం ధరించాడు. తమ్ముని వేణుగానానికి పరవశించిపోతున్నాడు.

అన్నదమ్ములిద్దరూ నాట్యం చేస్తున్నారు చూడు! ఎంత మనోహరంగా చేస్తున్నారో చూడు! సౌందర్యం అంటే వారిదే! మైమరిపించే వేణుగానం, కనువిందుచేసే సౌందర్యం...ఇంతకన్నా ఇంకేం కావాలి? నిజంగా గోపికలుగా పుట్టడం, బృందావనంలో నివ

ఆస్వాదిస్తున్నది. మనకి ఏమాత్రం మిగల్చడం లేదు. పచ్చి వెదుళ్ళవంశంలో పుట్టిన ఆ వేణువు గతజన్మలో ఎంతటి పుణ్యం చేసుకున్నదో ఏమో! వచ్చే జన్మంటూ ఉంటే నేను కూడా యమునా తీరంలో వేణువుగా జన్మించాలనిపిస్తోంది. కృష్ణుని అధరసుధారసాన్ని అందుకోవాలనిపిస్తోంది.

అటుచూడు చెలీ! కృష్ణుణ్ణి నీలమేఘం అనుకుని, అతని మురళీనాదం దాని గర్జనని భ్రమించి నెమళ్ళు పురివిప్పి నర్తిస్తున్నాయి. ఆకాశంకేసి చూడు సఖీ! ప్రియులసహా విహరిస్తున్న అమరభామినులు కృష్ణుని వేణుగానానికి ఎలా తూలి సోలిపోతున్నారో! మనల్నే కాదు, గోపాలకృష్ణుని వేణుగానం దేవతల్ని కూడా పరవశింపజేస్తోంది. అటు చూడు! కారడ

**చలినీ చన్నీళ్ళనూ తట్టుకోలేకపోతున్నారు గోపికలు. తెగించి వెళ్ళిపోదామా? అనుకున్నారు కొందరు. తీరా వెళ్ళాక దుస్తులు ఇవ్వకపోతేనో...? భయాందోళన వ్యక్తం చేశారు ఇంకొందరు గోపికలు. మరికొందరైతే, తప్పదే! కృష్ణుడు పట్టుపట్టి కూర్చున్నాడు, ఆలస్యం చేసినకొద్దీ ఇంకెంత అల్లరిపాలవుతామో ఆలోచించండి అన్నారు. పదండి పదండి అనుకుని గోపికలంతా నీటిమధ్యనుంచి లేచారు. అప్పుడు వాళ్ళేంచేశారు?**

అందుకే కాబోలు చెట్లను ఊరించి, ఊగించి ఆ మహానుభావుల మీద పుష్పవృష్టి కురిపిస్తున్నది. సంతోషంతో పులకించిపోతున్నది.

ఎంతసేపు ఈ మాటలు? రండి రండి! కృష్ణుణ్ణి సందర్శించి వద్దాం! ఎదురుపడి బిగికౌగిలిబందీలమవుదాం. వెన్నదొంగ వేడిముద్దులు అందుకుందాం అంటూ గోపికలు కృష్ణుణ్ణి సమీపించారు. అతని వేణుగానానికి సమ్మోహితులై నిశ్చేష్టులయ్యారు. తర్వాత తేరుకుని, చీకటివేళ ఇళ్ళదారిపట్టారు.

శరదృతువు ముగిసింది. హేమంతం ప్రవేశించింది. బృందావనం అంతటా చలి పొటమరించింది. యౌవనవతుల బిగికౌగిలిలో యువకులు చలిపులి నుంచి తప్పించుకుని, వెచ్చగా నిద్రించసాగారు. అంతవరకు ఎడముఖం పెడముఖంగా ఉన్న భార్యాభర్తలు కూడా ఆ చలికి ఒక్కటైనారు. ఒకరిని ఒకరు కప్పుకోసాగారు. రాత్రింబవళ్ళు ఉత్తరపుశీతగాలి కోతపెట్టడంతో వెన్నెలపై వెగటు పుట్టింది అందరికీ. చలిని తట్టుకోలేక సూర్యుడు కూడా తొందరగా అస్తమించసాగాడు. దాంతో పగటివేళ సన్నగిల్లింది. రాత్రివేళ హెచ్చింది. శివునికంటిలో ఒకటి, సాగరగర్భంలో మరొకటి, గృహాలలో వేరొకటిగా త్రేతాగ్నులు మూడూ తలలు దాచుకున్నాయి. త్రిమూర్తులు కూడా చలిబాధను తట్టుకోలేక భార్యలను శరీరాల్లో పదిలపరచుకున్నారు దుకే!

మన్మథవేదనతో మనసు మనసులోలేని గోపికలంతా కాత్యాయనీవ్రతం చేపట్టారు. తెల్లవారుతూనే యమునానదికిపోయి స్నానాదులు నిర్వర్తించారు.

విනాయక చవితి శుభాకాంక్షలతో....

A **Sheela Foam** Product

# Sleepwell®

# EXCHANGE OFFER


SAMSUNG 80 cms (32") TV's


PANASONIC MIXER GRINDERS


Honda WR-V CARS

Bumper Prizes


COMFORTERS
BEDSHEETS
DOHARS
CARPETS

**EXCHANGE YOUR OLD MATTRESS FOR A NEW ONE. GET GUARANTEED CASH REWARD AND A CHANCE TO WIN A BUMPER PRIZE.***

## Win in 3 easy steps:

1. Exchange any old mattress and buy a new Sleepwell Mattress from our Authorised Dealer.
2. Ask our Dealer to SMS your unique mattress serial number along with your mobile number to win prizes and also register your Mattress Warranty.
3. Receive instant SMS to win Guaranteed Cash Reward and a chance to win a Bumper Prize from the Company.

*Conditions apply. Offer available in Select States.

www.sleepwellproducts.com • Helpline No.: Int-91-(0)-120-4512260 • Toll Free: 1800 103 6664

**Avail this offer at all Sleepwell® Wolrd's Gallery's and authorised Dealers.**



తర్వాత అక్కడి తడి ఇసుకతో కాత్యాయనీదేవిని రూపొందించారు. ఆ మూర్తిని పూజించి, ధూపదీప నైవేద్యాదులు అర్పించారు. చేతులు జోడించి నమస్కరించి ఆ తల్లిని వేడుకున్నారిలా.

తల్లీ కాత్యాయనీ! కరుణించి మా అందరికీ గోపాలకృష్ణుడు భర్త అయ్యేట్టుగా దీవించు! నీ దీవెన ఫలించి, ఆ దేవుడు మా భర్త అయిన పక్షంలో నిన్ను మరింత భక్తిశ్రద్ధలతో పూజిస్తాం. నీకు జాతర చేస్తాం.

పూజాక్షతలు శిరసున చల్లుకున్నారు. నెలరోజుల పాటు నిర్వహించారు ఆ వ్రతాన్ని.

ఒకనాడు తెల్లవారుజామున యువతులంతా మేల్కొన్నారు. ఒకరిని ఒకరు ఎలుగెత్తి పిలిచి, కలిసి, మత్తగజేంద్రగమనంతో యమునాతీరం చేరుకున్నారు. శ్రీహరిసంకీర్తనలు చేస్తూ పొదరింటకు చేరుకున్నారు. అక్కడ ఆ గుబురులో తాము ధరించిన వస్త్రాలన్నీ విసర్జించారు. స్నానాలు చేసేందుకు నీటిలోకి ప్రవేశించారు. జల్లుపోరాటాలు చేశారు. రకరకాల జలక్రీడలాడారు.

చిలిపికృష్ణుడు గమనించాడది. స్నేహితుల్ని తప్పించుకుని చల్లచల్లగా పొదరింట చేరాడు. గోపికలు విసర్జించిన వస్త్రాలను మూటగట్టాడు. దగ్గరలో ఉన్న కడిమిచెట్టెక్కి, మూటసహా మీదన కూర్చున్నాడు.

చేసిన స్నానాలు చాలు! ఆడిన ఆటలు చాలు! పదండి అంటే పదండి అంటూ గోపికలంతా గట్టుకి చేరుకున్నారు. పొదరింట ప్రవేశించారు. దాచిన దుస్తులు లేవక్కడ. ఏమైనట్టు? ఒకరిని ఒకరు భయాందోళనలతో చూసుకుని, తర్వాత తేరుకున్నారు. కొంటెకృష్ణుని పని ఇదంతా అనుకున్నారు. వెదకి చూశారతనికోసం. కడిమిచెట్టు కొమ్మమీద కూర్చుని కృష్ణుడు కనిపించాడు. నవ్వుతూ కనిపించాడు. చాలు నీ లీలలు అని ముందు కోపగించుకుని, తర్వాత వారంతా వేడుకున్నారిలా.

కృష్ణా! మా మానాపహరణం, మా వస్త్రాపహరణం నీకు తగదు. నువ్వు జనోపయోగమైన జీవితాన్ని జీవించాలి. ఈ నేలను ఉద్ధరించాలి. నరసింహుడివై ప్రజలను ఆదుకోవాలి. యుద్ధరంగంలో రారాజులను ఓడించాలి. తల్లిదండ్రులమాట ఆజ్ఞగా స్వీకరించాలి. పేరు ప్రతిష్ఠలు గడించాలి. పెద్దలూ, పండితులూ మెచ్చుకునేట్టుగా ప్రబుద్ధుడివి కావాలి. అంతేగాని ఈ కలికితనం నీకు కూడదు.

మేమెవరం? నీవారం. నీ మనుషులం. మా దుస్తులు మాకిచ్చివెయ్యి! కృష్ణా! మా మనసులు నీసొంతం చేసుకున్నావు. మా మానాభిమానాలు సహా మా సిగ్గునీ నీ వశం చేసుకున్నావు. ఇప్పుడు ఈ దుస్తులు దొంగిలించావు. తప్పయ్యా! నీకు ఇలాంటి కొంటెపనులు కూడదు. రాజులసంగతి నీకు తెలియదు. మా దుస్తులు దొంగిలించిన సంగతి వెళ్ళి రాజుగారికి చెప్పామనుకో! నీ సంగతి ఏమవుతుందో ఆలోచించుకో! నీకు బడితెపూజ చేస్తారు, తెలుసుకో!

అవునవును అన్నట్టుగా ఆ మాటలకి బెదిరినట్టుగా నటించి, అంతలోనే కలకలమని నవ్వాడు కృష్ణుడు. అన్నాడిలా.

రాజుపేరు చెప్పి నన్ను బెదిరిస్తున్నారు, బాగానే ఉందిగాని, మీరు చేసిన తప్పు మీరు తెలుసుకోలేక పోతున్నారు. నేనేఁవన్నా మీ దుస్తులు ఇవ్వనన్నానా? వచ్చి తీసుకోండి. ఎలా ఉన్నవాళ్ళు అలా నీటిలోంచి మెల్లమెల్లగా ఒకరితర్వాత ఒకరిగా వచ్చి ఎవరి దుస్తులు వారు పట్టుకెళ్ళండి. ఆలోచించి లాభం లేదు, త్వరపడండి!

అమ్మో! కృష్ణుడి తెలివే తెలివి! ఎలా ఉన్నవాళ్ళం అలా రావాలట! దుస్తులు తీసుకోవాలట! చూడు చూడు కోణంగి కోర్కెలు అనుకున్నారు గోపికలు. ముసిముసిగా నవ్వుకున్నారు. ఒకవైపు వల్లమాలిన సిగ్గు, మరొకవైపు భరించలేని చలి. అయినా కంఠాల వరకూ నీటిలో మునిగి, కృష్ణునికి విన్నవించారిలా.

కృష్ణా! స్త్రీలు స్నానాలు చేస్తున్నప్పుడు పురుషులు రావచ్చా? వచ్చారే అనుకో! నీలా దుస్తులు దొంగిలించి, చెట్టెక్కి కూర్చోవడం మర్యాదా, చెప్పు? నీకసలు జాలి అన్నదే లేదు. ఉంటే ఇలా ప్రవర్తిస్తావా? మేము నీ దాసానుదాసులమయ్యా! నువ్వెలా చెబితే అలా నడుచుకుంటాం. దయచేసి మాకట్టుపుట్టాలు మాకిప్పించు. వాటిని ధరించిన మీదట, నువ్వు రమ్మన్నచోటికి రాకపోతే అడుగు. దయచేసి మా దుస్తులు మాకియ్యవయ్యా!

ఇస్తానుగానీ, నాకు ఓ సమాధానం చెప్పండి. మీరు ఎవరిని ప్రేమించి వ్రతం చేశారు? అతనిపై అంత మక్కువ మీకెందుకు? నేను మీవాణ్ణని మీరే అన్నారుగా, నాకు చెప్పడానికి సంకోచం దేనికి? చెప్పండి చెప్పండి అడిగాడు కృష్ణుడు.

ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి? తీరని వేదనది. మన్మథవేదన. మారుమాటాడలేకపోయారు గోపికలు. తలలొంచుకున్నారు. దీనంగా నీళ్ళమధ్య తల లొంచుకుని కూర్చున్న గోపికలను చూసి జాలి చెందాడు కృష్ణుడు. అన్నాడిలా.

నిజంగా మీరంతా నా మాట వినేటట్టయితే నేను చెప్పినట్టు చెయ్యండి. ఆలస్యం చెయ్యకండి. రండి! ఎలా ఉన్నవారు అలా వచ్చి మీ దుస్తులు మీరు తీసుకుని వెళ్ళండి.

ఈ చలినీ, ఈ చల్లనినీళ్ళనూ తట్టుకోలేకపోతున్నామే! తెగించి వెళ్ళిపోదామా? కొందరు గోపికలు తొందరపడ్డారు. వద్దే! తీరా వెళ్ళాక దుస్తులు ఇవ్వకపోతేనో! భయాందోళనలు వ్యక్తం చేశారు ఇంకొందరు. మరికొందరు తప్పదే! కృష్ణుడు పట్టుబట్టి కూర్చున్నాడు. ఆలస్యం చేసినకొద్దీ ఇంకెంత అల్లరి పాలవుతామో ఆలోచించండి. పదండి పదండన్నారు. ఆ మరికొందరిమాటే శిరసావహించారంతా. గోపికలంతా నీటిమధ్యనుంచి లేచారు. ఉరువుల మధ్యభాగాన్ని గాజులచేతులతో ఆచ్ఛాదించారు. ప్రౌఢాంగనలను ముందుంచుకుని నడిచారు. వస్తున్న నవ్వును ఆపుకోలేక ఆయాసపడసాగారు. అల్లనల్లన నడచి వస్తున్న గోపికలను చూసి, సన్నగా నవ్వుకున్నాడు కృష్ణుడు. అన్నాడిలా.

—అరణి

## పంచభూతములు - పంచేంద్రియములు
## 4. జలము

పంచభూతములలో నాల్గవది 'జలము'. జలము నిరూపమానమైనది 'ప్రాణ ధారం –జలం' అంటారు.

చెట్లు, పుట్ట, బాక్టీరియాలాంటి సూక్ష్మాతి సూక్ష్మ జీవుల దగ్గరి నుండి మహా డైనొసర్స్ (రాక్షస బల్లులు) వరకు, ప్రతి జీవి యొక్క జీవ నానికి, జీవన విధా నానికీ, బ్రతుకు దెరువుకూ జలముతో సంబంధం ఉంది. ఈ భూ గ్రహం మీద మొట్టమొదటిది ఏకకణజీవి '**అమీబా**' కొన్ని వేలకోట్ల సంవత్సరాల క్రితం నీటిలోనే ప్రాణం పోసుకుందని సైన్సు చెపుతున్నది. అప్పటి నుండి ఇప్పటి వరకు జరిగిన జీవ పరిణామ క్రమంలో అనేకానేక జలచరాలు (మత్స్యము), ఉభయ చరాలు (కూర్మము), భూచరాలు (వరాహము) మొదలగునవి ఆవిర్భవించాయి. పంచభూతాలలో మిగిలిన, చతుర్భూతాలు కలిసి (ఆకాశము, వాయువు, అగ్ని, భూమి) భూమి పైనున్న కోటానుకోట్ల సకల జీవులకు నీటిని తద్వారా ఆహారాన్ని అందించే క్రమం అత్యంత అద్భుతగా ఉంటుంది. (అదెలాగో ముందు ముందు తెలుసుకుంటాము.) జలము కుండే ధర్మాలలో ముఖ్యమైనవి 1) ఒక నిర్ధిష్టమైన వేడి దగ్గర జలము ఆవిరై వాతవరణంలో కలిసిపోవటం. 2) పల్లానికి ప్రవహిం చటం, ఎట్టి పరిస్థితుల్లోనూ మారని ఈ సహజ ధర్మాలననుసరించే ఒక సమెత కూడా పుట్టింది. '**నీరు పల్ల మెరుగు... నిజము దేవుడెరుగు**' అని.



ఈ ధర్మమే గాక నీటికొక నిర్ధిష్టమైన '**గుణం**' కూడా ఉంది. నీరు ప్రవ హించే టప్పుడు '**శబ్దం**' వస్తుంది. '**శబ్దగుణం**' ఆకాశానికి సంబంధంచి నది. నీటిని మనం స్పృశించగలుగుతాము. '**స్పర్శ గుణం**' వాయువుకు సంబంధంచినది. జలమును మనం చూడగలుగుతాము. '**రూప గుణం**' అగ్నికి సంబంధించినది. శబ్ద, స్పర్శ, రూప గుణాలు వరుసగా చెవి, చర్మము, కంటికి సంబంధాన్ని కలిగి ఉన్నాయి. వీటిని రుచి చూడలేము. కాని జలమును మనం రుచి చూడగలుగు తాము. శబ్ద, స్పర్శ, రూప గుణాలేగాక జలముకు '**రసగుణం(రుచి)**' కూడ ఉన్నది. దేన్నయినా రుచి చూడగలిగేది జిహ్వేంద్రియము (నాలుక). అలా పంచభూతలలో ఒకటైన జలము, జీవి యొక్క జిహ్వతో సంబంధంను కలిగిఉంది.

వాస్తు విద్వాన్, సాయిశ్రీ

## గౌ. డా. దంతూరి పండరీనాథ్



### సింహద్వారము ఏవిధంగా ఉండాలి?

– **ప్రసద్ రావు**, విజయవాడ.

- సింహద్వారము అంటేనే '**పెద్ద ద్వారము**' లేదా '**ప్రధాన ద్వారము**' అనే అర్థం స్ఫురిస్తుంది.

శ్లో॥ మూలద్వారం నా న్యైరభిసంధీత రూపవృద్ధ్యా।
ఘటఫలపత్ర ప్రమదాదిభి శ్చత స్వంగ వైశ్చిహ్నితమ్॥ (బృహత్సంహిత)

- గృహములోని అన్ని ద్వారములకంటే సింహద్వారము పొడవు, వెడెల్పు రూపంలో గొప్పదిగా ఉండాలి.
- సింహద్వారమునకు సమమైన ద్వారము గాని మించిన ద్వారముగాని గృహములో మరొకటి ఉండకూడదు.
- సింహద్వారము పైనగానీ, తలుపుల పైనగానీ పూర్ణకుంభము, ఆకులు, పండ్లు నృత్యభంగిమలు మొదలగు మంగళ చిహ్నములు ఉండుట వలన మిక్కిలి శ్రేయః ప్రదముగా ఉండునవి చెప్పబడినది.
- సింహద్వార రూప లక్షణముల గురించి మరింతగా వివరించబడినది. స్వస్తిక్ (卐), ఓంకారం (ॐ) శ్రీకారం, శంఖం( ) చక్రము ( ) నృత్యముచేయు నెమళ్ళు, పద్మములు, చిలుకలు, లతలు మొదలైనవెన్నో మంగళ చిహ్నాము లుగా చెప్పబడినవి.

### సింహద్వారముపై దేవుని బొమ్మలు చెక్కించ వచ్చునా?

– **రాజశేఖర్ రెడ్డి**, కర్నూల్

- సింహద్వారపు తలుపులనైన ద్వార బంధములపైన దేవతల విగ్రాహాలు చెక్కించక పోవటం, అతికించకపోవటమే శ్రేయోదాయకం. సాధారణంగా తలుపులపైన, లక్ష్మి, గణపతి బొమ్మలను ఏర్పాటు చేస్తుంటారు. ఇది మంచి పద్దతి కాదు. వీటిని ఏర్పాటు చెయటం వలన పాటించవలసిన నియమాలు ఉంటాయి. అవి పాటించనప్పుడు ఫలితాలు వికటించు అవకాశం ఉంటుంది. అందుకని వాటిని నిరోధించుటయే ఏకైక సులభమార్గం.
- సింహద్వారం మిగతా ద్వారముల కంటే వైభవోపేతంగా ఉండవలెను.

**వచ్చేవారం...**

**నైరుతి స్థలములో ఎటువైపు ముఖద్వారమున్న ఇంటిని నిర్మించుకోవాలి?**



వాస్తువిద్వాన్ **డా॥ దంతూరి పండరినాథ్** పాఠకుల జాతక మరియు వాస్తు సమస్యలకు 'మహావాస్తు'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమ–స్యలు పంపవలసినది.

పూర్తి పేరు:........................................................................
పుట్టిన తేది:............................ ఊరు:........................................
జన్మనక్షత్రం:............................ తల్లి పేరు:....................................
చిరునామా:........................................................................
.............................................ఫోన్:.......................................

మా చిరునామా : **వాస్తుసాయి సేవా ఆశ్రమం**
**మహావాస్తు, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.**



⑫

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**నేను మొదటినుంచి సింపుల్ లివింగ్‌నే ఇష్టపడతాను. కాబట్టి, జీతం పెద్దగా ఖర్చు కాలేదు. నేను ఉద్యోగంలో చేరిన మొదటి నెల జీతం నా బ్యాంకు ఖాతాలో జమ కాగానే అమ్మా, నాన్నా, చెల్లి పేరు మీద నెలకు తలా పదివేలకు రికరింగ్ డిపాజిట్ చేశాను. అవి రెండు లక్షలు కాగానే వాటిని ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయించాను.**

**నేను అమ్మ దగ్గరకు వెళ్ళి రాగిణితో నా ప్రేమ విషయంచెప్పి పెళ్ళి చేసుకుంటానని చెప్పాను. వాళ్ళు కూడా సరేనన్నారు. నా మాట తీసివేయలేక ఒప్పుకున్నారుగానీ చెల్లి పెళ్ళి సమస్య వాళ్ళను వేధిస్తోందని నాకు తెలుసు. ఎదిగిన ఆడపిల్లకు పెళ్ళి చేయాల్సిన బాధ్యత ఆ ఇంటి పెద్దకొడుకు మీద ఉంటుంది. నేనా విషయం మరిచిపోలేదని చెపుతూ మూడు FDRలు తీసి ఇచ్చాను. ఫిక్స్‌డ్ చేయించిన తర్వాత కూడా రికరింగ్ డిపాజిట్లు కడుతున్న పాస్‌బుక్స్‌ను చూపించాను. వారి ఆనందానికి హద్దే లేకుండా పోయింది. వారి గుండెల మీద పేరుకున్న పెనుభారం తీరిపోయింది.**

నా పెళ్ళికి పెద్దగా చుట్టాలని పిలవకుండా దగ్గరి బంధువులను, కార్లు కిరాయికి తీసుకుని వచ్చేయమని చెప్పి వచ్చాను.

రాగిణి వాళ్ళ తల్లిదండ్రులు తమిళ సంప్రదాయంలో పెళ్ళి చేద్దామని రిక్వెస్ట్ చేశారు. రాగిణి నా స్వంతం కావడం నాకు ముఖ్యం కాబట్టి ఏ సంప్రదాయమైనా నాకు ఓకే అన్నాను.

రాగిణి నా కన్నా ముందు నుండి క్లరికల్ క్యాడర్‌లో కూడా ఉద్యోగం చేసింది. మొదటి నుంచి తన జీతంలో నుంచి ఒక్క రూపాయి కూడా ఖర్చు చేయకుండా రకరకాల షేర్లు, డిబెంచర్స్, మ్యూచువల్ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేసి జీతానికి రెండింతలు చేశారు వాళ్ళ నాన్నగారు. అలా జమ అయిన మొత్తంతో పాటూ బ్యాంక్ హౌజింగ్ లోన్ తీసుకుని హిమాయత్‌నగర్, స్ట్రీట్ నెంబర్ పదమూడులో కొత్తగా కట్టిన 'విజయ సౌధ'లో త్రీ బెడ్ రూము ఫ్లాట్ కొన్నది. మా కొత్త కాపురం అందులోనే మొదలు కావాలని తన ఆశ. అందుకే పెళ్ళి నాటికి సిద్ధమయ్యే విధంగా ఫర్నిష్ చేయిస్తుంది. నాకు సర్‌ప్రైజ్ ఇవ్వాలని, పెళ్ళి అయ్యి మేమిద్దరం పెళ్ళిబట్టలతోనే ఆ ఇంట్లోకి అడుగు పెట్టాలని, అంతవరకూ నన్ను అక్కడికి రావద్దని కండీషన్ పెట్టింది. ఒక్క డబుల్ కాట్ బెడ్ విషయంలో మాత్రం నన్ను సెలెక్ట్ చేయమని ఫోటోలు పట్టుకొచ్చి చూపించింది. మేమిద్దరమూ కలిసి ఒక డిజైన్‌ని ఓకే చేశాము. అది కూడా పెళ్ళినాటికి, ఇంకా ముఖ్యంగా చెప్పాలంటే మొదటి రాత్రికల్లా, డెలివరీ అవుతుంది.

ఆలోచనల్లో ఉండగానే, రాగిణి వాళ్ళ అపార్ట్‌మెంట్ దగ్గరకు చేరుకున్నాను. నేను కావాలనే కొంచెంసేపు వెయిట్ చేసి, రాగిణి వెళ్ళిన పదినిమిషాల తర్వాత వెళ్ళాను.

బహుశా పెళ్ళికి ముహూర్తం, ఫంక్షన్ హాల్ నిర్ణయమైపోయి ఉంటాయి. అందుకే నన్ను ఇవాళ రాత్రికి డిన్నర్‌కి రమ్మని, ఉదయమే వాళ్ళ అమ్మా నాన్నా ఇన్వైట్ చేశారు.

'కానీ, ఇంతలో బ్యాంకులో అనూహ్య పరిణామాలు జరిగాయి. గుండెల్లోని సంతోషమంతా ఆవిరై పోయింది' అనుకుంటూ మెట్లెక్కసాగాను.

నేను వెళ్ళేసరికి అందరూ నా కోసమే ఎదురు చూస్తున్నారు. నేను వస్తూ వస్తూ రాగిణికి ఇష్టమైన 'పుల్లారెడ్డి' నుండి తెచ్చిన 'కలాకంద' ప్యాకెట్ రాగిణి చేతికిచ్చాను. తను అప్పటికే ఫ్రెషప్ అయి ఉంది.

"గుడ్ న్యూస్ బాబూ! పెళ్ళి ముహూర్తం ఖరారైంది. 16వ తారీఖు, శుక్రవారం ఉదయం తొమ్మిది గంటల ముప్పై ఆరు నిమిషాలకు రేవతి నక్షత్ర యుక్త మీన లగ్న పుష్కరాంశ సుముహూర్తం. వెన్యూ ఇక్కడే లోయర్ టాంక్‌బండ్ రోడ్‌లో ఇందిరా పార్క్ ఎదురుగా ఉన్న పింగళి వెంకట్రామారెడ్డి హాల్. మీకు ఓకేనా?" అని అడిగారు.

నేను వెంటనే లేచి ఆయన కాళ్ళకు నమస్కరించాను.

"శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు" అని దీవించి కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు ఆయన.

ఒక్కసారిగా నా గుండెల్లో బాజాభజంత్రీలు మోగినట్లయింది. కల్యాణ రాగం వీనులవిందుగా వినిపించసాగింది.

'పెళ్ళి' అన్న మాట ఎంత మధురమైంది.

క్షణకాలం పాటు నా ఆందోళనంతా పక్కన పెట్టి ఆ మాధుర్యాన్ని ఆస్వాదించాను. గుండె గదుల్లో సీతాకోకచిలుకలు ఝుమ్మని ఎగురుతున్నట్టు, హరివిల్లులు వింజామరలై నాకు గాలులు వీస్తున్నట్టు, చిరుచినుకులు అత్తరు జల్లులై నా మేనిపై కురుస్తున్నట్టుగా మనసు ఆనంద సందోహాలతో మురిసిపోయింది.

నేను 'ఓకేనా?' అన్నట్టు రాగిణి వైపు చూశాను. రాగిణి ఏం మాట్లాడకుండా చిరునవ్వులు చిందిస్తూ నిలబడింది. నేను తనను నా కౌగిలిలోకి తీసుకోవాలన్న కోరికను బలవంతంగా అణచుకున్నాను.

"థాంక్యూ అంకుల్! అయాం వెరీ హాపీ! ఇంకా పది రోజుల టైం ఉంది కాబట్టి అంతా సవ్యంగానే జరిగిపోతుంది. మీరేం వర్రీ కాకండి. అమ్మానాన్నలను రెండు రోజుల ముందే రమ్మని చెప్పాను. మాకు పెద్దగా చుట్టాలు లేరు. అందుకే మా తరపున పెద్ద హడావుడి ఏమీ ఉండదు. హోటల్లో రూములు, కార్లు బుక్ చేస్తాను" అన్నాను.

ఆయన తల ఊపాడు. అతని ముఖంలో ఆనందం ఉంది. అలాగే అలసట కూడా కనిపిస్తోంది. అందుకే, నేను,

"కానీ, పాపం మీకే శ్రమ అవుతోంది" అన్నాను.

"శ్రమ ఏముంది బాబూ! కూతురు పెళ్ళి కోసం

> **జరిగిన కథ**
>
> ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో పనిచేసే ఆ అధికారి, మాకనూరు బ్యాంకు దోపిడీ కేసును ఛేదిస్తాడు. ఆ సందర్భంగా ఏర్పాటుచేసిన పార్టీలో, రామస్వామిని చూసి, గతస్మృతులలోకి జారుకుంటాడు. కష్టపడి బ్యాంకులో ఉద్యోగం సంపాదిస్తాడతను. స్కేల్ టూ ఆఫీసర్‌గా ప్రమోషన్ వస్తుందతనికి. స్టెనో ఆఫీసర్ రాగిణితో సాన్నిహిత్యం పెరిగి, ఇద్దరూ ఒక్కటవుతారు. పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. ఎంపీ బాలగోపాల్ విద్యుత్ ప్రాజెక్ట్ లోన్ విషయంలో ఏజీయంకు మెమో తయారు చేసి జెడ్ఎం సంతకం కోసం పంపిస్తాడు.
>
> **ఆ తర్వాత...**




**DR. ASHOK KUMAR**
DDVL, MBBS
Hair Transplant Surgeon

**DR. Kumar`s HAIR CARE CLINIC**
**Opp Madhapur Police Station,**
**Hyderabad - 500081**
**Ph: 9963932050,8885662020**

## జుట్టు రాలడానికి కారణాలు

మగవారిలో వంశపారంపర్యంగా వచ్చే బట్టతలతో పాటు రక్తహీనత, విటమిన్ లోపాలు, ఆందోళనలు, కొన్ని రకాలమందులు వాడటం వలన జుట్టు రాలబడును.

ఆడవారిలో రక్తహీనత, థైరాయిడ్, నెలసరి మరియు హార్మోన్ల సమస్యలవలన కొన్ని రకములమందులు వాడటం వలన జుట్టు రాలబడును





## నివారణ

జుట్టు రాలడానికి గలకారణాన్ని గుర్తించి, దాన్ని సరిచేసుకోవలెను.
జుట్టు రాలడం తీవ్రతను బట్టి కొన్ని టాబ్లెట్లు, లోషన్లు వాడటం వలన నివారింపబడును.
పి.ఆర్.పి. (ప్లేట్‌లెట్ రిచ్ ప్లాస్మా) పద్ధతి ద్వారా జుట్టు రాలడం నివారింపబడును.
హెయిర్ ట్రాన్స్‌ప్లాంటేషన్ - బట్టతలకు ఈ పద్ధతి ద్వారా శాశ్వత పరిష్కారం లభించబడును. ఈ పద్ధతిలో తలవెనుక భాగం నుండి జుట్టును తీసి బట్ట తలఉన్న చోట అమర్చబడును.
ఈ పద్ధతి (ప్యూ)కుట్లు లేకుండా చేయబడును.
8 లేదా 10 నెలలవ్యవధిలో ట్రాన్స్‌ప్లాంట్ చేసిన జుట్టు పూర్తిగా పెరుగును.
ఈ పద్ధతిలో ఎటువంటి సైడ్ ఎఫెక్ట్స్ ఉండవు.



**ADOPIRE**
PROFESSIONAL HEALTHCARE COMES HOME

**040-4858222, 9010385000**



### అందరికి అందుబాటులో అరుదైన సేవలు అందింస్తున్న అడోపైర్

నగరంలో కొన్ని దశాబ్దాలుగా అన్ని రకములవైద్య సేవలు ఇంటి వద్దనే అందిస్తూ ప్రజలఆత్మీయతను పొందగలిగాము. వైద్య సేవ రంగంలో అడోపైర్ ఒక విశిష్ట స్థానం సంపాదించింది.
చికిత్స కోసం గంటలతరబడి హాస్పిటల్ దగ్గర వేచి ఉండి మీ సమయాన్ని, డబ్బును వృధా చేయకుండా ఒక ఫోన్ కాల్ అపాయింట్‌మెంట్ తో మీ ఇంటి వద్దకు మా వైద్య నిపుణులు ద్వారా మీరు స్వస్థతను పొందవచ్చును.

మా వద్ద రోగులు ఉండటానికి అన్ని రకములపరిస్థితులను దృష్టిలో ఉంటుకొని సౌకర్యవంతమైన వసతి గృహాలను ఏర్పాటు చేసి అత్యంత నాణ్యమైన పరికరములతో ఎంతో అనుభవజ్ఞులైన వైద్యనిపుణులతో సేవలు అందించి మీకు పూర్వ వైభవాన్ని తీసుకురాగలము.

రాజు, పేద తేడా లేకుండా అందరిని దృష్టిలో ఉంచుకొని ఒకే విధంగా మరియు మీకు అందుబాటులో ఉండే ఫీజుతో వైద్య సేవలు అందిస్తూ ప్రజలఒక మంచి భావాన్ని పొందగలిగాము.

అంతేకాకుండా హాస్పిటల్లో ఉండే అన్ని పరికరములు (ఎక్విప్‌మెంట్) తీసుకు వచ్చి చికిత్స చేయడం మా ప్రత్యేకత.

అన్ని రకములవైద్య సేవలు, ఫిజియోథెరపీలు, వైద్య సేవకులు (నర్సింగ్), 24 గంటలు రోగి వద్ద ఉండి వారిని శుభ్రపరిచే సేవలు (బి.ఎస్.ఎ) తో రోగులను కంటికి రెప్పలా చూసుకుంటూ వారి సంతోషాన్ని మా సంతోషంగా భావించి సేవలు అందిస్తాం.

ఎన్ని కష్టాలు పడాలోనని భయపడ్డాం. మాకే కష్టం లేకుండా బంగారం లాంటి నిన్ను నా తల్లి ఎంచుకుంది. ఈ కష్టం ఏముంది బాబూ! రెండు రోజులు రెస్ట్ తీసుకుంటే తగ్గిపోతుంది. కలకాలం నా కూతురు పొందే సుఖం ముందు ఇదెంత? నాకయితే వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టుంది" అన్నాడు సంతోషంగా.

అక్కడున్న అందరి ముఖాల్లో ఆనందం తాండవిస్తోంది.

"కానీ బాబూ! మా బలగం మాత్రం చాలా పెద్దది. అందుకే అంత పెద్ద హాల్ బుక్ చేయించాను. నా తరఫు వాళ్ళు, ఆంటీ తరఫు వాళ్ళు, రాగిణి అన్నయ్య అత్తగారి తరఫు వాళ్ళూ, చాలా మందే ఉన్నారు. ఇట్స్ లార్జ్ గాదరింగ్. హైదరాబాద్‌లో ఉన్న సగంమంది తమిళియన్లు వస్తారనుకో!" అన్నాడు నవ్వుతూ.

ఇంతలో ఆంటీ లోపలి నుండి ఒక సూట్‌కేస్ తెచ్చి అంకుల్‌కి ఇచ్చింది.

ఆయన దాన్ని తెరిచి నా చేతిలో పెడుతూ,

"బాబూ! ఇందులో నీకు రెండు డ్రెస్సులు, పట్టు పంచెలు, మీ అమ్మానాన్నలకు పెళ్ళి బట్టలు, మీ చెల్లెలికి చీరలు ఉన్నాయి. ఇంకా ఇరవై తులాల బంగారం, లక్ష రూపాయల నగదు ఉంది. మా తరఫున ఏదో చిన్న కానుక." అన్నాడు.

**మీరు చిన్నవాళ్ళు సార్! ఆవేశం ఉంటుంది. రూల్స్ ప్రకారం అంటూ రూల్స్ పట్టుకొని పాకులాడతారు. ఏదో క్లారిఫికేషన్ కావాలన్నారుట అంటూ సంస్కారం ఉట్టిపడేలా మాట్లాడుతూ వచ్చాడతను. అతని ముఖం, మాటలు చూస్తే నాగరికత ముసుగు ధరించినట్టుగా ఉంది. కన్విన్సింగ్‌గా మాట్లాడుతున్నాడు. ఇంతకీ ఎవరతను? ఎవరి దగ్గరకు, ఏం పనిమీద వచ్చాడు?**

నేను ఆశ్చర్యంగా చూశాను.

నగలూ, డబ్బులూ తీసి ఆయన చేతిలో పెడుతూ,

"అంకుల్! సారీ, ఏమనుకోవద్దు. ఆచారం కాబట్టి బట్టలు మాత్రం తీసుకుంటాను. కట్నాలు, కానుకలు వద్దు. వీటన్నింటికన్నా ఎన్నో రెట్లు అమూల్యమైన మీ అమ్మాయినే నాకు ఇస్తున్నారు. నా జీవితాన్ని పసిడి మయం చేసే దేవతనే కానుకగా మీరిస్తున్నారు. ఇంకా ఇవన్నీ ఎందుకు అంకుల్?" అన్నాను రాగిణిని చూస్తూ. రాగిణి కళ్ళు చెమర్చాయి. ఆంటీ, అంకుల్ నన్ను అపురూపంగా చూశారు.

"ఆంటీ! రాగిణిని నేను నా ప్రాణం కన్నా మిన్నగా చూసుకుంటాను. జీవితంలో ఒక్క కన్నీటి చుక్క కారకుండా తన కంటికి నేను రెప్పనై కాపాడుతా! పూవుల్లో పెట్టి పూజిస్తా!" అని అన్నాను భావోద్వేగంగా.

ఒక్క క్షణం ఆ హాల్లో నిశ్శబ్దం తాండవించింది.

మరుక్షణం రాగిణి పరిగెత్తుకుంటూ వచ్చి నన్ను కౌగలించుకుంది. వెక్కి వెక్కి ఏడ్చింది. అందరం ఆశ్చర్యపోయాము.

మాకు ఏకాంతం కల్పించే ఉద్దేశంతో హాల్లోని లైట్లు ఆర్పేసి, వాళ్ళంతా సైలెంటుగా అక్కడి నుంచి నిష్క్రమించారు. రాగిణి దుఃఖం ఉధృతి తగ్గే వరకు నా కౌగిలిలోనే ఉంది. తరువాత మెల్లిగా సోఫాలో కూర్చోబెట్టాను.

కొంచెంసేపటి తర్వాత, కళ్ళు తుడుచుకుని నవ్వుతూ,

"థాంక్యూ! ఎంత గొప్పగా చెప్పావురా!" అంటూ నన్ను ముద్దులతో ముంచెత్తింది.

"ఇప్పటి వరకు నేనే నిన్ను ఎక్కువగా ప్రేమిస్తున్నానని అనుకునేదాన్ని. కానీ, నువ్వు నన్ను ప్రాణప్రదంగా ఆరాధిస్తున్నావని ఇప్పుడే అర్థమైంది." అని ఒక్క క్షణం ఆగింది.

తను ఇంకా ఏదో చెప్పాలనుకుంటున్నదని నాకు అర్థమైంది. కానీ, ఎందుకో సంశయిస్తోంది. నేను 'ఏమిటమ్మా?' అన్నట్టుగా కళ్ళెగరేశాను.

"కానీ, నాకు భయమేస్తోంది రా!" అంది.





ప్రియమైన మా ఖాతాదారులకు, వినియోగదారులకు మరియు మా సిబ్బందికి

వినాయక చవితి శుభాకాంక్షలు








# Grab Bigger Loans @ Smaller EMIs this Monsoon








**HOME LOAN**

EMI ₹772 *per lac**

Interest Rate **8.55%** p.a.*



**CAR LOAN**

EMI ₹1594 *per lac**

Interest Rate **8.70%** p.a.*

***Hurry! Offer valid till 30.09.2017***

For more information give a missed call to **09210222122 (Home), 09210422122 (Car)**

Toll free Helpline 1800 274 0123

www.ucobank.com

## UCO BANK WELCOMES DIGITAL YEAR 2017 WITH A HOST OF UCO E-PRODUCTS




यूको बैंक  **UCO BANK**

(भारत सरकार का उपक्रम)

(A Govt. of India Undertaking)

सम्मान आपके विश्वास का

Honours Your Trust

నేను ప్రశ్నార్థకంగా చూశాను. తను చెప్పడం మొదలు పెట్టింది.

'ఆ రోజు ఉదయమే యంపీ బాలగోపాల్ బ్యాంకుకు వచ్చాడనీ, లోన్ విషయంలో ఆలస్యం అవుతున్నందుకు జెడ్ఎంను చెడామడా తిట్టాడనీ, దాంతో అతనికి లోన్ రాకపోవడానికి కారణం నేనేనని బాలగోపాల్‌కు చెప్పడమే కాకుండా నానా విధాలుగా ఇబ్బందులు పెడుతున్నాననీ, హెడ్డాఫీసుకు కంప్లయింట్ చేయడమే కాకుండా, పాపం ఏజీయంకు మెమో ఇచ్చి ఇరకాటంలో పెట్టాననీ జెడ్ఎం చెప్పి బాలగోపాల్‌ను నా పైకి, ఉసిగొల్పాడనీ, దానికి ప్రతిగా బాలగోపాల్ నా అంతు చూస్తానని శపథం చేశాడనీ' తనకు తెలిసిన విషయాలు చెప్పింది.

'నేనూ, టీపీరావూ లంచ్‌కు వెళ్ళినప్పుడు బాలగోపాల్ మనిషొకడు మమ్మల్ని ఫాలో అయ్యాడనీ, ఆ వ్యక్తి అదును చూసి టీపీరావును బాత్‌రూంకు పిలిచి, ప్రాణాల మీద ఆశ ఉంటే నెలరోజుల వరకూ హైదరాబాదులో కనిపించవద్దని, ఇంట్లో వాళ్ళ ఫోటోలు చూపించి, కత్తి మెడకు గురిపెట్టి బెదిరించాడనీ, దాంతో ఆయన తింటున్న అన్నం మధ్యలోనే వదిలి పారిపోయి జెడ్ఎం దగ్గరకొచ్చి విషయం చెప్పి, లోన్ విషయంతో తనకేం సంబంధం లేదని మొరపెట్టుకుని నెలరోజుల లీవు ఓరల్‌గా శాంక్షన్ చేయించుకుని పారిపోయాడనీ' చెప్పింది.

"కానీ, ఇదంతా జెడ్ఎంకు తెలిసే జరుగుతోంది. మరో విషయం. నిన్న మొన్నటి వరకూ నీ గురించి నా ముందు స్వేచ్ఛగా చర్చించేవారు. నేను కూడా వాళ్ళ గ్యాంగ్ మెంబరునేనని నమ్మేవారు. కానీ, ఎందుకో వాళ్ళకు నా మీద కూడా అనుమానం వచ్చింది. నేను జెడ్ఎం ఛాంబర్లోకి వెళ్ళగానే అంతవరకూ నవ్వుతూ మాట్లాడుకుంటున్న జెడ్ఎం, ఏజీయం, యూనియన్ లీడర్లు చటుక్కున మాట మారుస్తున్నారు. నా వంక అనుమానంగా చూస్తున్నారు." అని అన్నది.

"అలాగే, హౌజింగ్ లోను విషయంలో ఏదో చిన్న ప్రాబ్లం వస్తే, ఇవ్వాళ మధ్యాహ్నం యూనియన్ ప్రెసిడెంట్ దగ్గరకు వెళ్ళాను. అంతకు ముందువరకు నన్ను ఎంతో అభిమానంగా పలకరించే ఆయన ఇవ్వాళ సహాయం చేయకపోగా, వ్యంగ్యంగా, కఠినంగా మాట్లాడాడని" వాపోయింది.

రాగిణి మాటలు విని నేను కూడా ఆలోచనల్లో పడిపోయాను.

"పోనీ, బాలగోపాల్ ఫైల్ క్లియర్ చేసేద్దామా?" అని మనసులో అనుకుంటున్న వాణ్ణల్లా పైకే అనేశాను.

రాగిణి తల అడ్డంగా ఊపింది.

"వద్దురా!" అని ఒక్క క్షణం తర్వాత,

"నువ్వు భయపడుతున్నావా?" అని ఆశ్చర్యంగా చూసింది.

నేను "అవును" అన్నాను.

రాగిణి చేతులను నా చేతుల్లోకి తీసుకుని, "నేను భయపడుతున్నాను. నీ కోసం భయపడుతున్నాను. నాకేమైనా అయితే నువ్వేమవుతావోనని భయపడుతున్నాను." అని అన్నాను.

"పిచ్చీ! నీలోని ధైర్యాన్ని, తెగువను, నిజాయితీని చూసే నిన్ను ప్రేమించాను. నువ్వు నా కోసం వాటిని వదులుకుంటానంటే, అవి లేని నువ్వు నాకొద్దు కూడా. మందలో ఒకడిలా, గొర్రెల్లో మరో గొర్రె పిల్లలా బ్రతికేవాడు నాకొద్దు. నేను నీలాంటి వాడి కోసమే ఇన్నేళ్ళూ ఎదురు చూశాను. అట్లాంటిది నువ్వు కూడా సాధారణ మనిషిలా మారిపోతానంటే... ఊహూఁ... నువ్వు నాకొద్దు. నా మొగుడు హీరో అయి ఉండాలి. నలుగురిలో గర్వంగా తలెత్తుకుని తిరిగే మొగోడై ఉండాలి. నేను వస్తుంటే 'ఈమే ఆ హీరో భార్య' అని నలుగురూ చెప్పుకునేంత గొప్పవాడివై ఉండాలి నువ్వు. ఇప్పుడు నువ్వు బ్యాంకులో అడుగు పెట్టిన క్షణం నుండీ, ఏం బాంబు పేలుస్తావోనని జెడ్ఎం గుండెల్లో రైళ్ళు పరిగెడతాయి. దొంగల గుండెల్లో రైళ్ళు పరిగెత్తించే నువ్వే కావాలి. పిల్లిలా, కుక్కలా తోకాడించుకుంటూ బాసు వెనుక నడిచే స్టూజ్, అంటే అనామకుడు, అసమర్థుడు నాకొద్దు" అంది ఆవేశంగా.

"మరి భయమేస్తుంది అన్నావ్?"

"అవును. భయం కూడా ఎంత థ్రిల్లింగ్‌గా ఉంటుందో తెలుసా? కానీ కొంచెం జాగ్రత్తగా ఉండు. ప్రమాదం పొంచి ఉందని తెలుసుకుని మసలుకో." అంది.

"మరి డీయస్పీ ఆఫీసుకు వచ్చినప్పుడు 'బ్యాడ్ మూవ్' అని మెసేజ్ ఎందుకు పెట్టావ్?"

"నీకు పోలీస్ సపోర్ట్ ఉందని అందరికీ తెలుసు. అందుకే వాళ్ళు నీ మీద అటాక్ చేయడానికి జంకుతున్నారు. కానీ, వాళ్ళెవరో ఎవరికీ తెలియదు. ఆ పోలీస్ పవర్ డీయస్పీనేనని ఇవాళ బయట పడింది. ఇప్పటినుండి ఆ డీయస్పీని కొనే ప్రయత్నం చేస్తారు. డీయస్పీకి యస్పీతోనో, డీజీతోనో ఫోన్ చేయిస్తారు. డబ్బులతో ప్రలోభ పెడతారు. దేనికీ లొంగకపోతే ఇక్కడి నుండి ట్రాన్స్‌ఫర్ చేయిస్తారు. నీ ఫ్రెండ్ ఐపీయస్ ట్రైనీని కూడా ఇన్‌ఫ్లుయెన్స్ చేస్తారు. నువ్వు ఇవన్నీ తెలుసుకోవాలిరా!" అంది.

"నిజమే! నేను అంత దూరం ఆలోచించలేదు. అంత స్ట్రాటజిక్ ఆలోచన నాకు లేదు. నాకు నీ అంత లౌక్యం లేదు." అని సిన్సియర్‌గా ఒప్పుకున్నాను.

రాగిణిలోని దూరదృష్టికి, సమస్యను విశ్లేషించే అనలిటికల్ పవర్‌కు అబ్బురపడ్డాను.

"మరేం చేద్దాం?"

"చూద్దాం! కానీ, అట్ మోస్ట్ కేర్ తీసుకోవాలి. నువ్వూ నేను కూడా. పెళ్ళి అయ్యే వరకు నీ రూమును కూడా అవాయిడ్ చెయ్యి..." అంటున్న ఆమెను ఆపి, కొంటెగా,

"మరి మన బెడ్ వచ్చిందా? ఇద్దరం పెళ్ళికి ముందే అక్కడ కాపురం పెట్టేద్దామా?" అన్నాను.

"తంతా! ఆ రోజేదో మాయ చేసి, అమాయకురాలిని చేసి నన్ను..." అంటూ ఎవరైనా తమ మాటలు వింటున్నారేమోనని చుట్టూ చూసింది. నిజానికి ఆ రోజు తరువాత రాగిణి నన్ను ముట్టుకోనీయలేదు.

"నిజంరా! భయముంది. కానీ, నిజాయితీని వదలొద్దనీ ఉంది. కాబట్టి జాగ్రత్తలు తీసుకో. ఒకే రూట్లో తిరగకు. కొన్ని రోజులు బైక్ మానెయ్. పబ్లిక్ ట్రాన్స్‌పోర్ట్ వాడు. పోనీ, నాన్నగారి కారు తీసుకోరాదూ..." అంది.

నేను సున్నితంగా తిరస్కరించాను.

నాకు నా గురించి భయం లేదు. కానీ, రాగిణే స్వయంగా నన్ను నా విధానాలు మార్చుకోవద్దని, ధైర్యంగా ముందుకే పొమ్మని చెప్పాక నాకు కొండంత ధైర్యం వచ్చింది. కానీ, ఇప్పటి వరకూ రాగిణిలో ఒక కోమలత్వాన్నీ, సుకుమారత్వాన్నీ చూసిన నేను ఆమెలో మరొక కోణాన్ని, ధైర్యాన్ని చూశాక నేను కొంచెం స్తిమిత పడ్డాను.

ఆ రాత్రి అక్కడ భోజనం చేసి, ఒక కొత్త ఉత్సాహంతో బయల్దేరాను.

***

రాగిణి తనకు పెళ్ళి ఫిక్స్ అయిందని చెప్పి, రిజిస్టర్ పోస్టులో నెల రోజుల లీవ్ అప్లికేషన్ పంపించింది. పెళ్ళి నాతోనేనన్న విషయం మాత్రం రహస్యంగా ఉంచింది. మేము మా ఇద్దరి మధ్య నున్న బంధాన్ని ఇప్పుడే బహిర్గతం చేయకూడదని అనుకున్నాం. నేను కూడా వెంటనే లీవ్ కోసం అప్లై చేస్తే మా రహస్యం బయటపడుతుందని ఆగాను. పెళ్ళికి మూడు రోజుల ముందునుంచి పదిహేను రోజులు లీవ్ అప్లై చేయాలని నిర్ణయించుకున్నాను.

అదీగాక ఇప్పుడే నేను సెలవు పెడితే టీపీరావు గారి లాగా నేను కూడా భయపడి పారిపోయాను



అనుకుంటారు. ఇదే అదనుగా భావించి నా సెక్షన్‌లో వేరే వారిని పోస్ట్ చేసి బాలగోపాల్ ఫైలు పాస్ చేయించేస్తారు. ఇవేవీ జరగకూడదంటే నేను బ్యాంకుకు వెళ్తూ ఉండాల్సిందే. పెళ్ళికి ఎలాగూ బ్యాంకు వాళ్ళను పిలుస్తాము కాబట్టి అప్పుడు లీవ్ పెట్టినా పెద్దగా ప్రభావం చూపదు.

అప్పుడు వాళ్ళు ఫైల్ మూవ్ చేయాలనుకున్నా చేయలేకపోయారు. ఎందుకంటే, ఒకసారి కన్సార్షియం మీటింగ్ పోస్ట్‌పోన్ అయితే, మళ్ళీ అన్ని బ్యాంకుల వాళ్ళు కలవాలంటే కనీసం నెల రోజుల టైం పడుతుంది. అప్పటికి నేను తిరిగి వచ్చేస్తాను.

పెళ్ళి తరువాత మాత్రం హనీమూన్ కోసం 'కూర్గ్' వెళ్ళాలని ఇద్దరం కలిసి ప్లాన్ చేసుకున్నాం. అందుకోసం, విమాన టిక్కెట్లు కొనేశాను. హోటల్ బుకింగ్స్ చేసేశాను.

టీపీరావుగారితో పాటూ రాగిణి కూడా లేకపోవడంతో బ్యాంకులో పూర్తిగా ఒంటరినై పోయాను. మనసు విప్పి కాదు కదా కనీసం, మాట్లాడే వాళ్ళు కూడా కరువయ్యారు.

ఒక రోజు ఆశ్చర్యంగా యంపీ బాలగోపాల్ నా దగ్గరకు వచ్చాడు. "నమస్కారం సార్!" అన్నాడు.

నేను ముందు ఆశ్చర్యపోయాను. తరువాత, లేచి నిలబడి, ఆయన్ని కూర్చోమన్నాను. అతను కూర్చున్నాడు. నా మొండితనం గురించి తెలిసిన అతను నేను చూపించిన మర్యాదకు విస్తుపోతూ కూర్చుని నన్నే చూస్తుండిపోయాడు. లిప్తపాటు తరువాత,

"సార్! మా విద్యుత్ ప్రాజెక్టు లోన్ ఫైల్ విషయంలో మీకేవో క్లారిఫికేషన్లు కావాలని అన్నారట. అవన్నీ మేము రాబోయే కాలంలో ఫర్నిష్ చేస్తాం సార్! ఇంత పెద్ద ప్రాజెక్టు రాష్ట్రానికి వస్తుంటే ఏవో కొన్ని చిన్న చిన్న లోటుపాట్లు ఉంటూనే ఉంటాయి సార్! వాటిని పట్టించుకోకూడదు. ఈ రోజుల్లో పవర్ ఈజ్ మోస్ట్ ఎసెన్షియల్ ఫర్ ఎస్టాబ్లిషింగ్ ఎనీ ఇండస్ట్రీ సార్! మనం ఇన్ఫ్రాస్ట్రక్చర్ ఫెసిలిటీస్ ఇవ్వకుంటే దేశవిదేశాల నుండి పారిశ్రామికవేత్తలు మన రాష్ట్రంలో పరిశ్రమలు పెట్టడానికి ఎందుకు వస్తారు సార్!" అన్నాడు.

ఆయన పాలిష్డ్ తెలుగు, ఇంగ్లీషు భాషల్లో చాలా సంస్కారవంతంగా మాట్లాడుతుంటే ముచ్చటేసింది. ఆయన చెప్పింది కూడా అక్షరాలా వంద శాతం నిజం. కొత్తవాడెవడైనా వింటే ఆయనే దేశభక్తుడు, నేనే దేశద్రోహిని, అభివృద్ధి నిరోధకుణ్ణి అనుకునేంత కన్విన్సింగ్‌గా మాట్లాడాడు.

"ఔను మీరన్నవన్నీ నిజమే సార్! మనకు పవర్ కావాల్సిందే. విద్యుత్ ప్రాజెక్టు పెట్టడం కూడా గొప్ప విషయమే. నాకు మీ మీద గానీ, మరెవరి మీద గానీ ఎటువంటి కోపం గానీ, నెగెటివ్ ఒపీనియన్ గానీ లేవు. ఐ వాంట్ టూ క్లారిఫై ఫస్ట్ దిస్ టూ యూ. మీకు నా గురించి ఎవరేం చెప్పినా నమ్మకండి ప్లీజ్!

కానీ, మేము మూడువేల కోట్ల రూపాయల ఋణం మంజూరు చేయాలంటే కొన్ని బ్యాంకు నిబంధనలను పాటించవలసి ఉంటుంది. నేను ఆ రూల్సుకు వ్యతిరేకంగా పనిచేయను. జెడ్‌ఎం చెప్పినా, ఛైర్మన్ చెప్పినా నేను పద్ధతి తప్పను. నన్ను ఇక్కడి నుంచి తప్పించినా నేనేం బాధపడను.

ఐ గో బై రూల్స్. ఓకేనా సార్! ఇక మీ ప్రపోజల్ విషయానికొస్తే, మీరు ఈ లోనుకు తనఖా పెట్టిన, కొల్లాటెరల్‌గా చూపించిన భూమి మార్కెట్ వాల్యూ ఎకరాకు లక్షల రూపాయలని డిస్ట్రిక్ట్ రిజిస్ట్రార్ సర్టిఫై చేశాడు. మీరేమో దాని విలువ ఎకరాకు ఐదు కోట్లని చూపించారు. మీకు పది ఎకరాల క్లియర్ టైటిల్ ఉంటే మీరేమో పదమూడు వందల ఎకరాల స్థలం మీదేనని చూపించారు. అందుకు సపోర్టుగా తెల్ల కాగితాల మీద రాసుకున్న సేల్ అగ్రిమెంట్లు చూపించారు.

మీకు పర్యావరణ శాఖ నుంచి అనుమతులు లేవు. దాని విషయమై గ్రీన్ ట్రిబ్యునల్‌లో కేసు నడుస్తోంది. ఒకవేళ మీరు గెలిచినా, ఓడినా కేసు సుప్రీంకోర్టుకు వెళుతుంది. అక్కడ ఎన్ని సంవత్సరాలు పడుతుందో ఎవరికీ తెలియదు.

మీరు, రాష్ట్రప్రభుత్వానికి విద్యుత్ అమ్ముతున్నట్లుగా ఒక ఒప్పందం PPA కూడా చేసుకోలేదు.

రేపు వీటి విషయంలో కాంకరెంట్ ఆడిట్‌లో

గానీ, కన్సార్షియం మీటింగులో గానీ ఎవరైనా పాయింట్ అవుట్ చేస్తే నేనేం సమాధానం చెప్పాలి సార్!" అని నెమ్మదిగా, కూల్‌గా, నవ్వుకుంటూ అడిగాను.

ఆయన నాలోని సిన్సియారిటీని మెచ్చుకుంటూనే,

"గుడ్! యూ ఆర్ గుడ్ ఎట్ యువర్ ఆర్గ్యుమెంట్! కానీ, మీరు చాలా అమాయకులు సార్! చిన్నవాళ్ళు. ఆవేశం ఉంటుంది. అందుకే రూల్స్ ప్రకారం అంటూ రూల్స్ పట్టుకుని పాకులాడతారు. కానీ, అన్నీ రూల్స్ ప్రకారమే జరగాలనుకుంటే ఈ రాష్ట్రంలో ఒక్క ఇండస్ట్రీ కూడా రాదు." అంటూ ఆగి, నా వైపుకు వంగి,

"ఆడిటర్లను, మిగిలిన బ్యాంకర్లను మేం మేనేజ్ చేసుకుంటాం కదా! అప్పుడు మీకు ఓకేనా?" అని రహస్యంగా అడిగాడు.

"కాదు సార్! ముందు నేనే ఒప్పుకోను. నన్ను మీరు మేనేజ్ చేయలేరు. అదీ కాకుండా మీరు ఇంతకు ముందు తీసుకున్న పదివేల కోట్ల రూపాయల లోన్లలో ఒక్క రూపాయి కూడా తిరిగి బ్యాంకుకు చెల్లించనే లేదుకదా సార్?" అన్నాను.

ఆ మాటలకు, అతని ముఖానికి అంతవరకు ధరించిన నాగరికత ముసుగులో ఒక చిన్న పగులు కనిపించింది. కానీ, మరుక్షణంలో తేరుకుని,

"అవన్నీ కోర్టులో ఉన్నాయి కదా! సరే, మీరు మాత్రం మరొక్కసారి ఆలోచించండి. మీరు కాకపోతే, ఇదే ప్రపోజల్‌ను వేరే బ్యాంకు ద్వారా శాంక్షన్ చేయించుకోగలను." అన్నాడు బింకంగా.

నేను "యువర్ విష్ సార్!" అన్నాను.

"ఓకే దెన్, నైస్ టాకింగ్ టూ యూ!" అంటూ లేచాడు.

# లాకర్ నెం.369

## కూపన్ నెం.8 విజేత

**కె.కల్యాణి**
**ప్రొద్దుటూరు**

నేను "సార్! నో హార్డ్ ఫీలింగ్స్! మీరు మంచివారి లాగానే ఉన్నారు. అందరూ అనుకుంటున్నట్లుగా దుర్మార్గులు కారు!" అన్నాను.

ఆయన ఫక్కున నవ్వి,

"థాంక్యూ!" అన్నాడు.

ఆయన నా రూములో నుంచి బయటకెళ్తుంటే, దగ్గరకు వెళ్ళి,

"సార్!" అని పిలిచాను. ఆయన కళ్ళల్లో ఏదో ఆశాకిరణం పొడసూపింది. ఆయన ఆగగానే, ఆయన దగ్గరకు వంగి,

"సార్! లోన్ శాంక్షన్ కాకపోతే మీరు నా మీద అటాక్ చేయిస్తారని అందరూ అనుకుంటున్నారు. నిజమేనా సార్?" అని అమాయకంగా అడిగాను.

అప్పుడు, ఆయన నా వైపు చూసిన చూపుకు, నాకు అర్థం తెలియలేదు. ఆయన నా భుజంపై చెయ్యి వేసి,

"సార్! మేం బిజినెస్ పీపుల్సుమండీ! ఒకచోట ప్రయత్నిస్తాం. అక్కడ సక్సెస్ కాకపోతే మరొక చోట ట్రై చేస్తాం. మరొక విధంగా ట్రై చేస్తాం. అంతేటా, అందరూ మీలా ఉండరు కదా! ఎక్కడో ఒకచోట మా పని జరిగిపోతుంది సార్. దానికోసం మీలాంటి వాళ్ళతో శత్రుత్వం పెంచుకోలేం కద సార్! ఇట్లాంటి గుండాగిరీ పనులు మా ఇంటా వంటా లేవు సార్!" అన్నాడు.

"సార్! అందుకే, ఎందుకైనా మంచిదని, నా జాగ్రత్త కోసం మన మధ్యన జరిగిన సంభాషణ అంతా రికార్డు చేశాను సార్, నా సేఫ్టీ కోసం! కానీ, మీరు అట్లాంటిదేమీ ఉండదంటున్నారు కాబట్టి నేను దాన్ని డిలీట్ చేసేస్తాను సార్!" అని నవ్వుతూ అన్నాను.

దాంతో ఆయన ముఖం మాడిపోయింది. కానీ, తమాయించుకున్నాడు. వెంటనే,

"ఓకే, నో ప్రాబ్లం. మాకు అటువంటి దురుద్దేశమైతే లేదు. హావ్ ఏ గుడ్ డే!" అంటూ వెళ్ళిపోయాడు.

ఆయనతో పాటు అతనితో వచ్చిన వందిమాగధులంతా బయటకు నడిచేసరికి రూం ఖాళీ అయి చల్లటి తాజా గాలి వీచింది.

నా మనసులోని భారం తీరినట్టయింది. బాల గోపాల్ ఇంక నా జోలికి రాడనిపించింది.

కానీ, నా ఆలోచన ఎంత తప్పో, ఆనాడు నేను అతనితో మాట్లాడిన మాటల వల్ల మా జీవితాలు ఎంత అల్లకల్లోలమవుతాయో అప్పుడు నేను ఊహించలేదు.

**(ఇంకా వుంది)**

---

ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!
మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి
కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!

## లాకర్ నెం. 369-10 (30-8-2017)

మా ప్రశ్న: పెళ్ళికోసం రాగిణి ఎన్ని రోజులు లీవ్ అప్లయ్ చేసింది?

మీ జవాబు------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------

---------------------------------------------------------------------

--------------------------------పిన్-----------------------ఫోన్‌నెం.--------------------

ఈ కూపన్‌ను 29 ఆగస్టు 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

# జై జై వినాయక

వినాయక చవితి వచ్చిందంటే  దేశం మొత్తం పండుగ వాతావరణం నెలకొని ఉంటుంది. వినాయకుడిని పూజించడం అనేది కేవలం మనదేశానికే పరిమితం కాలేదు. ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాలలో వివిధ రకాలుగా వినాయకుణ్ణి పూజిస్తారు. వినాయకుడి విగ్రహాల ప్రతిష్ఠాపనలో కూడా విభిన్నత సంతరించుకుంటుంది. అలా భారీ లంబోదరుడు విగ్రహాన్ని ఒకచోట ఏర్పాటు చేస్తే, విభిన్న రకాల వినాయకులన్నింటినీ ఒకే చోట చేర్చి ఏకంగా ఓ మ్యూజియాన్నే ఏర్పాటు చేశారు మరోచోట. మరి ఆ విశేషాలేంటో మీరూ తెలుసుకోండి.

## అతి పొడవైన వినాయకుడు

ఏటా జరుపుకునే వినాయకుడి వేడుకల్లో వినాయక విగ్రహాల తయారీలో విభిన్నతతో పాటు అతి పొడవైన విగ్రహంగా గుర్తింపు కోసం మన దేశంలోని వివిధ రాష్ట్రాల్లో పోటీ పడుతుంటారు. చవితి పండుగ కోసం ప్రత్యేకంగా తయారుచేసే వినాయకుడి విగ్రహాల్లో విభిన్న రూపాల్లో కనిపించేవి కొన్నయితే దేశంలోనే అతి పెద్ద విగ్రహంగా కొలువుతీరిన విగ్రహాలు మరికొన్ని. ఎప్పటికప్పుడు గణేషుడి విగ్రహాల తయారీలో నూతనత్వం కోసం పోటీ పడుతుంటారు కళాకారులు. గణేషుడి నవరాత్రుల



కోసం కొన్ని నెలల ముందు నుంచే కష్టించి చేసే ఆ మట్టి విగ్రహాల్లో జీవకళ ఉట్టిపడుతుంది. ఇప్పటి వరకు మహారాష్ట్రలో 85 అడుగుల చిన్మయ గణపతి భారత దేశంలోనే అతి పెద్ద గణపతి విగ్రహంగా కొలువుదీరితే, ప్రస్తుతం శంభాపూర్ గణపతి విగ్రహానికి ఎత్తయిన విగ్రహంగా ప్రపంచ స్థాయి రికార్డు దక్కనుంది.

## వినాయక మ్యూజియం

వినాయకుడికి ఓ మ్యూజియం కూడా ఉందన్న సంగతి మీకు తెలుసా! వినాయకుడిని ఎక్కువగా ఇష్టపడే థాయిలాండ్‌లోని చియాంగ్మై ప్రాంతంలో ఉంది గణేష్ హిమాల్ మ్యూజియం. ఖున్ పన్దారా తీరకనాన్ద్ అనే వ్యక్తి ఈ మ్యూజియాన్ని నిర్వహిస్తున్నాడు. బ్యాంకాక్‌లో పుట్టి పెరిగిన తీరకనాన్ద్ 19వ ఏట తండ్రి ఇచ్చిన వినాయకుడి బొమ్మ, అతన్ని ఎంతగానో ఆకట్టుకుందట. అప్పటి నుండి విభిన్నంగా ఉండే గణేష్ బొమ్మలు, పెయింటింగ్స్‌ని సేకరించడం ప్రారంభించాడు. వాటి కోసం సొంతంగా మ్యూజియంని నిర్మించాడు తీరకనాన్ద్. ఆసియా ఖండంలోని అనేక దేశాలకు సంబంధించిన వెయ్యికిపైగా వినాయకుడి కళాకృతులు ఈ మ్యూజియంలో ఉన్నాయి. శాన్ పటాంగ్ ప్రాంతంలో 1.9 ఎకరాల్లో ఎంతో అందంగా నిర్మించిన ఈ మ్యూజియాన్ని చూసేందుకు వచ్చే సందర్శకుల కోసం గణేషుడి పెయింటింగ్స్, బొమ్మల్ని కొనుగోలు చేసే ఒక దుకాణాన్ని ఏర్పాటు చేశారు. ఉదయం 9 గంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు సందర్శకుల కోసం ఈ మ్యూజియాన్ని తెరచి ఉంచుతారు. ఈ మ్యూజియంలోకి ప్రవేశం పూర్తిగా ఉచితం. ఇక శ్రీలంక ప్రభుత్వం నిర్వహణలో ఉన్న కొలంబో నేషనల్ మ్యూజియంలో 12వ శతాబ్దం నాటి గణేషుడి ఏకశిలా విగ్రహాలు, కాంస్య విగ్రహాలు ప్రదర్శనకు ఉంచారు. ఇక్కడ అతి పురాతన రాతి విగ్రహాలు దర్శనమిస్తాయి. అయితే ఆవి ఏప్రాంతానికి చెందినవి, ఎప్పటివనే సమాచారం మాత్రం ఇంతవరకు లభించలేదు.

నవ్య



# విదేశాల్లో వినాయక పూజలు

**భారతీయులందరూ జరుపుకునే పండుగల్లో వినాయక చవితి ఒకటి. ఆరోజు ఊరూరా వాడవాడా పందిళ్లు వెలుస్తాయి. నవరాత్రుల సందడి ఒకెత్తయితే నిమజ్జనం సందడి మరో ఎత్తు. ఎంతో వైభవంగా చేసుకునే ఈ నవరాత్రులు కేవలం మనదేశానికే పరిమితం కాలేదు. ఇతర దేశాల్లో కూడా వినాయక నవరాత్రులను ఘనంగా నిర్వహిస్తారు. మరి ఆయా దేశాల్లో చవితి పండుగ ఎలా చేస్తారో తెలుసుకుందామా!**

### అమెరికా

మన పొరుగు దేశమైన అమెరికాలో కూడా వినాయక నవరాత్రి సంబరాలు జరుగుతాయి. అమెరికాలోని భారతీయులతో పాటు, బౌద్ధ, జైన మతాలకు సంబంధించిన మత సంస్థలు కూడా అక్కడ వినాయక చవితి వేడుకల్ని నిర్వహిస్తాయి. వ్యారెన్ విల్లే, ఇల్లినాయిస్ అనే ప్రాంతాల్లో అట్టహాసంగా జరిగే ఈ పండుగకి అమెరికాలోని భారతీయులతో పాటు వివిధ దేశాల వారు హాజరవుతుంటారు. రకరకాల రూపాలతో తయారు చేసిన వినాయక విగ్రహాలతో ఊరేగింపుగా సాగే యాత్రలో పిల్లలు పెద్దలు ఆనందోత్సాహాలతో పాల్గొంటారు.

### ఫ్రాన్స్

ఫ్రాన్స్ రాజధాని పారిస్‌లో భారీ స్థాయిలో వినాయక నవరాత్రి ఉత్సవాలు నిర్వహిస్తారు. నవరాత్రులు అయిన తర్వాత చివరిరోజు రథోత్సవాన్ని నిర్వహిస్తారు. వినాయకుడి విగ్రహాన్ని ఉంచిన రథాన్ని లాగుతూ స్థానికులు భజన చేస్తుంటారు. కీర్తనలు పాడుతుంటారు. హిందువులందరూ సాంప్రదాయ దుస్తులు ధరించి ఈ రథోత్సవంలో పాల్గొంటారు. నాలుగు కిలోమీటర్లు సాగే ఈ రథోత్సవంలో శ్రీలంక, ఫ్రెంచ్ వారితో పాటు మిగతా యూరోపియన్లు కూడా అధికంగా పాల్గొంటారు. ఫ్రాన్స్‌లో నిర్వహించే ఈ వేడుకకి వినాయకుడి బొమ్మల నిమజ్జనం కంటే రథోత్సవానికే ప్రాముఖ్యత ఎక్కువ.

### థాయిలాండ్

థాయిలాండ్ అనగానే మనకు బౌద్ధమతం గుర్తుకు వస్తుంది. కానీ ఆదేశ వాసులు కూడా వినాయకుడిని ఎక్కువగా విశ్వసిస్తారు. హిందువులు, బౌద్ధులు రెండు వర్గాల వారు కలిసికట్టుగా ఈ పండుగని జరుపుకుంటారు. ప్రముఖ వాణిజ్య నగరంగా పేరుపొందిన బ్యాంకాక్‌లో వినాయకుడికి సంబంధించిన ఆలయాలు కూడా ఎక్కువగా ఉంటాయి. అక్కడ ఉన్న రచదామ్రి రోడ్‌లోని ఇసెటాన్ స్టోర్ వద్ద ఉన్న గణేశుడి ఆలయం బ్యాంకాక్‌లో అతిపెద్ద ఆలయంగా ఖ్యాతి గడించింది. ఇక్కడ వినాయకుడిని 'ప్రాపికానెడ్' అని పిలుస్తారు. మనమిక్కడ తొమ్మిది రోజులు వినాయక చవితి పండుగని జరుపుకుంటే థాయిలాండ్‌లోని పట్టణ ప్రాంతంలో పదిహేను రోజులపాటు జరుపుకుంటారు. పట్టయానక్లువా నగరం దగ్గర ఉన్న ల్యాన్ పొ పార్క్ నుంచి ప్రారంభమై నక్లువా బీచ్ వద్ద ఉన్న చొన్‌గ్లోమ్ వరకు జరిగే గణేష్ విగ్రహాల ఊరేగింపు కన్నుల పండువగా జరుగుతుంది. ఆ బీచ్‌లోనే గణనాయకులను నిమజ్జనం చేస్తారు. రెండు వారాలపాటు కొనసాగే గణేష్ విగ్రహాల నిమజ్జన కార్యక్రమంలో అక్కడి ప్రజలు వేలాదిగా పాల్గొంటారు. గణేశుడు పుట్టిన రోజుగా పాటించే ఈ పండుగ రోజున కొన్ని ప్రాంతాల్లో కుడుముల్ని కేక్‌లా తయారు చేసి క్యాండిల్స్‌తో అలంకరిస్తారు. పాటలు పాడుతూ, నృత్యం చేస్తూ గణపతికి పుట్టినరోజు శుభాకాంక్షలు తెలిపే ఒక వైవిధ్యమైన సాంప్రదాయం థాయిలాండ్‌లో కనిపిస్తుంది. సమన్ రత్తనారమ్ ఆలయంలో 16 మీటర్ల పొడవు 22 మీటర్ల వెడల్పుతో తీర్చిదిద్దిన అతి పెద్ద గణేష్ విగ్రహం ప్రపంచస్థాయి గుర్తింపుని గడించింది.



### సింగపూర్

తమిళులు ఎక్కువగా నివసించే సింగపూర్‌లో హిందూ పండుగలు కొన్ని వందల ఏళ్ల క్రితమే ప్రవేశించాయి. ఇక్కడి సెన్నగ్ వినాయగర్ ఆలయానికి దక్షిణాసియా ఖండంలోనే అతిపెద్ద గణపతి ఆలయంగా గుర్తింపు లభించింది. 150 ఏళ్లనాటి ఈ ఆలయంలో నిర్వహించే వినాయక చవితి వేడుకల్లో చైనీయులు, భారతీయులు ఎక్కువగా పాల్గొంటారు. ఆఫ్రికన్ మహాగనీ చెట్ల కొమ్మలతో గణేశుడిని పూజిస్తారు. తొమ్మిదిరోజులపాటు భారీ రీతిలో పండుగని నిర్వహిస్తారు. నవరాత్రులు నిర్వహించే సమయంలో ఈ ఆలయంలో పూలు, ఆకులు, పండ్లు తప్ప డబ్బు కానుకగా తీసుకోరు.

### యూరప్, లండన్

యూరప్‌లోని వివిధ ప్రాంతాల్లో ఎక్కువగా భారతీయులు నివసిస్తుండటంతో భారతీయ సంస్కృతికి సంబంధించిన పండుగలు ఇక్కడ ప్రాముఖ్యతని సంతరించుకున్నాయి. వినాయకుడిని సైన్యాధిపతిగా భావిస్తూ యూరప్‌లోని వివిధ ప్రాంతాల్లో ఎప్పటి నుంచో ఆరాధనలు మొదలైనా లండన్‌లో మాత్రం 2005 నుంచి ఈ పండుగని జరుపుకుంటున్నారు. చివరి రోజున నిర్వహించే నిమజ్జన వేడుక శోభాయాత్రతో మొదలవుతుంది. దాదాపు నాలుగు వేల మంది ఈ యాత్రలో పాల్గొంటారు. ఈ యాత్రకి భారతీయులతో పాటు అక్కడి స్థానికులు హాజరవుతారు. కింగ్ స్ట్రీట్, సౌత్ హాల్ మీదుగా థేమ్స్ నదిని చేరుకోవడంతో యాత్ర పూర్తవుతుంది. పుట్నీ పీర్ వంతెన వద్ద ఉన్నతాధికారులు, పెద్దల సమక్షంలో గణపతి నిమజ్జనాన్ని పూర్తిచేస్తారు.

### కంబోడియా

కంబోడియాలో కూడా వినాయక నవరాత్రులను ఘనంగా నిర్వహిస్తారు. పొడవాటి తొండం, రెండుచేతుల్లో అస్త్రాలు ధరించి, కాలుమీద కాలు ఉంచిన భంగిమలో ఉండే వినాయకుడి రూపాన్ని కంబోడియాలో 'ప్రా కీన్స్' అని పిలుస్తారు. సాధారణంగా అన్ని దేశాల్లో పెద్ద పొట్టతో ఉండే వినాయకుడి విగ్రహాలకు భిన్నంగా ఉంటుందీ రూపం. అతిప్రాచీన నగరంగా పేరొందిన ఆంగ్‌కోర్‌వాట్ కంబోడియా సామ్రాజ్యానికి రాజధానిగా ఉండేది. ఈ నగరంలో ఉన్న పురాతన గణపతి ఆలయం 'టా ప్రొహ్మ్(టా బ్రహ్మ)' 19వ శతాబ్దంలో ఫ్రెంచి వాళ్లు ఈ ఆలయాన్ని కనుగొన్నారు. టా ప్రొహ్మ్ ఆలయాన్ని పునరుద్ధరించకపోవడంతో ఇప్పటికీ ఆలయం గోడలపై 'ప్రా కీన్స్' విగ్రహం కనిపిస్తుంది.

**– సంతోషిలక్ష్మి దహగాం**



**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి

# హెపటైటిస్,హెర్పిస్‌లకు సరైన చికిత్స

చాలా మంది ఈ ప్రశ్న అడుగుతుంటారు. ఏళ్ల తరబడి చికిత్సలు తీసుకున్నా ఈ వ్యాధులు బాధపెడుతుండమే కారణం. అందుకే ఈ వ్యాధులు ఇక మమ్మల్ని వదలవా అని అడుగుతుంటారు. కానీ హోమియో వైద్యంతో ఈ వ్యాధులు పోయే అవకాశాలున్నాయి.

**హెపటైటిస్** వైరస్ మూలంగా అనేక మంది తీవ్రమైన కాలేయ వ్యాధి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు. ఆకలి లేకపోవడం, వాంతులు వచ్చినట్టు అనిపించడం, ఒళ్లంతా నొప్పులు, మూత్రం పచ్చగా రావడం, కామెర్లు అభివృద్ధి చెందడం, చర్మంపైన దద్దుర్లు రావడం జరుగుతుంది. ఈ వ్యాధి కొన్ని సంవత్సరాల తర్వాత బయటపడినట్లయితే దాన్ని క్రానిక్ హెపటైటిస్ అంటారు. దీని వల్ల కామెర్లు వస్తాయి. ఎంతకీ తగ్గవు. వాంతులు, ఒళ్లంతా దురద, కొన్నిసార్లు విరేచనాలు, కడుపులో ఉబ్బరంగా ఉండటం, పొట్టలో నొప్పి, ఆర్థరైటిస్ వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లెట్ కౌంట్స్ పడిపోవడం, తలనొప్పి, రక్తహీనత, రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. లైంగిక కలయిక ద్వారా వచ్చే హెర్పిస్ వ్యాధి తగ్గినట్లే తగ్గి రోగనిరోధక శక్తి తగ్గినపుడు మళ్లీ కనిపించవచ్చు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి రావడానికి ఆస్కారం ఉంటుంది.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియో విధానంలో అందుబాటులో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు.

# సంతానం లేని దంపతుల జీవితాల్లో వెలుగులు

ఆధునిక చికిత్సలు ఎన్ని అందుబాటులోకి వచ్చినా సంతానలేమితో బాధపడుతున్న దంపతులకు పరిష్కారాన్ని చూపలేకపోతున్నాయి. అయితే హోమియో మాత్రం ఇందుకు భిన్నంగా సత్ఫలితాలను అందిస్తోంది. కొందరు దంపతులు పెళ్లయి మూడేళ్లే అవుతోందిగా, ఇంకా తొందరెందుకు? మెల్లగా చూపించుకుందాలేం అని నిర్లక్ష్యంగా ఉంటారు. కానీ ఏడాదిగా ఎటువంటి గర్భనిరోధక పద్ధతులు పాటించకపోయినప్పటికీ గర్భం రాకపోయినట్లయితే సంతానలేమి సమస్య ఉన్నట్లుగా భావించాలి.

**కారణాలు ఇవి కావచ్చు :** వీర్యకణాలు తక్కువగా ఉంటే సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. వేరికోసిల్, హైడ్రోసిల్, మూత్రసంబంధ వ్యాధులు, సుఖ వ్యాధుల వల్ల కూడా వీర్యకణాలు నశించి సంతానలేమికి కారణమవుతూ ఉంటాయి. దీర్ఘకాలంగా షుగర్ వ్యాధి ఉండటం, అధిక బరువు, వృషణాలకు దెబ్బలు తగలడం, ప్రమాదాల్లో వెన్నుకు గాయాలవడం, హార్మోన్ల అసమతుల్యత, క్రోమోజోముల లోపాలు, విపరీతంగా స్మోకింగ్ చేయడం వంటివి కూడా పురుషుల్లో సంతానలేమికి కారణమవుతుంటాయి. బిగుతైన దుస్తులు ధరించడం, ప్రతిరోజు వేడి ఎక్కువగా ఉండే నీళ్లతో స్నానం చేసే అలవాటు ఉండటం వంటివి కూడా సంతానలేమికి కారణమవుతాయి.

**నిర్ధారణ పరీక్షలు తప్పనిసరి :** వీర్య (సెమన్ అనాలసిస్) పరీక్ష ద్వారా వీర్యంలో ఉన్న లోపాలను గుర్తించవచ్చు. వీర్యంలో ప్రతి ఎంఎల్‌లో 60 నుంచి 120 మిలియన్ల వీర్యకణాలుండాలి. అందులో 80 శాతం కణాలు బాగుండాలి. వాటి కదలికలు బాగుండాలి. టెస్టికల్ సైజు, ఏదైనా లోపం ఉన్నదీ తెలుసుకోవడానికి అల్ట్రాసౌండ్ పరీక్షలు ఉపయోగపడతాయి.

**హోమియో చికిత్సతో ఆనందం :** సంతానలేమికి కచ్చితమైన కారణం తెలుసుకుని చికిత్స అందిస్తే సంతానసాఫల్యం తప్పక కలుగుతుంది. వీర్యకణాల లోపం ఉంటే హోమియో మందులు తీసుకోవడం ద్వారా వీర్యపుష్టి కలుగుతుంది. వీర్యకణాల కదలికలు పెరుగుతాయి. శారీరక ధర్మాలను, మానసిక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులను అందించడం ద్వారా మంచి ఫలితం లభిస్తుంది. హార్మోన్ల సమస్యలు సైతం హోమియో చికిత్సతో తొలగిపోతాయి. అంగస్తంభనలు లేకపోవడం వంటి సమస్యను హోమియో మందులు దూరం చేస్తాయి. మొత్తంగా సంతానలేమి కారణాలన్నీ దూరమయిపోయి సంతానం సిద్ధిస్తుంది.

# భుజంనొప్పిని ఎన్నాళ్లు భరిస్తారు?

భుజం నొప్పి యుక్తవయస్కుల్లో రావచ్చు లేదా వయసుపైబడిన వారిలో రావచ్చు. అయితే యుక్తవయస్కుల్లో వచ్చే భుజంనొప్పికి, వయసుపైబడిన వారిలో వచ్చే భుజంనొప్పికి కారణాలు వేరువేరుగా ఉంటాయి.

**లిగమెంట్ టేర్ :** సాధారణంగా గాయాల బారినపడినపుడు భుజం ఎముక దగ్గర ఉండే లిగమెంట్ చిరిగిపోతుంది. ఫలితంగా షోల్డర్ జాయింట్ డిస్ లోకేట్ అవుతుంది. ఈ సమస్యను అలాగే వదిలిస్తే జాయింటు మొత్తం అరిగిపోతుంది.

**ఫ్రోజెన్ షోల్డర్ :** లిగమెంట్స్ చుట్టూ ఉండే కండరాలు బిగుసుకుపోతాయి. దీనివల్ల ఎలక్ట్రిక్ షాక్ మాదిరిగా తీవ్రమైన నొప్పి మొదలవుతుంది. 40 నుంచి 60 ఏళ్ల మధ్య వయస్సు వారిలో ఎక్కువ. డయాబెటిస్ రోగుల్లో ఈ సమస్య ఎక్కువ.

**రోటేట్ కఫ్ టేర్ :** ఈ సమస్య బారినపడిన వారిలో రెండు ఎముకల మధ్య గ్యాప్ తగ్గిపోతుంది. ఫలితంగా ఎముక రాపిడికి గురై తీవ్రమైన నొప్పి ఏర్పడుతుంది. భుజంపైన నొప్పి ఉండటంతో పాటు చేతివైపు కూడా నొప్పి ఉంటుంది. చేయిపైకి లేపాలని చూసినపుడు నొప్పి వస్తుంటుంది. ఆ వైపు పడుకోవాలని చూసినా నొప్పి వస్తుంటుంది.

**టెన్నిస్ ఎల్బో :** ఈ సమస్య ఎక్కువగా రిపీటెడ్ మూవ్‌మెంట్స్ చేసే వారిలో కనిపిస్తుంది. ముఖ్యంగా స్త్రీలలో ఎక్కువ. గిన్నెలు తోమడం, బట్టలు ఉతకడం వంటి పనులు ఎక్కువగా చేసే వారిలో ఈ సమస్య ఏర్పడుతుంది. టెన్నిస్ ఎల్బో అంటే టెన్నిస్ క్రీడాకారుల్లో మాత్రమే కాకుండా ఎవరిలోనైనా ఏర్పడవచ్చు.

**హోమియో వైద్యం :** ఏ కారణం చేత భుజం నొప్పి వస్తున్నా హోమియో మందులు పరిష్కారాన్ని చూపుతాయి. నొప్పి నివారణ మాత్రలు తాత్కాలిక ఉపశమనాన్ని మాత్రమే ఇస్తాయి. కానీ హోమియో వైద్యం శాశ్వత పరిష్కారాన్ని చూపుతుంది.

# ఓ వారాలబ్బాయి జయభేరి

## (మురళీమోహన్ జీవితాలాపన) 4

# అలా దొరకడం మాకిష్టం లేదు

(గతవారం తరువాయి)

**కృష్ణగారి తల్లిదండ్రులకు ఏలూరు దగ్గరలో కొన్ని తోటలు ఉండేవి. అందువల్ల వాటికోసం ఏలూరు దగ్గర ఉండేవారు. దాంతో ఈయన కాలేజీ చదువులకు ఏలూరులో జాయిన్ అయ్యారు.**

మా ఊరు నుంచి ముఖర్జీ అని ఒకాయన అదే కాలేజీలో చదివేవారు. ముఖర్జీగారి అక్కగారి ఊరు కృష్ణగారి ఊరు ఒక్కటే. ముఖర్జీగారు ఒక రోజు కృష్ణగారిని తీసుకొచ్చి నాకు పరిచయంచేసి 'మా అక్కగారి ఊరయ్యా... బుర్రిపాలెం. నీతో పాటు పక్కన కూర్చోపెట్టుకో. మీరిద్దరూ కలిసి ఉండండి' అని చెప్పారు. ఆ విధంగా ముఖర్జీగారి వల్ల కృష్ణగారు పరిచయమయ్యారు. ముఖర్జీ 'ఎ' సెక్షన్‌లో ఉండేవారు. మేమిద్దరం 'బి' సెక్షన్‌లో కూర్చునేవాళ్లం. నేను, కృష్ణగారు ఫ్రంట్ బెంచ్ స్టూడెంట్స్‌మి. ఆ రోజుల్లో ఫ్రంట్ బెంచ్ అంటే, బుద్ధిమంతులను, అసలు అల్లరి చేయనివాళ్లని, శ్రద్ధగా పాఠాలు వినేవాళ్లని మాత్రమే ముందుబెంచీలో కూర్చోబెట్టేవారు. ఏమాత్రం అల్లరి చేసినా ఇమీడియెట్‌గా వెనకబెంచీకి షిఫ్ట్ చేసేవారు.



### అందగాడు!

నేను చూడ్డానికి బానే ఉండేవాడిని. కృష్ణగారైతే మరీ అందంగా ఉండేవారు. ముట్టుకుంటే మాసిపోతాడేమో అన్నంత అందంగా ఉండేవారు ఆ రోజుల్లో. ఎత్తుగా, తెల్లగా ఉండేవారు. మాంచి గిరజాలజుట్టు ఉండేది. అందులోనూ చిక్కగా ఉండేది. అప్పట్లో కాలేజీకి వెళ్లేవాళ్లు ఎక్కువగా వైట్ డ్రస్సులు వేసుకునేవారు. నేను, కృష్ణగారు కూడా అంతే. ఆయన తెల్లటి డ్రస్సుల్లో వస్తుంటే చూడ్డానికి రెండుకళ్ళూ చాలేవి కావు. మా కాలేజీకో ఎడ్యుకేషనే కానీ, మా సెక్షన్‌లో ఆడపిల్లలే లేరు. అందువల్ల ఆడపిల్లలతో మాకు పెద్దగా టచ్ ఉండేది కాదు. కాకపోతే వెళ్తూ, వస్తూ మిగిలిన క్లాసుల్లోని అమ్మాయిలను చూసేవాళ్లం. మా పక్కక్లాసులో ఒకమ్మాయి ఉండేది. నూర్జహానో ఏదో పేరు. చూడ్డానికి చాలా బావుండేది. చక్కటి పర్సనాలిటీ, తీరైన కనుముక్కు ఉండటంతో ఎలాంటివారికైనా చూడగానే నచ్చేది. ఆ అమ్మాయిని చూసుకుంటూ, చూసుకుం...టూ వెళ్లేవాళ్లం. ఆ అమ్మాయి మమ్మల్ని గమనించి ఏమాత్రం కళ్లు పైకి ఎత్తుతోంది అనిపించినా, వెంటనే కళ్ళు దించేసుకుని అక్కడినుంచి గబగబా వెళ్లిపోయేవాళ్లం. ఎందుకంటే ఏమాత్రం ఆ అమ్మాయిచూపుతో చూపు కలిపినా దొరికిపోతాం కదా. అలా దొరకడం మాకు ఇష్టంలేదు. అందుకని చూడ్డం కూడా చాలా జాగ్రత్తగా చూసేవాళ్లమన్న మాట. అంటే ఒక మూగ ఆరాధన అంటారే, అది జరిగేది. అలా ఓవైపు చదువు, ఇంకోవైపు పిచ్చాపాటీ.

### ఇద్దరం డింకీకొట్టాం!

కృష్ణగారు, నేను అలా రెండేళ్లు చాలా బాగా ఫ్రెండ్లీగా ఉండేవాళ్లం. కృష్ణగారు కొన్నాళ్లు హాస్టల్లో ఉన్నారు, కొన్నాళ్లు ఏలూరులో ఒక రూమ్ తీసుకుని అందులో ఉండేవారు. నేను కూడా సరదాగా ఆయన రూమ్‌లో ఉండేవాడిని. ఆయనకూడా అప్పుడప్పుడూ మాతోపాటు మా ఊరు వచ్చేవారు. ఇక్కడ అసలు విషయం చెప్పాలి మీకు. ఫస్ట్ బెంచ్ స్టూడెంట్స్ ఇద్దరం డింకీ కొట్టాం. అంటే ఇద్దరం ఫెయిల్ అయ్యాం.

ఎందుకంటే నా దృష్టి చదువుకన్నా, వ్యాపారం మీద ఎక్కువగా ఉండేది. అప్పటికే నాకు వ్యాపారం రుచి బాగా తెలుసు. సమ్మర్ హాలిడేస్‌లో నేను ఎప్పుడూ మాఇంట్లో ఉండేవాణ్ణికాదు. మా నాన్నగారితో ఆదిలాబాద్‌కి వెళ్లేవాడిని. మనకు స్వాతంత్ర్యం వచ్చిన కొన్నాళ్లకు మా నాన్నగారు ఆదిలాబాద్‌లో ఫారెస్ట్ కాంట్రాక్ట్‌లు చేయడం మొదలుపెట్టారు. అంటే ఆదిలాబాద్ అడవుల్లోకివెళ్లి చెట్లునరికి బళ్ల మీద ఎక్కించి పంపేవాళ్లన్నమాట. ఆ పనికోసం అడవుల్లోనే కొన్నాళ్లు ఉండాల్సివచ్చేది. నేను కూడా వేసవి సెలవుల్లో నాన్నగారితో కలిసి అడవులకు వెళ్లేవాడిని. అప్పట్లో నన్నుచూసి 'ఇంత చిన్నకుర్రాడిని తీసుకొచ్చి అడవుల్లో పెడుతున్నావు, ఏంటయ్యా ఇది' అని అక్కడివారు మా నాన్నగారిని అడిగేవారు.

'వాడికి ఇంట్రస్ట్ అండీ. నేనేం చేయనండీ' అని చెప్పేవారు నాన్నగారు.

నచ్చచెప్పాలండీ అని కొంతమంది అనేవారు.

'వద్దన్నా ఉండట్లేదు వాడు' అని సమాధానమిచ్చేవారు నాన్నగారు.

మంచి చెట్లు చూసి ఎంపిక చేయడం, వాటిని కొట్టించడం, వాటికి కొలతలు వేసి బళ్లకు ఎక్కించడం, ఆ బళ్లను స్టేషన్లకు పంపడం, ఎన్ని బళ్లు వెళ్లాయో లెక్కలు రాయడం... ఈ పనులన్నీ నావే.

### అడవిలో పులి ఎదురైంది!

ఏమాటకి ఆ మాటే చెప్పుకోవాలండీ.. అడవుల్లో చేసే పనిలో చాలా థ్రిల్ ఉండేది. కొన్నిసార్లు మా నాన్నగారితో కలిసి చేసే ప్రయాణాలు చాలా సరదాగా ఉండేవి. ఆ రోజుల్లో ప్రయాణం అంటే రెండెడ్ల

# స్వర్ణామృత ప్రాశనతో ఆటిజం పిల్లలకో స్వర్ణయుగమే


డాక్టర్ ఎన్. రామకృష్ణారెడ్డి
ఆర్.కె ఆయుర్వేదిక్ అండ్ సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్
క్లినిక్స్ : హైదరాబాద్, విజయవాడ, తిరుపతి, వైజాగ్, హన్మకొండ, కర్నూలు.
ఫోన్స్ : 8886922247, 8886922250




ఎవరితోనూ ఏమీ చెప్పకూడదని మౌనంగా ఉండిపోవడం వేరు. కానీ, ఎంతో చెప్పాలని లోలోపల ఎంత ఉన్నా, చెప్పాలనుకున్నవన్నీ గుండెలో సుడి తిరుగుతున్నా, మాటే పెగలకపోతే ఏంచేయాలి? ఆటిజం పిల్లల పరిస్థితే ఇది. కాకపోతే ఇక్కడ సమస్య ఏమిటంటే, మాటలు పెగలకపోవడమే కాదు. మనసుకూడా పురివిప్పినట్టు ఏమీ ఉండదు. ఎదుటి వారి ఏ మాటలను పట్టించుకోవడమూ ఉండదు. స్పందించడమూ ఉండదు. ఆటిజం పిల్లల్లో మనసుకు ఏదీ పట్టదు. వయసు పెరుగుతూనే ఉంటుంది. కానీ, మనసు మాత్రం ఉన్న చోటే ఉంటుంది.

**ఎందుకలా?**

శారీరక ఎదుగుదలతో సమానంగా, మానసిక ఎదుగుదల లేకపోవడమే ఆటిజం ప్రధాన సమస్య. తాము చేయాల్సిన పనేమిటో, చేయకూడనిదేమిటో తెలియని ఒక నిస్సహాయత ఆటిజం బాలబాలికల్ని పీడిస్తుంది. ఆటిజం పిల్లలకు రెండేళ్ల వయసొచ్చినా స్పందనలేమీ ఉండవు. ఇతరుల విషయం అలా ఉంచి ఆ వయసులోనూ తల్లిదండ్రుల్నే గుర్తించలేరు. వీరికి వయసుతో పాటు రావల్సిన జ్ఞానమేదీ రాదు. విషయాల్ని గుర్తించే శక్తి ఉండదు. దీన్నే డిలేడ్ మైల్‌స్టోన్స్ అంటారు. చివరికి పాకడం నడవడం కూడా బాగా ఆలస్యమే అవుతుంది. వీళ్లకు ఎవరితోనూ కలవకుండా ఒంటరిగా ఉండడాన్ని ఇష్టపడతారు. ఆటిజంలోనే కొంతమంది పిల్లల్లో అతిగా ప్రవర్తించే హైపర్ యాక్టివ్ లక్షణాలు కనిపిస్తాయి. కొంత మంది పిల్లలు దాదాపు మౌనంగానే ఉండిపోతే, మరికొంత మంది పిల్లలేమో విపరీతంగా అల్లరి చేస్తుంటారు. అయితే వారి చేష్టలతో ప్రాణప్రదంగా చూసుకునే కన్నవారికి, తోబుట్టువులకు కూడా విసుగు పుట్టిస్తారు. బాధ కలిగిస్తారు. కాకపోతే ఇదంతా కావాలని కాదు. వారి మానసిక స్థితే అందుకు కారణం. అయితే ఈ సమస్య పరిష్కారం లేనిదేమీ కాదు. నిజానికి 5 వేల సంవత్సరాల క్రితమే ఆయుర్వేదం ఈ వ్యాధికి ఔషధాల్ని తయారు చేసింది. ఆ ఔషధ తయారీలో మరిన్ని పరిశోధనాల ఫలితాల్ని జోడించి ఇదుగో ఇప్పుడు స్వర్ణామృత ప్రాశనగా అందుబాటులోకి తేవడం జరిగింది. ఆటిజం వ్యాధిగ్రస్తుల పాలిట నిజంగా ఇదెంతో శుభపరిణామం. కాకపోతే వ్యాధి ఉన్నట్లు తెలిసిన తర్వాత కూడా ఇంకా జాప్యం చేయకుండా వెంటనే ఆయుర్వేద చికిత్సలు తీసుకోవాలి.

**స్వర్ణామృత ప్రాశన వల్ల జరిగేదేమిటి?**

ఆటిజంలోని ప్రధాన సమస్య మెదడుకు శరీరానికి మధ్య సంబంధం తెగిపోవడం. అలా తెగిపోవడానికి మెదడు తన సహజమైన పటుత్వాన్ని కోల్పోవడమే కారణం. ఈ స్థితిలో స్వర్ణామృత ప్రాశన మెదడుకు శక్తిని ప్రసాదిస్తుంది. మొత్తం నాడీ వ్యవస్థను, మెదడులోని స్పీచ్ సెంటర్లను చైతన్యపరుస్తూ బాడీకి కనెక్ట్ అయ్యేలా చేస్తుంది. అందుకే స్వర్ణామృత ప్రాశన వాడటం మొదలెట్టిన తర్వాత మెలమెల్లగా మాటలు రావడాన్ని గమనించవచ్చు. నిదానంగా వస్తువుల మీద, మనుషుల మీద అటెన్షన్ కూడా మొదలవుతుంది. తన చుట్టూ ఉండే ఆ నలుగురితోనూ కలిసిపోవడాన్ని మనం గమనించవచ్చు. ఎవరైనా పిలిస్తే పలకడం, ఏదైనా పని చెబితే చేయడం గమనించవచ్చు. ప్రతి సందర్భంలోనూ స్పష్టంగా మాట్లాడలేకపోయినా తొలుత సంజ్ఞల రూపంలోనైనా తన మనోభావాల్ని వ్యక్తం చేయడం మొదలవుతుంది. ఒక్కొక్క మెట్టే దిగినట్లు అప్పటిదాకా ఉంటూ వచ్చిన హైపర్ యాక్టివ్ తత్వం, తగ్గుముఖం పడుతుంది. ఆ మొండితనం తగ్గిపోయి, బెరుకుతనం వదిలేసి, ఎదుటి వాళ్ల కళ్లలోకి సూటిగా, ఆత్మీయ దృష్టితో చూసే స్థితికి చేరుకుంటారు.

# వ్యర్థాలు తొలగనిదే మోకాళ్లనొప్పులు తగ్గవు


డాక్టర్ టి. ఎల్. శ్రీనివాసరావు
సహజ ఆయుర్వేదిక్ హాస్పిటల్ అండ్ రీసెర్చ్ సెంటర్
హైదరాబాద్: మలక్‌పేట్ ,విజయనగర్‌కాలనీ
బ్రాంచీలు : హన్మకొండ, రాజమండ్రి విజయవాడ అనంతపూర్, జోగిపేట్, తిరుపతి, నెల్లూరు
ఫోన్స్ : 9160994455, 9160994456




మోకాళ్ల నొప్పులతో బాధపడేవాళ్లు ఉన్నంత పెద్ద సంఖ్యలో మోచేతుల నొప్పులతో బాధపడే వాళ్లు ఉండరు ఎందుకని? ఎందుకంటే మనం చేసే చాలా పనుల్లో మోచేతి నుంచి అరచే తి దాకా పలుమార్లు మడుస్తూనే ఉంటాం. నిలువుగా అడ్డంగా, పైకీ, కిందికి తిప్పుతూనే ఉంటాం. మోకాళ్ల విషయంలో అలా కాదు. కుర్చీలో కూర్చోవడం లేదా లేచి నిలబడటం ఇంతకు మించి మోకాలి కీళ్లకు మనం చెప్పే పనేమీ ఉండదు. వాస్తవానికి మనం ఎంత మంచి ఆహారం తీసుకున్నా, కీళ్ల మధ్య రాపిడి పడినప్పుడే అవి ఆహారంలోని పోషకాల్ని గ్ర హించగలుగుతాయి. అలా కాకుండా ఎప్పుడూ నిటారుగా ఉంచేస్తే పోషకాలేవీ కీళ్లకు, కార్టిలేజ్‌కూ అందక అవి అశక్తంగా, నిర్జీవంగా మారిపోతాయి. ఇదే కీళ్ల నొప్పులకు కీళ్లు అరగడానికీ కారణమవుతాయి. కీళ్ల నొప్పులు మొదలవుతాయి. అయితే వాతం పెరిగితే కీళ్లనొప్పులు వచ్చినట్టే, కీళ్ల నొప్పుల వల్ల వాతం పెరుగుతుంది. అందుకే కీళ్లల్లో చలన శక్తి పెరగడానికి వాత హర చికిత్సలు చేయాల్సి ఉంటుంది. వాతాన్ని తొలగించకుండా ఎవరెన్ని చికిత్సలు చేసినా కీళ్లనొప్పులు, మోకాళ్లనొప్పులు ఎప్పటికీ తగ్గవు. ఆయుర్వేదం ఇచ్చే ఈ అవగాహన మరే వైద్య శాస్త్రమూ ఇవ్వడం లేదు. అందుకే ఆయుర్వేదంతో తగ్గిపోయే మోకాళ్లనొప్పులు ఇతర వైద్య విధానాల్లో తగ్గడం లేదు.

**వాతం ప్రకోపిస్తే.....**

సమస్త కదలికలకు అవసరమైన వాతం సహజంగానే అందరి శరీరాల్లోనూ ఉంటుంది. అయితే ఈ వాతం ప్రకోపితమైనప్పుడు అంటే సమస్థితిని కోల్పోయినప్పుడు సంధివాతం (ఆస్టియో ఆర్థరైటిస్) మొదలవుతుంది. దీన్నే వాతం దూషితం కావడం అంటారు. సహజంగా వాతం కఫాన్ని దూషితం చేసినప్పుడే సంధివాతం మొదలవుతుంది. ఈ సమయంలో దూషిత లక్షణాలు కనిపిస్తాయి. ఈ లక్షణాల్లో ప్రధానంగా కీళ్లు బిగుసుకుపోవడం, కదిలినప్పుడు శబ్దాలు రావడం, ముట్టుకున్నప్పుడు ఆ భాగం వేడిగా అనిపించ డం, ఎరుపుదనం కలిగి ఉండడం, నిలబడే, కూర్చునే వేళల్లో నొప్పి అనిపించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. కొంత మందిలో చాలా సేపు కూర్చున్న తర్వాత గానీ, పడుకుని లేచినప్పుడు గానీ, వెంటనే లేచి నడవలేని పరిస్థితి ఏర్పడుతుంది. అయితే కాసేపు నడిచాక బిగుసుకుపోయిన భాగాలు సడలి, నడకలో కొంత సౌకర్యం ఏర్పడుతుంది. సంధివాతంలో ఇది ఒక ముఖ్య లక్షణంగా ఉంటుంది.

**ఆయుర్వేద చికిత్స**

ఈ రోజుల్లో సరియైన వేళలో, సరియైన రీతిలో భోజనం చేసే వ్యవధి కూడా చాలా మందికి ఉండడం లేదు. ఎప్పుడు టైం దొరికితే అప్పుడు, ఏది బడితే అది గబగబా తినేయడం పరిపాటైపోయింది. ఆ తింటున్న సమయంలోనే ఎక్కడి నుంచైనా ఫోన్ వస్తే తినే వేగాన్ని రెట్టింపు చేయడమో లేదా మధ్యలో వదిలేసి వెళ్లిపోవడం చేస్తుంటారు. చాలీ చాలని తిండి వల్ల మళ్లీ గంటా రెండు గంటలకే ఆకలి వేయడం మళ్లీ ఏదో తినేయడం చేస్తుంటారు. దీనివల్ల భోజనానికీ భోజనానికీ మధ్య అవసరమైనంత వ్యవధి లేక ఆహారం సగమే జీర్ణమవుతాయి. దీనివల్ల ఆహారంలోని ఉపయుక్త అంశాలు, వ్యర్థపదార్థాలు విడిపోవు. పైగా ఈ రెండూ కలగలసిపోయి శరీరాన్ని విషతుల్యం చేస్తాయి. దీనిపరిణామంగా శరీరంలోని ధాతువులన్నీ దెబ్బతినిపోతాయి. కీళ్లు దెబ్బతినడం కూడా అందులో భాగమే. అందుకే ఔషదాలతో పాటు శరీరంలోని వ్యర్థ, విషపదార్థాలను తొలగించడానికిఆయుర్వేదం ప్రాధాన్యతనిస్తుంది. ఇదే మోకాళ్ల నొప్పులు సంపూర్ణంగా, శాశ్వతంగా నయం కావడానికి మూల కారణమవుతోంది.

బళ్ళమీదే. వాటిని తెలంగాణలో కచ్చడం అనేవారు. సుదూర ప్రయాణాలకు కచ్చడంతప్ప ఇంకేదీ ఉండేది కాదు. ఆదిలాబాద్ అడవికి, మేము ఉండే టౌన్‌కి 25 మైళ్ల దూరం. ఆ 25 మైళ్ల ప్రయాణం ఎలా ఉండేదంటే, ఈ రోజు ఉదయం బయలు దేరితే, రేపు సాయంత్రమో ఎప్పుడో చేరేవాళ్లం బళ్ళల్లో. అలా ఒకరోజు నేను, నాన్నగారు కలిసి బయలుదేరాం. ఒక పెద్దపులి ఎదురు వచ్చింది. అలా పులిని లైవ్‌లో చూడ్డం అదే తొలిసారి. అంతకు ముందు ఒకసారి సర్కస్‌లో చూసిన గుర్తు ఉంది కానీ, ఎదురుగా అంతవరకు చూళ్లేదు.

ఎదురుగా పులి అనగానే ఒకరకమైన ఉత్కంఠ. చాలా కొత్తగా అనిపించింది ఆ వాతావరణం. నేను భయపడతానని అనుకున్నారేమో 'దానివంకే చూడు' అన్నారు నాన్నగారు. దానివైపే చూస్తూ ఉన్నా. మావి ఆ పూట 10, 15 బళ్లు ఉన్నాయి. బళ్లవాళ్లు అందరూకలిసి ఒకచోటుకి చేరి కేకలుపెట్టడం మొదలు పెట్టారు. పెద్దపులి కాసేపు కూర్చుంది, మమ్మల్నే చూసింది, చూసింది.. చూసింది.. వెళ్లిపోయింది. అలా అందరూకలిసి ఎందుకు అరుపులు మొదలు పెట్టారో నాకు అర్థం కాలేదు.

'అలా ఎందుకు చేస్తున్నారు నాన్నగారూ' అని అడిగా. 'ఎప్పుడైనాసరే పెద్దపులి కనిపిస్తే దాన్ని చూసి మనం పారిపోకూడదు. పారిపోయినట్ట యితే అది వెంటాడిమరీ, మీదపడి చంపేస్తుంది. అలా కాకుండా మనం దానివైపే కళ్ళల్లోకి చూస్తూ ఉంటే ఏమీ చేయదు. దాన్నిచూస్తే మనకి ఎంత భయం ఉంటుందో, దానికికూడా మనల్నిచూస్తే అంత భయం ఉంటుంది. అందుకే ఎప్పుడైనాసరే మనం దాన్నిచూస్తూ కేకలు పెట్టాలి. అలా పెడితే మెల్లిగా తప్పుకుని వెళ్లిపోతుంది' అని చెప్పారు నాన్నగారు. మేం ఎప్పుడు ఫారెస్ట్‌కి బయలు దేరినా, మా వెంట ఓ గార్డ్ ఉండేవాడు. అతను కోయవాడన్నమాట. ఎప్పుడూ అతని భుజంమీద ఓ గొడ్డలి ఉండేది. నున్నగా ఉంటుంది ఆ గొడ్డలి. ఆ గొడ్డలి భుజానవేసుకుని మా ముందు నడిచే వాడు. అప్పటికే ఓ సారి ఎవరికో పెద్దపులి ఎదు రొస్తే గొడ్డలితో తలమీద ఓ వేటువేసి చంపేశాడట అతను. అతను పులినిచూసి ఎప్పుడూ భయపడడట. అందువల్ల అతన్ని మాకు సెక్యూరిటీగా పెట్టుకున్నాం. అంటే బాడీగార్డ్ అన్నమాట. ఈ విషయాలన్నీ మా నాన్నగారు ఓ రోజు ప్రయాణంలో చెప్పారు.

### జల్లు జల్లుమని...!

అప్పట్లో వర్షాకాలం అంటే వర్షాకాలమే. ఫలానా కార్తి రాగానే.. ఆ కార్తినాడు మబ్బులు పట్టేసి వర్షం పడేది. వర్ష ఋతువు చాలా సిస్టమేటిగ్గా ఉండేది ఆ రోజుల్లో. ఇప్పుడేమైపోయిందంటే, చెట్లన్నీ కొట్టేయడం వల్లగానీ, పొల్యూషన్ వల్లగానీ ఋతువులేవీ సక్ర మంగా ఉండటంలేదు. నిజానికి కార్తి రాగానే వర్షా కాలం మొదలుకావాలి. కానీ ఇప్పుడు సకాలంలో వర్షాలు ఎక్కడ పడుతున్నాయి? శీతాకాలంలో మంచు ఉండేది. ఇప్పుడైతే అతివృష్టి, లేకుంటే అనా వృష్టి అన్నమాట. "ఆయా తిథుల ప్రకారం ఋతు



**మురళీమోహన్ అందగాడు. కృష్ణగారు ముట్టుకుంటే మాసిపోతాడేమో అన్నంత అందగాడు. వాళ్ళిద్దరూ కాలేజీలో మంచి స్నేహితులు. ఇద్దరూ ఫ్రంట్ బెంచ్‌లో కూర్చునే వారు. కృష్ణగారి రూంకి ఈయన వెళ్ళడం, ఈయన ఇంటికి కృష్ణగారు వెళ్తూ ఉండటం....అలా ఉండేది వాళ్ళస్నేహం. కో ఎడ్యుకేషన్ అయినాగానీ, వాళ్ళక్లాసులో ఒక్క అమ్మాయికూడా ఉండేదికాదు, కానీ వాళ్ళ పక్కక్లాసులో మాత్రం ఒక అమ్మాయి ఉండేది. వీళ్లు....**

వులు సక్రమంగా నడిచేవి" అని చెబితే ఈ తరం వాళ్ళు 'వాట్' అని ఆశ్చర్యపోతారేమో. భవిష్యత్తు తరాలు మరెలా ఉంటాయో మరి..!

నాన్నగారు కాంట్రాక్ట్ చేసే రోజుల్లో, వర్షా కాలం వస్తే వ్యాపారానికి సెలవులు ఇచ్చేసేవారు. ఎందుకంటే బండ్లు అడవుల్లోకి రాకపోకలు సాగిం చడం చాలా ఇబ్బందిగా ఉండేది. కానీ వర్షంకురిసే అందాన్ని ఆస్వాదించాలంటే అడవుల్లోనే ఆస్వా దించాలి. వర్షాకాలం మొదలుకాగానే అడవుల్లో ఎలా ఉంటుందో నేను ప్రత్యక్షంగా చూశాను. అనుభ వించాను. ఇప్పటికికూడా నేను అసలు ఆ దృశ్యాలు మరచిపోలేను. అప్పటిదాకా కాచిన ఎండకు ఆకు లన్నీ గలగలమంటూ ఉంటాయి. ఒక్కసారిగా చినుకులు రాలేసరికి, ఎగిరే ఆకులు మెత్తగా నేల మీదకు చేరేవి. పక్షులు, నెమళ్లు, హుషారుతో అరుస్తూ ఉండేవి. ఆ ధ్వనులన్నీ వింటుంటే చాలా చాలా ఆనందంగా అనిపించేది. వేడిగా ఉన్న నేల మీదపడ్డనీళ్ళతో ఒక విధమైన మట్టివాసన వచ్చేది. ఆ మట్టివాసన అద్భుతంగా ఉండేది. చుట్టూతా మబ్బులు, వర్షాలు, చల్లటిగాలి...అప్పటిదాకా వేడిగా ఉన్న వాతావరణం ఒక్కసారి మారిపోవడం.. అవన్నీ మాటలకు అందని అనుభూతులు.

### తొలి ప్రస్తావన చేసింది బావగారి ఫ్రెండే

వర్షాకాలంలో మా మకాం అడవులనుంచి సిర్పూర్‌కాగజ్‌నగర్‌కి మార్చేసేవాళ్లం. మా బావ గారు తులసీదాసుగారు (మా అక్క భర్త) అక్కడ ఉద్యోగం చేసేవారు. ఆయనకు ఒక మలయాళీ స్నేహితుడు ఉండేవారు. ఆయన నన్ను చూసినప్పుడల్లా అలాగే చూస్తూ ఉండేవారు. ఎందుకు చూస్తు న్నాడో తెలియదు. పోనీ అలాచూసి నవ్వి కళ్ళు తిప్పు కుంటాడా? అంటే తిప్పుకునేవాడు కాదు. చూపులు మరల్చకుండా చూసేవాడు. నాకేమో పరమ సిగ్గని పించేది. ఒకరోజు ధైర్యంచేసి "ఏంటి సార్, అలా చూస్తున్నారు" అని అడిగా. ఆయన నాతో మాట్లాడ కుండా మా బావగారిని ఉద్దేశించి "తులసీదాసూ! రాజబాబును ఎందుకయ్యా ఇక్కడ ఉంచుతున్నావు నువ్వు, సినిమాల్లోకి పంపాలయ్యా, ఎంత అందంగా ఉన్నాడయ్యా' అన్నాడు. అసలు అప్పటిదాకా నన్ను, సినిమాలను కలిపి మాట్లాడిన వ్యక్తి లేడు. తొలిసారి నేను సినిమాల్లోకి పనికొస్తాను అని ఆయన అన్నప్పుడు భలే సంతోషం కలిగింది. ఇక అప్పటి నుంచి నేను ఎప్పుడు కనిపించినా ఆయన నన్ను పిలిచి 'ఏంటి పెదాలకు రంగువేసుకుని వచ్చారా ఇవాళ' అనేవారు. అంటే అంత ఎర్రగా ఉండేవి నా పెదవులు. కళ్ళు చూసి 'కళ్ళకు కాటుక పెట్టుకుని వచ్చావా' అని అడిగేవారు. "లేదండీ. మగాళ్లు కాటుక ఎందుకు పెట్టుకుంటారండీ చెండాలంగా.." అని చెప్పేవాణ్ణి. పక్కన మాబావ ఉంటే చాలు, 'నా మాట విని సినిమాల్లోకి పంపించవయ్యా.. సినిమా ల్లోకి పంపించవయ్యా' అని అంటూనే ఉండేవారు. అప్పుడు నాకు 17, 18 ఏళ్ళు ఉన్నాయన్నమాట.

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

# వెరికోస్ వెయిన్స్‌కు దీటైన చికిత్స

ఇది సిరలకు సంబంధించిన రక్తనాళాలకు వచ్చే వ్యాధి. లావైన, ఉబ్బిన సిరలనే వారికోస్ వీన్స్ అంటారు. చెడు రక్తం తీసుకెళ్లే రక్త నాళాలు ఉబ్బి ఉంటాయి.

**కారణం**

రక్తనాళాల లోపల కవాటంలో గల ఇబ్బందులు, రక్తం మళ్లీ వెనకకు రావడం వల్ల సంభవించును.

**లక్షణాలు**

1) కాళ్ల పిక్కల భాగంలో నొప్పి, ఎక్కువ శాతం రాత్రివేళ వచ్చే నొప్పి.
2) కాలిభాగంలో ఆకుపచ్చ, నీలిరంగులో పైకి కనిపించే రక్తనాళాలు.
3) కాళ్ల వాపు, నలుపుదనం.
4) చర్మం రంగు మారడం.
5) దురద, ఎరుపు రక్తప్రసారం సరిగ్గా లేనందున.
6) చర్మవ్యాధులు, ఎగ్జిమా, డెర్మటైటిస్
7) పిక్కలు పట్టినట్టుండటం, నిలబడినపుడు క్రాంప్స్ రావడం.
8) పాదం, యాంకిల్ భాగంలో వాపు.
9) తెలుపు, నలుపు చారలు రావచ్చు.

**వ్యాధి రకాలు**

వ్యాధి తీవ్రతను బట్టి ఆరు దశలుగా విభజించారు. వెరికోస్ వెయిన్స్ బినైన్ రకానికి చెందినది. ఈ వ్యాధి తీవ్రస్థాయిలో దుష్ప్రభావాలు కలిగిస్తాయి. ప్రాథమిక దశలో ఎలాంటి లక్షణాలు కనిపించవు. కంటికి కనిపించని, చేతికి అందని సిరలుంటాయి. సీ1లో చెట్టు వేర్లలాగా వ్యాపించిన సిరలు ఏర్పడతాయి. సీ2లో ఉబ్బి ఉన్న సిరలుంటాయి. సీ3లో సిరలు వాచిపోయి ఉంటాయి. సీ4ఎలో చర్మవ్యాధులు వస్తుంటాయి. చర్మం రంగు మారి దురద వస్తుంటుంది. సీ4బిలో చర్మం దళసరిగా అయి నల్లబడుతుంది. సీ5లో పుండ్లు ఏర్పడతాయి. సీ6లో చర్మంలో మార్పులు జరిగి పుండ్లు ఏర్పడతాయి.


డాక్టర్ గోరంట్ల చంద్రశేఖరరావు
ఎం.డి, పీహెచ్‌డీ (హోమియో)
డి.ఎస్‌సి. హోమియో (అమెరికా)
మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 1000, 77 3000 2000




**విపరీత పరిణామాలు**

చాలా రోజులు చికిత్స తీసుకోకుండా ఉన్నప్పుడు సంభవించును.

1) నొప్పి, వాపు ఉంటుంది.ఎక్కువసేపు నిలుచుంటే కాళ్లు వాచిపోతాయి.
2) చర్మంలోవాపు, దురదలు, ఎగ్జిమా.
3) కాలిభాగంలో అల్సర్లు, మానని పుండ్లు, గాయాలు.
4) కొన్నికేసులలో చర్మసంబంధ క్యాన్సర్‌కు దారితీయవచ్చు.
5) ఎక్కువ రక్తస్రావం ఏదైనా గాయమైతే పెద్ద వయస్సువారిలో.
6) రక్తనాళంలో గడ్డకట్టుట
7) ఎక్యూట్ ఫ్యాట్ నెక్రోసిస్. కాలిభాగంలో కొవ్వు కొంత బాగం నెక్రోసిస్ అగును. ఇది స్త్రీలలో, ఎక్కువ బరువు ఉన్న వారిలో జరుగుతుంది.

**ఎవరిలో రావచ్చు?**

వంశపారంపర్యంగా, అధిక బరువు ఉన్న వారిలో, ఎక్కువ సమయం నిలబడి ఉండేవారిలో, మలబద్దకం సమస్య ఉన్న వారిలో, గర్భం దాల్చినపుడు ఎక్కువ వచ్చే అవకాశం ఉంటుంది.

**ఏం చేయాలి**

నడవడం అలవాటు చేసుకోవాలి. కాళ్లకు సాక్స్ ధరించడం, కాళ్లు ఎత్తులో పెట్టి పడుకోవడం, బరువు తగ్గడం వంటివి చేయాలి.

**హోమియో చికిత్స**

తత్వ చికిత్స ద్వారా హోమియో మందులతో వెరికోస్ వెయిన్స్‌కు ఉత్తమ ఫలితాలుంటాయి. ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్‌లుండవు. వ్యాధి తీవ్రతను బట్టి చికిత్సా కాలం, ఫలితాలుంటాయి.

# హెర్పిస్, హెచ్ఐవిలకు హోమియో చికిత్స

హెర్పిస్ రెండు రకాలు
1) హెచ్ఎస్‌వి 1, 2) హెచ్ఎస్‌వి 2

**వ్యాప్తి :**

**హెచ్ఎస్‌వి 1 :** నోటి ద్వారా వ్యాపించే వైరస్. ముద్దుల ద్వారా, లాలాజలం ద్వారా పొక్కుల మాదిరి ఉండి వ్యాపించును. జననాంగాల వైపు కూడా వ్యాప్తి.

**హెచ్ఎస్‌వి 2 :** సుఖవ్యాధి, కలయిక ద్వారా వ్యాప్తి.

హెచ్ఎస్‌వి 1, హెచ్ఎస్‌వి 2 జీవితాంతం బాధించే సుఖవ్యాధులు.

1) ఓరల్, జెనిటల్ హెర్పిస్ ఎలాంటి లక్షణాలు లేకుండా కొన్ని సంవత్సరాల వరకు లోపల వ్యాప్తి చెందును.
2) హెర్పిస్ వ్యాధి అంటువ్యాధి.

హెచ్ఎస్‌వి 2 ఉన్న వారిలో హెచ్ఐవి ఇన్‌ఫెక్షన్లు తొందరగా సోకవచ్చు.

**లక్షణాలు :** నోటిలో పొక్కులు, అల్సర్లు, దురద, పొడిచినట్లుగా, పారినట్టుగా నొప్పి, జననాంగాల భాగంలో, ఆసనం, నోరు భాగంలో పొక్కులు.

**ఇతర ప్రమాదం :** రోగనిరోధక శక్తి తగ్గుట వల్ల, ఇతర ఇన్‌ఫెక్షన్స్ రావచ్చు. కంటిలో దురద, పొక్కులు, వాపు, కెరటైటిస్, ఇన్‌ఫెక్షన్ మెదడుకు సోకవచ్చు. తల్లి గర్భం నుంచి బిడ్డకు రావచ్చు.

**మానసిక సమస్యలు :** మళ్లీ మళ్లీ బాధించే పొక్కులు, అల్సర్లు, ఇతరులకు చెప్పుకోలేరు. సరియైన దాంపత్య సుఖం ఉండదు. జీవితాంతం తప్పు చేసి శిక్ష అనుభవిస్తున్నాం అనే బాధ, డిప్రెషన్, ఆత్మహత్యా ప్రయత్నాలు, ఆలోచనలు వస్తాయి.

**చికిత్స :** యాంటీ వైరల్ డ్రగ్స్ సంవత్సరాల తరబడి నిపుణులైన వైద్యుల సలహాపై వాడినా కూడా సంపూర్ణ నివారణ లభించదు. తగ్గినట్టే తగ్గి వ్యాధి మళ్లీ విజృంభిస్తుంది.

**హోమియో చికిత్స :** హోమియోట్రెండ్స్‌లో అత్యంత నిపుణులైన, అనుభవజ్ఞులైన, రీసెర్చి అనుభవం, ప్రజ్ఞ కలిగిన సీనియర్ వైద్యుల పర్యవేక్షణలో


డాక్టర్ టి.ప్రభాకర్, MD హోమియో
MS సైకాలజీ & కౌన్సెలింగ్,
పీజీ డిప్లొమా ఇన్ సెక్సాలజీ
బెస్ట్ డాక్టర్ 2016, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 3000 , 77 3000 4000




చికిత్స అందించడం జరుగుతుంది. కొన్నినెలల్లోనే లక్షణాలు తగ్గి ఆరోగ్యం, మానసిక ప్రశాంతత లభిస్తాయి. వ్యాధి తీవ్రతను బట్టి చికిత్సా కాలం ఉంటుంది. వ్యక్తిని బట్టి ఫలితాలు మారవచ్చు.

**ముందు జాగ్రత్తలు :** వ్యాధి ఉన్న వారు ఓరల్ సెక్స్‌కు దూరంగా ఉండాలి. కండోమ్స్, రక్షిత సెక్స్ మాత్రమే అవలంబించాలి. నోటిలో పొక్కులు ఉన్న వారు ఆహారపదార్థాలను ఎంగిలిని ఇతరులకు ఇవ్వరాదు.

**హెచ్ఐవి**

రోగనిరోధక శక్తి తగ్గుట వల్ల వచ్చే సుఖవ్యాధి.

**లక్షణాలు**

1) స్వల్ప ఆరోగ్యక్షీణత : 80 శాతం మందిలో ఫ్లూ జ్వరంలాంటిది రావచ్చు. జ్వరం, ఒళ్లునొప్పులు, 2, 4 వారాలలోపు దద్దుర్లు, గొంతునొప్పి.

**కొందరిలో :** నీరసం, గ్రంథుల వాపు, నోటిలో పొక్కులు, జననాంగాల పుళ్లు, కండరాల నొప్పులు, కీళ్లనొప్పులు, వాంతులు, రాత్రి చెమటలు.

సీడీ 4 కణాలు ఎక్కువ కాలం వ్యాధికణాలను ఎదిరించలేక వ్యాధి విజృంభించును.

**చికిత్స :** ప్రభుత్వం సకల సదుపాయాలతో వైద్యకేంద్రాలు నడుపుతోంది. అక్కడ మందులు సరఫరా చేయబడతాయి. అయితే హోమియో వైద్యం ద్వారా నూతన రీసెర్చి పద్ధతుల ద్వారా నిరూపించబడిన ఔషధాలు ప్రభుత్వ హోమియో వైద్యశాలలో ఇవ్వబడుచున్నవి. చాలా కేసులలో సత్ఫలితాలు కలుగుచున్నట్లు రిపోర్టులు తెలియచేస్తున్నాయి. నిపుణులైన హోమియో వైద్యుని దగ్గర చికిత్స తీసుకుంటే ఫలితాలు బాగుంటాయి.






# దేవుడింత ఖరీదా?

**కూకట్‌పల్లిలో ఆదివారం సాయంత్రం అరికాలు మోపటానికి కూడా సందు ఉండదు. కారుకి పార్కింగ్ దొరకటం అసంభవం. అలాగనుకొని మ్యాచింగ్ సెంటర్‌కి ఆటోలో వచ్చి అడ్డంగా దొరికి పోయా! బయట సన్నగా జల్లు పడుతోంది. రోడ్డు దాటితే ఆటోలు దొరుకుతాయి. చేతిలో గొడుగు లేదు. జల్లులో తడిసిపోతే! ఓ ఐదు నిమిషాలు వెయిట్ చేశా. వాన తగ్గటం లేదు. యుద్ధంలో శత్రువులపై వేసే బాణాల్లా సర్రున దూసుకొచ్చే కార్లను, బైక్స్‌ను దాటుకొని రోడ్డు అవతలకు చేరా! హఠాత్తుగా వాన పెరిగింది. రోడ్డు మీద నడుస్తున్న వాళ్లందరూ చెల్లాచెదురయిపోయారు. నేను ఫుట్‌పాత్ పక్కనే ఉన్న షెడ్‌లోకి దూరా!**

ఆ షెడ్‌లో మట్టి వినాయకుడి విగ్రహాలు వరసలో పేర్చి ఉన్నాయి. తెల్ల బనీన్ వేసుకున్న ఒక వ్యక్తి వినాయకుడి ముఖానికి నగిషీలు చెక్కుతున్నాడు. అలికిడికి అతను నావైపు తల తిప్పి చూశాడు. అనాసక్తిగా నావైపు ఓ చూపు పారేసి మళ్లీ తన పనిలో మునిగిపోయాడు. బహుశా రోజూ చాలా మంది వచ్చిపోతూ ఉంటారనుకుంటా! ఒక క్షణం గడిచింది. ఆ షెడ్‌లో ఉన్న నిశ్శబ్దాన్ని ఛేదించటానికి "ఈ విగ్రహం ఎంత?" అని అడిగా. "తీన్ హజార్..మూడు వేలు.. కలర్ వేస్తే ఎక్స్‌ట్రా" అని వచ్చీ రాని తెలుగులో చెప్పాడు. 'మన దేశంలో దేవుడి కన్నా సెల్లింగ్ ఐటమ్ ఇంకోటి ఉండదు..' అనుకున్నా. "వినాయక చవితి వస్తోంది కదా.. ఎన్ని విగ్రహాలు చేస్తావు? మీది ఈ ఊరేనా? ఎక్కడి నుంచి వచ్చావు?" అని రకరకాల ప్రశ్నలతో సంభాషణ పొడిగించటానికి చూశా.

## పెద్ద బొమ్మలు చేస్తాం

బహుశా నా ప్రశ్నలు అతనిలో ఆసక్తి రేకెత్తించినట్లున్నాయి. ముఖానికి మెరుగులు దిద్దటం ఆపి కిందకి దిగి వచ్చాడు. "టూ హండ్రెడ్.. త్రీ మంత్స్ వర్క్ మేమ్ సాబ్. సౌత్‌కి వచ్చి గణేష్ ఐడల్ చేస్తాం. పూజ టైమ్‌కి బెంగాల్ వెళ్లిపోతాం.." అన్నాడు. పూజ అంటే దసరాకి చేసే దుర్గ పూజ అని అర్థం చేసుకోవటానికి నాకో క్షణం పట్టింది. బయటకు చూశా. వాన పెరిగింది. "కొద్దిగా లోపలికి రండమ్మా! జల్లు కొడుతోంది.." అన్నాడతను హిందీలో. "నీ కుటుంబం ఎక్కడుంది? మీ ఊరేమిటి? ఇక్కడకి ఎలా వచ్చావు?" అంటూ అప్పటి దాకా నాలో దాక్కున్న ప్రశ్నోత్తరి పైకి లేచింది. "మాది బెంగాల్ మేడమ్. మా కుటుంబం అంతా కాళీమాత బొమ్మలు చేస్తాం. మా చిన్నప్పుడు ఎక్కువ బొమ్మలు అమ్ముడుపోయేవి. ప్లాస్టర్ ఆఫ్ పారిస్ బొమ్మలు మార్కెట్‌లోకి రావటంతో మా బొమ్మలు కొనటం తగ్గించారు. దాంతో హైదరాబాద్ వచ్చాం. లోకల్ వాళ్లు చిన్న బొమ్మలు చేస్తారు. మేము పెద్ద బొమ్మలు చేస్తాం. గణేష్ చతుర్థి టైమ్‌లో మూడ్‌ని బట్టి బొమ్మలు చేస్తాం. క్రికెట్ గణేష్..సోల్జర్ గణేష్..' అని ఆగాడు. "ఈ సారి ఎవరి షేపులో గణేష్ చేస్తున్నారు?" అని అడిగా. "మోదీ.." అని టక్కున సమాధానమిచ్చాడు. లోపల చీకటిలో సగం కనిపిస్తున్న ఒక బొమ్మను చూపించాడు. "కానీ వినాయకుడికి దాడీ ఉండకూడదు కదా.. అందుకే ఎలా చేయాలా అని చూస్తున్నా.." అన్నాడు. వినాయకుడికి గడ్డం ఉండదన్న విషయం ఆ మాట విన్న తర్వాత గుర్తుకొచ్చింది. వినాయకుడికేమిటి... మన పెద్ద దేవుళ్లకెవ్వరికీ గడ్డం ఉండదు.

## సెంటిమెంటును బట్టే...

వర్షం మరింత పెరిగింది. "మూడు నెలలు ఇలా పనిచేస్తారు కదా.. ఎంత మిగులుతుంది?" అని అడిగా. అతను నిర్లిప్తంగా నవ్వాడు. "ఒకప్పుడు అన్నీ ఫ్రీ మేడమ్. మట్టి ఫ్రీ..కర్రలు ఫ్రీ.. గడ్డి ఫ్రీ..వాటర్ ఫ్రీ. ఇప్పుడు అన్నీ కొనాలి. లారీ లోడ్ మట్టి మూడు వేలు. గడ్డి, కర్రలు, టార్పాలిన్ అన్నీ కొనాల్సినవే" అని గొంతు తగ్గించాడు. "ఈ ఏరియా వాడుకున్నందుకు లోకల్ లీడర్‌కు ఆరు వేలు ఇవ్వాలి" అన్నాడు. "ఇది గవర్నమెంట్ ల్యాండ్ కదా! నువ్వెందుకు డబ్బు కట్టాలి?" అని అడిగా. "నేను నాన్‌లోకల్ మేడమ్. త్రీ మంత్స్ ఉండి పోయేవాడిని. నాకెందుకు గలాటా.." అన్నాడు. "మా బొమ్మలు కూడా సెంటిమెంట్‌ని బట్టి ఉంటాయి మేడమ్. గత రెండేళ్లు పర్యావరణం అన్నారు. గ్రీన్ గణేష్ అన్నారు. ఈ సారి ఎందుకో కాంపైన్ తగ్గింది. మళ్లీ ప్లాస్టర్ ఆఫ్ పారిస్ చైనా బొమ్మలు వచ్చేశాయి. అవి వస్తే లోకల్ వాళ్లకే ప్రాబ్లం. పెద్ద విగ్రహాలు మట్టివి కొనాల్సిందే.." అన్నాడు. "దీనికన్నా మంచి లాభం వచ్చే వ్యాపారం చేసుకోవచ్చు కదా.." అని, వాన తగ్గిందా.. లేదా అని చూస్తూ ఒక ఉచిత సలహా పారేశా.

## చాలా తేడా ఉంది

ఆ సలహా అతనిని ఇబ్బంది పెట్టినట్లుంది. "మాకు ఖేతీ ఉంది మేడమ్. వానలు పడితే వ్యవసాయం చేసేవాళ్లం. లేకపోతే బొమ్మలు... అందుకే మాకు అన్నీ ఫ్రీ. ఇప్పుడు వ్యవసాయం లేదు. బొమ్మలు చేస్తున్నాం. అందుకే ఈ వృత్తిలో ఉండిపోయా! ఒకప్పుడు గుడి దగ్గర బొమ్మలు పెడితే అందరూ కొనేవారు. ఇప్పుడు పండగలకు మాత్రమే కొని పెడుతున్నారు. చాలా తేడా వచ్చింది మేడమ్.." అన్నాడు. హఠాత్తుగా ఏదో గుర్తుకొచ్చినట్లు చేతుల్ని గుడ్డతో తుడుచుకొని, గోడకు వేళ్లాడదీసిన చొక్కా నుంచి ఒక కార్డు తీశాడు. "మీ సొసైటీలో గణేష్ బొమ్మ కావాలంటే నా దగ్గరకు పంపండి" అని ఇచ్చాడు. ఆ కార్డును తీసుకొని బయటకు చూశా. వర్షం తగ్గింది. సరిగ్గా అదే సమయానికి ఒక ఆటో వచ్చి షెడ్ ముందు ఆగింది. ఆ ఆటో ఎక్కేశా. "ఒక్కో విగ్రహం నాలు గైదు వేలుంటుందమ్మా! మా బస్తీలో పెడతాం. మీకెంత చెప్పాడు?" అన్నాడు ఆటో డ్రైవర్. హఠాత్తుగా దేవుడింత ఖరీదా! అనిపించింది.

—సీత

email: fbackfm@gmail.com

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## PCOD సమస్యకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మొర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

ప్రస్తుత కాలంలో ఆధునికతతో ముందుకు సాగుతున్న నేపథ్యంలో మానవుని జీవన విధానంలో ఎన్నో మార్పులు ఏర్పడుతున్నాయి. వీటి వలన సరైన ఆహార నియమాలు పాటించకపోవడం, అధిక మానసిక ఒత్తిడికి లోనవడం, వ్యాయామాలు చేయకపోవడం వంటి అంశాల కారణంగా – నేడు ఎక్కువ మంది ఎన్నో రకాల ఆరోగ్య సమస్యలకు గురవుతున్నారు. వీటిలో ఎక్కువ శాతం స్త్రీలను వేధిస్తున్న సమస్యలలో పీ.సీ.ఓ.డి. సమస్య ఒకటి. ఈ PCOD సమస్యను ఎదుర్కొంటున్న మహిళలలో హార్మోన్‌ల అసమతుల్యత ఏర్పడటం జరుగుతుంది. దీని వలన ఋతుచక్ర సమస్యలు కలుగుతాయి. యుక్తవయస్సు వారిలో ఇది తొలుత – మొటిమలను, అవాంఛిత రోమాలను మరియు అధిక బరువును కలుగజేస్తే – వివాహిత మహిళలలో 'సంతానలేమి'కి దారితీస్తుంది. ఈ సమస్యకు సరైన చికిత్స అందించకుండా నిర్లక్ష్యం వహిస్తే ఇది డయాబెటిస్ మరియు గుండె సంబంధిత వ్యాధులకు దారితీసే అవకాశం ఉంటుంది.




**పీ.సీ.ఓ.డి. అంటే:-** అపరిపక్వమైన అండం (ఇమ్మెచ్యూర్ ఫాలికల్) నీటిబుడగల వలె మారి అండాశయపు గోడలపై ఉండిపోవటాన్ని పాలిసిస్టిక్ ఒవేరియన్ డిసీజ్ (PCOD) అంటారు. సాధారణంగా ఋతుచక్రము ఉన్న మహిళలలో నెలసరి అయిన 11–14 రోజుల మధ్యన రెండు అండాశయాలలో – ఒక అండాశయం నుండి అండం విడుదల అవుతుంది. ఈ విధంగా ప్రతి నెలలో ఎడమ వైపున లేదా కుడి వైపున ఉన్న అండాశయం నుండి ఒక అండం విడుదల అయి ఫలదీకరణకు సిద్ధంగా ఉంటుంది. కానీ పీ.సీ.ఓ.డి. ఉన్న మహిళలలో అండం విడుదల కాకుండా, అపరిపక్వత చెందిన అండాలు నీటిబుడగల వలె మారి అండాశయపు గోడలపై కనిపిస్తాయి. ఇలా రెండు అండాశయాలపై గనక కనిపిస్తే – దీనిని వైద్యపరిభాషలో బైలేటరల్ పీ.సీ.ఓ.డి. అని అంటారు.

**కారణాలు:** ఈ సమస్యకు గల ఖచ్చితమైన కారణాలు తెలియరాలేదు. కానీ కొన్ని జన్యుపరమైన అంశాల వలన మరియు వంశపారంపర్యత వలన ఈ సమస్య తలెత్తే అవకాశం ఉంది. • F.S.H., L.H., ఈస్ట్రోజన్, టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత, సరైన జీవనశైలి లేకపోవడం అంటే – వ్యాయామం మరియు ఆహార నియమాలను పాటించకపోవడం, పిండిపదార్థాలు మరియు జంక్‌ఫుడ్స్ ఎక్కువగా తీసుకోవడం, • అధిక మానసిక ఒత్తిడికి లోనవడం వంటి అంశాల కారణంగా ఈ సమస్య ఏర్పడవచ్చు. • **ఇన్సులిన్ రెసిస్టెన్స్:** దీనివలన రక్తంలో ఇన్సులిన్ శాతం పెరిగి, టెస్టోస్టిరాన్ హార్మోన్ స్థాయిలు పెరుగుతాయి. ఇది స్థూలకాయానికి దారితీసి పీ.సీ.ఓ.డి. సమస్యను ప్రేరేపిస్తుంది.

**లక్షణాలు:** నెలసరి రాకపోవడం, నెలసరిలో ఎక్కువ లేదా తక్కువ రక్తస్రావం అవటం, నెలసరిలో రక్తస్రావం 4–5 రోజులకు మించి కొనసాగటం, రెండు ఋతుచక్రముల మధ్యలో రక్తస్రావం అవడం • నెలసరి సరిగా వచ్చినా కూడా, అండాశయం నుండి అండం విడుదల కాకపోవడం
• ముఖం మరియు వీపు భాగంలో మొటిమలు రావడం • చర్మపు మడతలలో, మెడభాగంలో చర్మం మందంగా మరియు నల్లగా మారటం
• 'సంతానలేమి' సమస్యను ఎదుర్కోవడం • తలనొప్పి, బరువు పెరగడం, తల వెంట్రుకలు ఎక్కువగా రాలిపోవడం • కొందరిలో బరువు సాధారణంగా ఉండటం మరియు మరికొందరిలో బరువు తగ్గటం • ముఖం మరియు ఛాతీపై మగవారికి మాదిరిగా వెంట్రుకలు రావడం
• మానసిక కల్లోలం (mood swings) వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**దుష్ప్రభావాలు:** టైప్–II డయాబెటిస్, గుండె జబ్బులు, కొలెస్టిరాల్ సమస్యలు, అధిక రక్తపోటు, ఎండోమెట్రియల్ క్యాన్సర్ వంటి సమస్యలకు పీ.సీ.ఓ.డి. దారితీస్తుంది.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** జీవన శైలి మార్చుకుంటూ – ముఖ్యంగా ఒత్తిడి తగ్గించుకోవాలి. క్రమం తప్పకుండా వ్యాయామం చేయాలి. • బరువును అదుపులో ఉంచుకోవడం ద్వారా డయాబెటిస్, అధిక రక్తపోటు, కొలెస్టిరాల్ వంటి సమస్యలకు దూరంగా ఉండవచ్చు. • అధిక కొవ్వు పదార్థాలు మరియు జంక్ ఫుడ్స్ తీసుకోకపోవడం వంటి జాగ్రత్తల ద్వారా పీ.సీ.ఓ.డి. సమస్యను కొంతవరకు నియంత్రణలో ఉంచవచ్చును.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హార్మోన్‌ల అసమతుల్యత వలన తలెత్తే ఎలాంటి వ్యాధులనైనా హోమియోపతి మందుల ద్వారా పూర్తిగా నయం చేయవచ్చు. 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో అందించబడే జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా ఎలాంటి దుష్ప్రభావాలు లేకుండా పీ.సీ.ఓ.డి. సమస్యను పూర్తిగా నయం చేయడమే కాకుండా, ఎలాంటి కాంప్లికేషన్‌లు ఉన్నా వాటిని తగ్గించవచ్చు. యుక్తవయస్సులోనే దీనికి సరైన చికిత్సను తీసుకోవడం వలన సంతానలేమి, ఒబేసిటీ వంటి దుష్ప్రభావాల నుండి మనల్ని మనం కాపాడుకోవచ్చు.



# నిధి 9

-వక్కంతం సూర్యనారాయణరావ్ సెల్: 98662 67287

**వాయు నూతనోత్సాహంతో పరుగుతీస్తోంది. సుభిక్షరాజ్య మహారాజుగారి శాలలో ఉన్నప్పుడు పొగరుమోతు అశ్వంగా, ప్రమాదకరమైన గుర్రంగా పేరుపొందిన వాయు దాదాపు సాధువుగా మారిపోయినట్టుంది. లేకపోతే శరభాద్రి దొర తొత్తులకి లొంగి ఉండేదికాదు. ఆ మార్పు అశ్వత్థామ ప్రబోధంతో వచ్చినట్టుంది! అందుకే ఆయన కల్పించుకుని గుర్రం తనకు దక్కేలా చేశాడు!**

కుడిచేతి వైపున ఉషోదయం అవుతూ, సూర్యుడి రాకను తెలియజేస్తోంది. అశ్వత్థామ గారి శరీరం నుండి వెలువడే వాసన... దానిని తాను దుర్గంధం అనలేడు; సుగంధమూ అనలేడు! తనను ఎంతో సులభంగా శరభాద్రి అశ్వాగారానికి తీసుకెళ్ళింది. మాగన్నుగా ఉన్న వాళ్ళూ, నిద్రను దూరంగా ఉంచే ప్రయత్నం చేస్తున్న వాళ్ళూ, విచిత్రంగా తను వెళ్ళగానే గాఢ నిద్రలో మునిగారు. నిధి నవ్వుకున్నాడు. తాను వెళ్ళగానే కాదు, అశ్వత్థామగారి వాసన వెళ్ళగానే, ఆ వాసన ఘ్రాణేంద్రియాలకు సోకగానే ఏదో మత్తుమందు వాసన చూసినట్లు సోలిపోయారు. గుర్రాలు కొన్ని చిన్నగా సకిలించాయి. కొన్ని అసహనంగా కదిలాయి. శ్వేతాశ్వం వాయు బంధించిన చోటే కదం తొక్కుతూ, నాట్యం చేస్తోంది. తను దాని దగ్గరకు పరుగెత్తాడు. నిమిరి కట్టువిప్పాడు.

అశ్వత్థామగారి దేహగంధం తనను అశ్వాగారం బైటికి రమ్మని నిశ్శబ్దభాషలో హెచ్చరించింది. సుంకం భటుల్ని అవలీలగా నిద్రపుచ్చి, తనను హరిహర పట్టణం దాటించింది. తాను సురక్షిత ప్రదేశానికి చేరుకున్నాక ఆయన దేహగంధం గాలిలో లయమైపోయింది. చల్లటి గాలిని చీలుస్తూ వాయు దూసుకుపోతోంది. తన రాజ్యానికి ఉత్తరాన ఉన్న పౌండ్రక పర్వతం కనిపించేదాకా తన ప్రయాణం సాగుతూనే ఉండాలి. తన ప్రయాణంలో ఇది రెండవ పగలు మాత్రమే. మొదటి పగలు... ఒక విషయాన్ని స్పష్టం చేసింది. స్వార్థపరుల కళ్ళు తన గుర్రం మీద పడే అవకాశం అధికంగా ఉంది. అందుకు కారణం గుర్రం రంగు కాదు; గుర్రం వేగం కాదు. మోర మీద నుండి వీపు మీదుగా సాగి, తోకలో కలుస్తున్న బంగారు రంగు! మనిషి బంగారాన్ని దొంగిలిస్తాడు. అది సహజమైన దురాశ. ఉడుతమీద ఉన్నట్టు తన గుర్రంమీద ఉన్న బంగారు వర్ణాన్ని, చర్మంతో పాటు పుట్టుకొచ్చిన రంగును దొంగిలించే ప్రయత్నం చేశాడు ఒక స్వార్థపరుడు! లోకంలో స్వార్థపరులు ఉన్నారు. తన వాయుకోసం అన్నివిధాలా ప్రయత్నిస్తారు! ఈ సత్యం అశ్వత్థామ తేజోరూపానికి తెలీదా? తెలిసీ అపహరణకు గురయ్యే అవకాశం ఎక్కువగా ఉన్న వాయును ఎందుకు తీసుకొమ్మన్నాడాయన? గుర్రం కోసం ప్రయత్నించే వ్యక్తులవల్ల తన ప్రయాణానికి ఆటంకాలు ఎదురవుతాయని ఆయన ఊహించలేదా?

నిధిలో ఆలోచనలు వాయును మించిన వేగంతో ముందుకు సాగుతున్నాయి. నవనిధుల వేటకు వెళ్ళమంటూ అశ్వత్థామ అదృశ్యరూపం తనను ప్రోత్సహించింది. తనలో ఏదో ఉత్కంఠను పుట్టించింది. అశ్వత్థామ గారి మాటను వినాలనిపించింది. పాటించాలనిపించింది. చెవులు అప్పగించి వినాలనిపించింది. 'చేత'లతో పాటించాలనిపించింది. అందుకు కారణం తన బలహీనత కాదు; ఆయన వాక్కులోని బలం! శ్వేతాశ్వం వాయు ఎన్నిక కూడా అంతే! అశ్వత్థామ తను ఒక గాడిద మీదో, ఒక దున్నపోతు మీదో ప్రయాణం చేయమని సూచించి ఉంటే తాను నిస్సందేహంగా గాడిదనో, దున్నపోతునో అధిరోహించి ఉండేవాడు!

నిధి చిరునవ్వు నవ్వుకుంటూ, వాయును నెమ్మదిగా, స్పృశించాడు.

అతని అరచెయ్యి అశ్వం మీద వెనక్కి జరుగుతూ ఒకసారి నిమిరింది. వాయు తన యజమాని స్పర్శ భాషను చిటికెలో అర్థం చేసుకుంది. వేగం తగ్గిస్తూ, తగ్గిస్తూ, ఒకచోట ఆగింది. సమీపంలో రాళ్ళ మీద నుండి ఉల్లాసంగా దూకే నీళ్ళు చప్పుడు చేస్తున్నాయి. చిలుకలు గోలగా అరుస్తున్నాయి. చిలుకల అరుపులు మధురఫలాల ఉనికిని తెలియజేస్తున్నాయి. ఆకలి దప్పులు తీరుతాయి! రాత్రి ఆహారానికి పళ్ళు సేకరించుకోవచ్చు. నిధి ముందుకు కదిలాడు. వాయు అనుసరిస్తోంది.

***

నిధి ముందుగా అశ్వానికి స్నానం చేయించాడు. పచ్చికలో వదిలి, తను స్నానం చేశాడు. చిలకలతో పోటీపడి తియ్యతియ్యని జారుపళ్ళు కోసుకున్నాడు. ఆకలి తీర్చుకున్నాడు. మూట కట్టుకున్నాడు. సెలయేటిని వదిలి, పొదలమధ్య హరితకాంత తల మీద నిర్లక్ష్యంగా తీసుకున్న పాపటలా ఉన్న కాలిబాట చేరుకున్నాడు. కాసేపు నడవాలనిపించిందతనికి. నిధి వెనకే అడుగులో అడుగు వేస్తోంది వాయు. చల్లటి గాలి రకరకాల పువ్వుల సువాసనలను మోస్తూ, అతని శరీరాన్ని తాకుతోంది.

ఏదో పక్షి రెక్కల్ని టపటపలాడిస్తోంది. తన రాక ఏదో పక్షికి ప్రాణభయం కలిగించినట్టుంది! కొద్ది దూరం వెళ్ళాక నల్లటి, గుండ్రటి రాతిని తప్పించుకుంటూ, బాట వినయంగా మలుపు తిరిగింది. రెక్కల టపటప వేగంగా, బిగ్గరగా వినవస్తూ, నిధి దృష్టిని ఎడమ చేతి వైపు ఆకర్షించింది. రెక్కల టపటపలకి జత చేస్తున్న రాగంలా పక్షి అరుపు వినిపించింది. గ్రద్ద కేక! ఆ కేకలో ఏదో ఆర్తుత ధ్వ ని స్తు న్న ట్ట ని పి స్తోం ది నిధికి. రెక్కల టపటప

**జరిగిన కథ**

*బాకీపడ్డ కప్పం వెంటనే చెల్లించాలని సుభిక్ష రాజ్య మహారాజుకు చక్రవర్తి విజయానందులు లేఖ పంపిస్తాడు. దాంతో జ్యోతిష్కుడు చెప్పిన విధంగా, మహారాజు కోరడంతో నవనిధుల సాధనకు బయలుదేరతాడు నిధి. అశ్వత్థామ సలహాతో, శ్వేతాశ్వాన్ని తీసుకుని, బయలుదేరిన నిధి, హరిహరపురం చేరతాడు. పాళెగాడు శరభాద్రి కన్ను వాయుపై పడుతుంది. నాటకమాడి గుర్రాన్ని స్వాధీనం చేసుకుంటాడు శరభాద్రి. అర్ధరాత్రి సమయంలో అశ్వత్థామ నిధిని నిద్రలేపి తనను అనుసరించమంటాడు. వాయుని విడిపించడంలో సహాయం చేస్తానంటాడు.*

*ఆ తర్వాత...*



వేగం హెచ్చింది.

నిధి ఎడమ వైపున ఉన్న గురివింద పొద దగ్గరగా వెళ్ళి, నిక్కి చూశాడు. ఎదురుగా ప్రత్యక్షమైన దృశ్యాన్ని నమ్మలేకపోయాడు నిధి. నివ్వెరపాటుతో అతని ముంజేతులమీద రోమాలు నిక్కబొడుచుకున్నాయి. గోపురంలా పెరిగిన పుట్ట. శిఖరంలా ఉన్న భాగంలో రంధ్రం. పుట్ట రంధ్రంలో రెండు కాళ్ళూ ఇరుక్కున్న గ్రద్ద, కాళ్ళను పైకి లాగడానికి విశ్వప్రయత్నం చేస్తోంది. రెక్కల బలంతో కాళ్ళను పుట్ట రంధ్రంపైకి కొద్దిగా లాగుతోంది గ్రద్ద. క్షణంలో దాని కాళ్ళు రంధ్రంలోకి వెళ్తున్నాయి. కారణం... కారణం.. దాని కాళ్ళను పాశంలా తన శరీరంతో చుట్టేసిన సర్పం! పాము శరీరం గోధుమ వర్ణంలో మెరుస్తోంది. గోధుమవన్నె నాగు! అలాంటి నాగసర్పాన్ని తాను చూసి ఉన్నాడు. గ్రద్ద ఆపకుండా అరుస్తోంది. ఎవరి సహాయమో కోరుతూ పిలుస్తున్నట్టుంది! రెక్కల టపటపలు ప్రశాంతతకు భంగం కలిగిస్తున్నాయి.

గ్రద్ద తనకు విముక్తి కలిగించుకోవడానికి పైకి లాగుతోంది. పాము దానిని మించిన బలంతో, స్థానబలంతో లోపలికి లాగుతోంది! ఇంతకూ ఏం జరిగింది? పాముల్ని పట్టి ఫలహారం చేసే గరుడ పక్షి పాముకి ఎలా పట్టుబడింది? ఏం జరిగింది? ఏం జరిగి ఉంటుంది? తన ప్రశ్నకి సమాధానం గ్రద్ధ చెప్పదు, పాము చెప్పదు! తను ఊహించాల్సిందే!

సర్పం పుట్టలోకి వెళ్తున్నప్పుడో, పుట్టలో నుంచి వెలికి వస్తున్నప్పుడో తన్నుకు పోవడానికి గ్రద్ద రివ్వున వాలి ఉంటుంది. గ్రద్ద కాలి వేళ్ళు తనని పట్టులో బిగించి, పైకి ఎత్తేలోగా, ప్రాణభయంతో సహజ స్పందనతో పాము గ్రద్ద కాళ్ళని చుట్టేసింది. ఫలితంగా బలవంతుడు బలహీనుడి పట్టులో ఇరుక్కుపోయాడు!

పట్టు సడలితే పాముకు ప్రమాదం, పట్టుతో గ్రద్దకు అపాయం! ఎన్ని నాళ్ళయినా పాము తన



పట్టు సడలించదు. ప్రాణరక్షణ ప్రక్రియ సడలించనివ్వదు! దేనిభయం దానిది. పాము నుండి గ్రద్దనూ, గ్రద్ద నుండి పామునూ రక్షించాలనిపిస్తోంది నిధికి. తనది కూడా సహజ స్పందనే!

నిధి ఆలోచిస్తూ పుట్ట దగ్గరగా అడుగులు వేశాడు. గ్రద్ద తనను వాలుగా చూసింది. దాని రెక్కల టపటపలో వేగం ఇంకా హెచ్చింది. తను చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. సర్ప స్వభావం తనకి తెలుసు. పుట్టలోకి దూరుతూ వెళ్ళే పాము పడగ–తల భాగం– పుట్టలోపల వెనక్కి మెలితిరిగి, రంధ్రం ప్రవేశ ప్రాంతానికి వచ్చేస్తుంది. ఆత్మరక్షణ కాదు!

అంటే ఇప్పుడు గోధుమ వర్ణం నాగుపాము పడగ రంధ్రం పైభాగానికి దగ్గరలో ఉంటుంది! గ్రద్ద లాగినప్పుడు దానికాళ్ళను చుట్టి ముడతపడిన పాము శరీరం రంధ్రంలో అధిక భాగాన్ని ఆక్రమించుకుంది. కష్టపడితేగానీ, దాని పడగ పైకిరాదు. లావుగా, బలంగా ఉన్న పాము శరీరం ఆ విషయాన్ని స్పష్టం చేస్తోంది. నిధి ఆలోచిస్తూ చుట్టూ చూశాడు. కొంచెం దూరంలో చిన్నచిన్న రాళ్ళు గుట్టగా పడి ఉన్నాయి. నిధి వెళ్ళి ఆ రాళ్ళను అటూఇటూ పాదంతో తోశాడు. అడుగు పొడవు, సుమారు అరడుగు వెడల్పూ ఉన్న రాతిపలక కనిపించిందతనికి. నిధి ఆ పలకను తీసుకున్నాడు.

నిధి పుట్ట మీదికి ఎక్కాడు. పాము శరీరం ప్రక్కనే రంధ్రం నల్లగా, సొరంగంలా అవుపిస్తోంది. ఆ రంధ్రభాగం మీద రాతిపలకను జాగ్రత్తగా పెట్టాడు. పాము శరీర భాగాన్ని గట్టిగా నొక్కిపట్టి ఉంచేలా రాతిని జరిపాడు. ఎడమ కాలిమీద జాగ్రత్తగా నిలుచుని, కుడి కాలిని మోకాలు వద్ద వంచాడు. పాదాన్ని రాతిపలక మీద పెట్టి, బలంగా తొక్కి ఉంచాడు. గ్రద్ద రెక్కల్ని వేగంగా కొట్టుకుంది కానీ, అతన్ని ముక్కుతో పట్టుకునే ప్రయత్నం చేయలేదు.

పాముతో పోరాడిన అలసటతో దాని ముక్కు తెరుచుకుని ఉంది. కళ్ళలో భయం, బాధ స్పష్టంగా ప్రత్యక్షమవుతున్నాయి. నిధి తన ఉత్తరీయం తీసి, రెండు చేతులకీ కవచం లాగా చుట్టుకున్నాడు. ఒక వేళ పాము కాటువేస్తే, తనకు తగలకుండా రక్షణ కవచం అన్నమాట. ఉత్తరీయం రెండు కొసలూ రెండు చేతులకీ చుట్టడం వల్ల రెండు చేతుల మధ్య ఉత్తరీయం తాడులా ఉంది. చేతులు స్వేచ్ఛగా కదిలే అవకాశం ఉంది. నిధి క్రిందికి వంగాడు. రెండు చేతుల్తో ధైర్యంగా గ్రద్ద పాదాల్ని, దాని పొట్ట క్రింది భాగంలో పట్టుకున్నాడు. గ్రద్ద కదుల్తోంది. పామూ కదుల్తోంది. నిధి ఊపిరి బిగబట్టి, బలంగా, పైకి లాగుతూ ఉండిపోయాడు. గ్రద్ద భయంతో అరుస్తోంది. నిధి కళ్ళు పుట్ట 'కోమ' మీదే ఉన్నాయి. పాము పట్టు సడలుతున్నట్టుంది. దాని శరీరం మెల్లిగా, పుట్టలోపలికి జారుతోంది. గ్రద్ద కాళ్ళు అదే సమయంలో పైకి జరుగుతున్నాయి.

నిధి ప్రయత్నం ఫలించింది. పాము శరీరం గ్రద్ద కాళ్ళ మీదుగా సర్రున జారుతూ పుట్టలోకి వెళ్తోంది. వెళ్ళేకొద్దీ సన్నబడుతూ, చివరికి తోక పుట్టలోకి దూరేసింది. గ్రద్దకు విముక్తి లభించింది. గ్రద్దను అలాగే పట్టుకుని, నిధి పుట్ట మీద నుండి క్రిందికి దూకాడు. గ్రద్ద అరవడం మానేసింది. రెక్కలు మాత్రం టపటపలాడుతున్నాయి. గ్రద్దను తన పట్టులోంచి విడుదల చేయబోతూ, పాము పట్టులో ఇరుక్కున్న దాని కాళ్ళను పరిశీలనగా చూశాడు నిధి. కుడికాలి గోరు ఒకటి లేదు. వెనకవైపున ఉండాల్సిన గోరు విరిగినట్టుంది. రక్తం మరక కనిపిస్తోంది. నాలుగు గోళ్ళలో ఒకటి ఎందుకు తెగిందో, రక్తం కారేలా మొదలంటా ఎందుకు తెగిందో తనకు తెలీదు. గోరు పోతే పోయింది; ప్రాణం దక్కింది.

'గరుడా! వెళ్ళు! హాయిగా బ్రతుకు!' అంటూ చిన్నగా నవ్వుతూ గ్రద్దను పైకి ఎగరేశాడు నిధి. బరువుగా రెక్కల్ని ఆడిస్తూ గ్రద్ద ఎగిరిపోయింది. కాలిబాట మీద నీడ ఉండేలా పొడవుగా, అడ్డంగా సాగిన చెట్టు కొమ్మమీద వాలింది. నిధి గుర్రం వైపు నడుస్తూ, చేతులకు చుట్టిన ఉత్తరీయాన్ని ఊడదీశాడు.

వాయు ఉల్లాసంగా పరిగెడుతోంది. దానిమీద ఎండా, నీడా దోబూచులాడుతున్నాయి. నిధికి గ్రద్ద పాముల సంఘటన గుర్తొస్తోంది. పాముని పట్టుకోబోయిన గ్రద్ద పాముకు పట్టుబడింది. గ్రద్దలనూ, సర్పాలనూ దాయాదులుగా పేర్కొన్నాయి పురాణాలు. కశ్యప ప్రజాపతి భార్య వినతకు గరుడుడూ, ఆమె సహపత్ని కద్రువకు సర్పాలూ జన్మించాయి. వినతా, కద్రువా అక్కాచెల్లెళ్ళు! తల్లుల కోసం గరుడ జాతికీ, సర్పజాతికీ ఏ యుగంలోనో ఏర్పడిన వైరం ఆ జాతి ప్రాణుల మధ్య శాశ్వతంగా కొనసాగుతోంది! వినత, కద్రువల సంతానాలకు సంబంధించిన పురాణగాధను నెమరు వేసుకుంటూ ప్రయాణం సాగిస్తున్నాడు నిధి. వాయు, బడలిక ఏ మాత్రమూ లేనట్లు దారిని తన నాలుగు గిట్టలతో వెనక్కితోస్తూ పరుగెడుతూనే ఉంది. అశ్వం తన ప్రయాణాన్ని సాగిస్తున్నట్టే, పశ్చిమాకాశాన సూర్యుడు

**చెట్లమధ్య, పొదలమధ్య వంపులు తిరిగిన దారివెంట నడవసాగాడు నిధి. తన చెవులను పరిసర శబ్దాలపై ఏకాగ్రం చేశాడు. ఘల్లుఘల్లుమంటూ గంటల శబ్దం. ఆ దిశగా అడుగులేశాడతను. కొంతదూరంలో ఉన్న కాలిబాట మీద కనిపించిన దృశ్యం అతణ్ణి నిర్ఘాంతపరిచింది. రెండు మానవ శిరస్సులు ఒకదాని వెంట ఒకటి వెళుతున్నాయి. ఇద్దరి భుజాల మీద వెదురుగడ ఉంది. దేన్నో మోసుకెళుతున్నారు. అసలెవరు వాళ్ళు? దేన్ని తీసుకెళుతున్నారు?**

తన ప్రయాణం సాగిస్తున్నాడు.

***

మరునాటి ఉదయం స్నానమూ, ఫలహారమూ ముగించిన నిధి ప్రయాణానికి సిద్ధమవుతూ చుట్టూ చూశాడు. రకరకాల కాయలూ, పళ్ళూ కనిపిస్తున్నాయి. కోసి, మూట కట్టుకోవాల్సిన అవసరం లేదు. తన ప్రయాణం సాగే అరణ్యమార్గంలో ఎక్కడపడితే అక్కడ ఏవో పళ్ళు దొరుకుతూనే ఉంటాయి. నిధి గుర్రాన్ని అధిరోహించబోతూ ఆగాడు. ఏదో గుర్తొచ్చి తాను వెళ్ళబోయే దారి వైపు చూశాడు. దారికి ఇరువైపులా ఉన్న గచ్చపొదలు పైన కలుసుకుని, కొమ్మలూ, రెమ్మలూ దట్టంగా అల్లుకుపోయి, దారిమీద పందిరిలా ఏర్పడ్డాయి. గచ్చకాయలు విరగ కాసి ఉన్నాయి. బాల్యంలో గచ్చకాయల కోసం తానూ, మిత్రులూ చెట్లమ్మటా, పుట్లమ్మటా తెగ తిరిగేవారు. గుర్రం మీద కూర్చుని తాను గచ్చపొదల పందిరి క్రింద ప్రయాణం చేయలేడు. నడచినా కూడా, తలవాల్చి, జాగ్రత్తగా నడవాలి. వేరే దారి లేదు. పచ్చటి పందిరి క్రింద దారి! నిధి ముందుకు నడిచాడు. వాయు అతని వెంట నడవ సాగింది. గచ్చపొదల పందిరి ఎంతకీ అంతం కావడం లేదు. పొదను ఇంకా అంటిపెట్టుకుని ఉన్న ఎండిన గచ్చకాయలు నిధి తలను స్పృశిస్తూ గలగలమంటున్నాయి. చిన్నచిన్న ముళ్ళు నిధి వస్త్రాలకు తగుల్తూ, అతన్ని ఆపే ప్రయత్నం చేస్తూ విఫలమవుతున్నాయి. దట్టంగా నేల మీద రాలిపడిన గచ్చకాయలు నిధి పాదాల క్రిందా, 'వాయు' గిట్టల క్రిందా చప్పుళ్ళు చేస్తున్నాయి. ఏదో సొరంగ మార్గంలో ప్రయాణం చేస్తున్న అనుభూతి కలుగుతోంది నిధికి. తను బయలుదేరినప్పుడే సూర్యోదయం అయ్యింది. అయితే గచ్చపొదల్నీ, వాటి మీద దట్టంగా అల్లుకున్న అడవి తీగల్నీ చీల్చుకుంటూ లోపలికి దూరేశక్తి సూర్యకిరణాలకు లేదని స్పష్టమవుతోంది. పట్టపగలు, నట్టనడి అడవిలో, చిమ్మచీకటిలో ప్రయాణం!

ఈ ప్రయాణం, ఈ ప్రయాణ లక్ష్యం అనుభవాల కదంబంగా రూపొందేలా ఉంది. గతంలోని అన్నిరకాల అనుభవాలను భవిష్యత్తులో నెమరు వేసుకోవడంలో ఒక ఆనందం ఉంటుంది. తన తరువాతి తరానికి చెందిన వాళ్ళతో పంచుకోవడం వల్ల గత అనుభవాలు మనిషికి ఎంతో ఆనందాన్నీ, తృప్తినీ కలిగిస్తాయి. తన గతానుభవాలను వర్ణించి చెప్తూ, నాన్న పొందే ఆనందాన్ని తాను చిన్నప్పట్నుంచీ చూస్తూనే ఉన్నాడు.

ఉన్నట్టుండి గచ్చపొదల సొరంగమార్గం అంత



మైంది. నిధి ఉదయ సమయ సూర్యకాంతిని భరించలేక, ఒక్కసారిగా కళ్ళు మూసుకున్నాడు. నెమ్మదిగా కళ్ళుతెరిచి, తన ముందున్న ఇరుకుదారినీ, పరిసరాలనూ పరికించాడు. ముందుకు వెళ్ళేకొద్దీ అరణ్యం దట్టంగా మారుతోందని గ్రహించాడతను. ఏదో జనవాసం తగిలితే గానీ, తాను ఎక్కడున్నదీ, పౌండ్రక పర్వతానికి ఎంత దూరంలో ఉన్నదీ తెలిసే అవకాశం లేదు. పౌండ్రకపర్వతం తన సుభిక్ష రాజ్యానికి ఉత్తరదిశలో, పొలిమేరగా ఉందని తెలుసు. అయితే, తను ప్రయాణం చేయాల్సిన మార్గం ఏయే నగరాల గుండా, ఏయే సామంతరాజ్యాల గుండా వెళ్తుందో తెలీదు. హరిహర పట్టణం సుభిక్ష రాజ్యంలోనిది కాదు. ఒక గమ్యానికి చేర్చేదారి రాజ్యాల పొలిమేరల్ని, ఎల్లల్ని చెరిపివేస్తుంది. భూమి అంతా ఒక్కటే అనే నైసర్గిక సత్యాన్ని మార్గాలు తమ ఆకారాలతో నేలమీద లిఖిస్తున్నాయి!

నిధి అశ్వాన్ని అధిరోహించబోతూ ఆగాడు. ప్రశ్నార్థకంగా వాయు చెవుల్ని చూశాడు. గుర్రం చెవులు ఎందుకో స్పందిస్తూ, నిక్కబొడుచుకుంటున్నాయి. అంటే ఆ చెవులు తమ శ్రవణశక్తిని కేంద్రీకరిస్తూ 'ఏకాగ్రం' చేస్తున్నాయి. కళ్ళు ఏదో దృశ్యానికీ, నాసిక ఏదో వాసనకూ స్పందించినట్టే, చెవులు ఏదో శబ్దానికి స్పందిస్తాయి. మనిషి శ్రవణేంద్రియాలు అందుకోలేని శబ్దాలను పశుపక్ష్యాదుల శ్రవణేంద్రియాలు అందుకుంటాయేమో!

నిధి గుర్రాన్ని అనుకరిస్తూ చెవులు రిక్కించాడు. అంతసేపూ తనకి ప్రత్యేకంగా వినిపించని అడవి పక్షుల అరుపులూ, చిన్నచిన్న జంతువులు చేసే శబ్దాలూ ఇప్పుడు వినిపిస్తున్నాయి. అంతసేపూ అరణ్య సంబంధమైన వాతావరణంలో లీనమైపోయిన శబ్దాలవి. అరణ్యానికి నేపథ్య సంగీతం అందించే శబ్దాలు. గుర్రం మీద ప్రేమగా ఇందాకటి నుండీ వాలి ఉన్న నిధి చెయ్యి కొద్దిగా జారింది. గుర్రం ఎందుకో కొద్దిగా కదులుతూ స్పందించినట్టుంది.

అరణ్య నేపథ్య శబ్దాల నుండి వేరుచేసి, మరేదో శబ్దాల్ని వినడానికి ప్రయత్నిస్తున్నాయి నిధి చెవులు. కొన్ని క్షణాల్లో అతని ఏకాగ్రత ఫలించింది. ఘల్లుఘల్లు, ఘల్లుఘల్లు మంటూ చిరుగంటలు చేసే శబ్దంలా ఏదో శబ్దం లీలగా అతని చెవులకు సోకసాగింది. నిధి శబ్దాలు వస్తున్న దిశగా చెవిని మళ్ళిస్తూ తల తిప్పి ఏకాగ్రతతో ఆలకించాడు. మెడలో చిరుగంటలు కట్టిన పశువులు నడిచేటప్పుడు వినిపించే చప్పుడులా ఉందది. ఆ చిరుగంటల సవ్వడి మానవ సంచారాన్నీ, పశు సంచారాన్నీ సూచిస్తోంది. పశువులకు గంటలు కట్టి, వాటిని తోలుకెళ్ళేది మనుషులే! సమీపంలో ఎక్కడో జనవాసం ఉందని కూడా గంటల సవ్వడి చెప్తోంది! మనుషులు తారసిల్లితే, తానిప్పుడు ఎక్కడ ఉన్నాడో తెలుసుకోవచ్చు. ఆలోచిస్తూ నిధి పొదల మధ్య, చెట్ల మధ్య వంపులు తిరుగుతున్న దారివెంట నడవసాగాడు. క్రమంగా గంటల చప్పుడు స్పష్టంగా, లయబద్ధంగా వినిపిస్తోంది. ఆ చప్పుడు తన దగ్గరగా వస్తోంది. తాను దాని దగ్గరగా వెళ్తున్నాడు. కొంచెం దూరం వెళ్ళి, నిధి ఆగాడు. ఎదురుగా రెల్లుగడ్డి ఎత్తుగా పెరిగి ఉంది. రెల్లుగడ్డి మధ్య కాలిబాట ఉన్నట్టుంది. రెండు మానవ శిరస్సులు ఒకదాని వెంట ఒకటి వెళ్తున్నాయి. ముందువెళ్తున్న శిరస్సుకు అయిదారు అడుగుల దూరంలో రెండవ తల వెళ్తోంది. వెనక వెళ్తున్న తల అడుగు అడుగుకీ, ఒక వైపు వాలుతోంది. వెనక నడుస్తున్న వ్యక్తి కుంటుతూ నడుస్తున్నట్టుంది!

నిధి ముందుకు నడిచాడు. దట్టంగా ఉన్న శిరోజాలు ఆ వ్యక్తులు స్త్రీలు అని చెప్తున్నాయి. పెద్దపెద్ద తలలు. వాళ్ళ శిరోజాలు నలుపూ, ఎరుపూ కలిసిన రంగులో ఉన్నాయి. నిధి చప్పుడు చేయకుండా ముందుకు వెళ్ళాడు. రెల్లుగడ్డి పొడవు తగ్గిపోయింది. నిధి ఉత్తరం వైపు తిరిగి ఉన్నాడు. ఆ స్త్రీలు తూర్పు నుండీ పడమరవైపు వెళ్తున్నారు. ఇద్దరూ అంత దూరదూరంగా ఎందుకు నడుస్తున్నారో నిధికి అర్థమైంది. పొడవాటి వెదురుగడ వాళ్ళ భుజాల మీద ఉంది. అది ఇద్దర్నీ నిర్ణీత దూరంలో ఉంచుతోంది. నిధి ఆగి, నిర్ఘాంతపోతూ చూశాడు.

వెదురుగడకు కాళ్ళూ చేతులూ బంధించబడిన ఒక స్త్రీ వెల్లకిలా వేలాడుతోంది. కలిపి కట్టివేసిన చేతుల మధ్య, పాదాల మధ్య వెదురు దూర్చబడింది. కర్రకు వేలాడదీసి జంతువును తీసుకెళ్తున్నట్టు ఆ స్త్రీలు ఎవరో స్త్రీని... యువతిని... తీసుకెళ్తున్నారు. యువతి తల వెనక్కి వేలాడుతోంది. పొడుగాటి జడ తాడులా క్రిందికి జారింది. ఆమె నోటిని మూస్తూ గుడ్డ కట్టబడింది.

ఆ యువతిని మోస్తున్న స్త్రీల ఆకారాలు భయంకరంగా ఉన్నాయి. తైల సంస్కారం లేని చింపిరి జుట్టు పాయలు పాయలుగా విడదీసి, సన్నటి జడలుగా అల్లబడి ఉన్నాయి. పురెక్కించిన దారాల్లా ఉన్న ఆ సన్నటి జడల్లో, పైనుంచీ కిందిదాకా చిన్న గవ్వలు గుచ్చి ఉన్నాయి. ఆ గవ్వలు మల్లెమొగ్గల్లా ఉన్నాయి. వాళ్ళ వక్షభాగాలను ఏవో జంతుచర్మాలు రవికెల్లా కప్పి ఉన్నాయి. మరేదో జంతువు చర్మం నడుము నుండి మోకాళ్ళ దాకా ఉంది. చెవులకి ఆభరణాలుగా చిన్నచిన్న గంటలు. కొంచెం పెద్ద గంటలతో రూపొందిన దండలు వాళ్ళ మెడల్లో వేలాడుతున్నాయి. చేతులూ, కాళ్ళూ ఎర్రటి రంగులో గున్న ఏనుగుల తొండాల్లా ఉన్నాయి. జంతువుల ఎముకలతో చేసిన కంకణాలు ముంజేతులను గాజుల్లా అలంకరించాయి. పొట్టలు కుండల్లా ఉన్నాయి. ఆ బానబొజ్జల చుట్టూ చిన్నగంటల పట్టీలు వడ్డాణాల్లా ఉన్నాయి. పాదాలకి చిన్నగంటల కడియాలు. వాళ్ళ కదలికల్ని అనుసరించి మ్రోగుతున్నాయి శరీరాల మీద అలంకరించుకున్న గంటలు. వాళ్ళు ఏదో జాతికి చెందిన ఆటవిక స్త్రీలని వాళ్ళ వేషధారణ చెప్తోంది. వెనక నడుస్తున్న ఆటవిక స్త్రీ కుడికాలు పొట్టి. కుంటుతూ నడుస్తోందామె.

నిధికి అర్థమైపోయింది. ఎవరో యువతిని బంధించి, బలవంతంగా, జంతువులాగా వేలాడదీసి, తీసుకెళ్తున్నారు. సందేహం లేదు. అది యువతి అపహరణే! అందుకే ఆమె అరిచి కేకలు పెట్టకుండా నోట్లో గుడ్డలు కుక్కారు. ఆ యువతి ఆపదలో ఉంది. ఆ ఆపద ఏమిటో, ఎందుకు తీసుకెళ్తున్నారో, తెలుసుకోవాలి. ఆమెను రక్షించాలి.

నిధి చప్పుడు చేయకుండా పొదల్లో దూరుతూ వాళ్ళు వెళ్తున్నవైపు దూరంగా వెళ్ళాడు. వాళ్ళు వస్తున్న బాటలోకి చేరుకున్నాడు. వాళ్ళకు ఎదురుగా నడవసాగాడు. ఎదురుగా, బాట ప్రక్కన ఎత్తయిన రాళ్ళున్నాయి. వాళ్ళు రాళ్ళ చాటున వస్తున్నారు. నిధి రాళ్ళ దగ్గరగా వెళ్ళాడు. బాటకి ఒక వైపున చిన్న రాయి. మరో వైపున ఎత్తుగా ఉన్న రాయి. నిధి చిన్న రాతిమీద కూర్చుని, పెద్దరాతికి పాదాలు ఆన్చుకున్నాడు. తన కాళ్ళు వాళ్ళకి అడ్డంకి! గంటల చప్పుడు దగ్గరగా వచ్చేసింది. నిధి అటువైపే చూస్తున్నాడు. ముందు నడుస్తున్న ఆటవిక స్త్రీ నిధిని చూడగానే తటాలున ఆగింది. వెడల్పాటి ముఖం. లావుపాటి పెదవులు ఉబ్బినట్టున్నాయి. గుబురు కనుబొమల కింద చిన్నచిన్న కళ్ళు. చప్పిడి ముక్కు.

## అలాంటి వాటికి రాదట!

ఒక్క సినిమా హిట్ అయితే హీరోయిన్లు తమ దృష్టిని యాడ్స్ వైపు కేంద్రీకరిస్తారు. చిన్నాచితకా ఫంక్షన్లకూ, ప్రారంభోత్సవాలకూ భారీగా పుచ్చుకుని హాజరయి సందడి చేస్తారు. ఇదంతా మామూలు హీరోయిన్ల మాట! హీరోయిన్లలో సాయిపల్లవి రూటే సపరేటు! డబ్బు కోసం ప్రారంభోత్సవాలు గట్రా చేయనంటోంది. ఏదైనా సేవా కార్యక్రమాలకు పిలవండి అంటోంది. అలాంటి వాటికి తనకు ఒక్క రూపాయి కూడా ఇవ్వనక్కర్లేదనీ, ఫ్రీగా సర్వీస్ చేస్తాననీ చెబుతోంది. సాయి పల్లవి మాటలు విన్న వారు ఆమెకు బతక నేర్పడం చాతకాదని అంటున్నారు. సాయి పల్లవి మాటలని కొందరు మనస్ఫూర్తిగా అభినందిస్తున్నారు.

ఆమె కళ్ళు చిట్లిస్తూ చూస్తోంది. మెల్లగా ఆమె నోరు తెరుచుకుంది. ఎర్రటి నాలుక కొన తొంగి చూసింది. వెనక ఉన్న ఆమె సహచరి, తలవాల్చి, నిధి వైపు తొంగి చూస్తోంది. చిన్నకళ్ళు, చప్పిడిముక్కు ఉబ్బి నట్టున్న పెదవులు.

"కోడెగా! తప్పుకోవే! లేలేలే!" ముందున్న ఆట విక స్త్రీ బెదిరింపుగా అంది. ఆమె కంఠం బండమీద రుద్దిన రాయిలా ధ్వనించింది.

నిధి చిరునవ్వు నవ్వుకున్నాడు. ఏదో ఆటవిక భాష కాకుండా వాళ్ళు తెలుగే మాట్లాడుతున్నారు. నిధి ఆమె ముఖంలోకి చూశాడు. ఆమె శరీరం మురికి వాసన వేస్తోంది.

"ఆ పిల్ల ఎవరు?"

"మా రగతమ్మ దేవతకి మేత. లేలేలే!" ఆటవిక స్త్రీ కసిరింది.

నిధికి చక్కగా అర్థమైపోయింది. వాళ్ళ ఆటవిక దేవత 'రక్తమ్మ', యువతి ఆ దేవతకి నైవేద్యం! అంటే ఆ పిల్లను దేవతకి బలివ్వడానికి తీసుకెళ్తున్నారు... నరబలి!

నిధి దట్టీలో దోపుకున్న బాకును వెలికి తీశాడు. భయంగా చూస్తోందా యువతి. నిధి, ముందు ఆమె నోటికి కట్టిన గుడ్డను తీసివేశాడు. నోటిలో కూరిన గుడ్డ ముక్కను తీసి పారేశాడు. యువతి ఒగర్చు ప్రారంభించింది. నిధి చెయ్యి కదిలింది. అతని చేతిలోని బాకు యువతి పాదాల్ని కలిపి ఒక్కటిగా కట్టిన చర్మం పట్టీని కోసేసింది. ఆమె కాళ్ళు చివాల్న నేలమీదికి జారాయి. పాదాలు నేలను ఆనుకోగానే నిధి ఆమె చేతుల బంధనాన్ని ఛేదించాడు.

యువతి వెంటనే నేల మీద కూర్చుండి పోయింది. చేతులు జోడించి ఒకసారి నిధి వైపు చూసి, దోసిట్లో ముఖం దాచుకుని ఏడుస్తూ ఉండి పోయింది. యువతివైపే జాలిగా చూస్తున్న నిధి వక్షభాగాన్ని వెదురుగడ బలంగా తాకింది. వెనుక వైపున కుంటుతూ నడిచిన ఆటవిక స్త్రీ గడను వది లేసి చేతుల వేళ్ళని కొక్కేల్లా వంచి, నిధి మీదికి కుంటికా లితో దూకింది. నిధి చేతుల్ని పైకెత్తాడు. కొద్దిగా వెనుకకు జరిగాడు. తూలిపడబోయిన ఆటవిక స్త్రీ నిలదొక్కుకుంటూ సర్దుకుంది. ఆ ప్రయత్నంలో ఆమె జడ చివరున్న గంట బరువుతో నిధి వైపు దూసుకొచ్చింది. అతని ప్రయత్నం లేకుండానే పైకి




లేచిన అతని చేతిలోని బాకును తాకింది జడ. బాకు పదను స్పర్శతో జడ తెగి, కిందపడింది. గంట చప్పుడు చేసింది. ఆటవిక స్త్రీ కెవ్వున అరిచింది. నిధి నిర్ఘాంతపోతూ చూశాడు. ఆమె చెవి తెగిపోయిం దేమో అన్న అనుమానం వేసిందతనికి. అతన్ని ఆశ్చ ర్యంలో ముంచివేస్తూ, ఆటవిక స్త్రీ నేలమీద పడిన తన జడను అందుకుని గుండెలకు ఆన్చుకుంటూ ఏడవసాగింది!

నిధి అయోమయంగా చూస్తూ ఉండిపో యాడు. ఆటవిక స్త్రీ ఏడుపు విన్న యువతి తల యెత్తి చూసి, ఏడుపు మానేసింది.

"ఈ జాతి ఆడవాళ్ళకు జడలు ప్రాణంతో సమానం. జడ తెగిన స్త్రీని మొగుడు ఏలుకోడు. వాళ్ళ జాతి దేవత పూజ చేయనివ్వరు" యువతి వివరించింది.

నిధి అర్థమైనట్టు తలపంకించాడు. ఇందాక నిధి పీక పట్టుకున్న మొదటి స్త్రీ, రెండవ స్త్రీ వద్దకు వచ్చి ఓదార్పుగా ఏవో చప్పుళ్ళు చేస్తోంది. నిధి యువతి దగ్గరగా వెళ్ళాడు. "వీళ్ళు నిన్ను హింసించారు. బలి వ్వడానికి తీసుకెళ్ళే ప్రయత్నం చేశారు. శిక్ష వేయ్! శిక్షగా వీళ్ళ జడలు కోసిపారేయ్!"

యువతి ఉత్సాహంగా బాకుని అందుకుని పైకి లేచింది. "ఐదేసి జడలున్నాయి. అన్నీ కోసేస్తా!" అంది ఉత్సాహంగా.

నిధి తల ఊపాడు.

ఒక జడ పోగొట్టుకుని శోకాలు పెడుతున్న స్త్రీ దగ్గరగా ఆగింది యువతి. నిధి ఆమెకు సహా యంగా, ఆటవిక స్త్రీ చేతుల్ని పట్టుకున్నాడు. క్షణంలో నాలుగు జడలు తెగి కిందపడ్డాయి. ఆట విక స్త్రీ గుండెలు బాదుకుంటూ బొబ్బలు పెట్టసా గింది.

మొదటి ఆటవిక స్త్రీ ప్రమాదాన్ని పసిగట్టి లేచి పారిపోబోయింది. నిధి ఆమె జడగంటల్ని పట్టుకుని, ఆపాడు. కాసేపట్లో ఆమె జడలు అయిదూ నేలమీద పడ్డాయి. యువతి బాకుని నిధికి అందించి, జడల్ని ఏరుకుంది.

"గుర్తుగా ఇంటికి తీసుకెళ్తాను.."

"నువ్వు వీళ్ళకి ఎలా దొరికావు?" నిధి ప్రశ్నిం చాడు.

"ఈ జాతి ఆటవికులు రెండు చేతులకూ ఆరేసి వేళ్ళున్న కన్నెపిల్లల కోసం వెదుకుతూనే ఉంటారు. మా అమ్మ పోలిక నాకూ మా అక్కయ్యకూ వచ్చింది. ఆరేసి వేళ్ళతో పుట్టాం. పొలంలో కొడవలి తగిలి మా అక్కకు ఒకచేతి ఆరో వేలు తెగిపోయింది. దాంతో దానికి ప్రమాదం తప్పింది."

"ఎలాగా?"

"రెండు చేతులకీ ఆరు వేళ్ళు ఉంటేనే వీళ్ళు బలికి తీసుకెళ్తారు. ఒక వేలు తెగిపోయిన పిల్ల బలికి పనికిరాదట! తిక్క ఆచారం!"

"అయితే నీకు ప్రమాదం ఉంటూనే ఉంటుందన్న మాట!" నిధి చిరునవ్వుతో అన్నాడు.

"వీళ్ళది పాము పగ! నా కోసం ఎవరో, ఎప్పుడో వస్తారు. మాటు వేసి, బంధించి తీసుకెళ్తారు. నేను జాగ్రత్తగా ఉండాలి..."

నిధి పక్కపక్కనే కూర్చుని, ఒకరినొకరు పొదివి పట్టుకుని బిగ్గరగా వెక్కివెక్కి ఏడుస్తున్న ఆటవిక స్త్రీల వేపు చూస్తూ ఉండిపోయాడు. జడల్ని జాగ్ర త్తగా పట్టుకుని, నిలుచుని తనను బలిపశువుగా లాక్కెళ్ళిన స్త్రీలను కొరకొరా చూస్తోంది యువతి.

నిధి ఆమె దగ్గరగా వెళ్ళి నేలమీద కూర్చు న్నాడు. "ఇలా కూర్చో!" అన్నాడు.

యువతి కూర్చుంది. నిధి పట్ల కృతజ్ఞతాభా వంతో ఆమె కళ్ళు మెరుస్తున్నాయి.

"నీ పేరు?"

"చిన్ని..."

"చిన్నీ, వీళ్ళ మూలంగా ముందుముందు నీకు అపాయం రాకుండా చేస్తాను.." నిధి అన్నాడు.

చిన్ని ఆశగా చూసింది. "ఎలా చేస్తావు?"

నిధి ఆమె రెండు చేతుల్నీ పట్టుకున్నాడు. వేళ్ళు వ్యతిరేక దిశలో ఉండేటట్టు, ఆమె హస్తాలని ఒక దానిమీద ఒకటిగా – ఎదురెదురుగా పెట్టాడు. చిటి కెన వేళ్ళు ఒకదానిమీద ఒకటి ఉండేలా, రెండు చేతుల ఆరో వేళ్ళు ఒక్కటిగా ఉండేలా జరిపాడు.

"మంత్రం వేసి, ఆరో వేళ్ళని మాయం చేస్తా! కళ్ళు మూసుకో చిన్నీ!" అన్నాడు.

చిన్నీ కళ్ళు మూసుకుంది. నిధి బాకుని కుడి చేత్తో వాటంగా పట్టుకుని, చిన్ని వేళ్ళను తదేకంగా చూశాడు.

**(ఇంకా వుంది)**

# ఆస్తమా - నివారణ హోమియో చికిత్స

మానవుడు జీవించాలంటే ప్రతిక్షణం శ్వాసఎంతో ముఖ్యం.నీరు, ఆహారం లేకపోయిన కొన్ని రోజుల వరకు జీవించగలడు. కాని కొన్ని క్షణాలు శ్వాస లేక పోతే శరీరం నిర్జీవమైపోతుంది, స్వచ్ఛమైన గాలితో మంచి ఆరోగ్యం సమకూరుతుంది. ఆస్తమా వలన దైనందినజీవితంలోచాలాఇబ్బందులుఎదుర్కొం టూరు. ఏవైనా వాతావరణంలోమార్పులు, ఆహారంలో మార్పులు, కాలుష్యం, పొగత్రాగడంవలన ఆస్తమా, విజృంభిం చడంతో చాలా ఇబ్బందులు ఎదుర్కొం టూరు. ఎక్కడికి వెళ్ళాలన్నా అభద్రత భావనకు లోనవుతారు. ఆస్తమా వలన మరణించేవారు... పేదదేశాలలో, పేదకుటుంబా లలో ఎక్కువ. ఆస్తమా వలన హాస్పిటల్‌లో చేరే వారి సంఖ్య పిల్లలలో ఎక్కువ. ఆస్తమా అనగా సేచ్ఛ లేని శ్వాస, ఊపిరితిత్తులు, దీర్ఘకాలిక శ్వాసకోశ ఇబ్బందినే ఆస్తమా అంటారు. ముఖ్యంగా ఆస్తమా వ్యాధిగ్రస్తులలో అలర్జీ, రియాక్షన్ వల్ల శ్వాసకోశం లో, ఊపిరితిత్తులలో గాలి మార్గంలో శ్వాస పీల్చు కోవటంలో అవాంతరం ఏర్పడుతుంది. ఫలితం గా పిల్లికూతలు, దగ్గు, ఆయాసం, ఛాతీలో నొప్పి వస్తాయి. **ఆస్తమాకు ముఖ్య కారణాలు:** చల్లగాలి (చల్లటి వాతావరణం) దుమ్ము,ధూళి, పొగ(సిగరెట్) అలర్జెన్స్, గడ్డిచెట్లు, ఫంగస్, పొల్యూషన్ అధిక శారీరక శ్రమ వైరల్ ఇన్‌ఫెక్షన్ పిల్లి, గుర్రం, కుక్కవంటి పెంపుడు జంతువుల విసర్జక పదార్థాలు శ్వాసకోశ ఇన్‌ఫెక్షన్స్ ముఖ్యంగా పిల్లలలో... రోగ **నిర్ధారణ:** వంశానుగత చరిత్ర, అలర్జీలు, ఎగ్జిమా, చర్మవ్యాధులు, చిన్నతనంలో శ్వాసకోశ వ్యాధులు శారీరక పరీక్షలు, ముక్కు గొంతు, ఛాతీ పరీక్షలు ఎక్స్-రే, కఫం పరీక్ష, పీ.ఎఫ్.టీ అలర్జీ చర్మపరీక్షలు:. అలర్జెన్స్‌ను ఇంజెక్షన్ ద్వారా ఇచ్చి రియాక్షన్ చూడటం. **స్పైరోమెట్రీ:** శ్వాస మీటర్‌ద్వారా పరీక్ష గుండె, ఊపిరితిత్తులు, రక్త లోపం, కిడ్నీ వ్యాధులు, జీర్ణకోశ వ్యాధులు ఏవైనా ఉంటే వాటి నిర్ధారణ. ఆస్తమాతో జీవించడమెలా? 1.ఆస్తమాతో రోజు వారి పనులు చేసుకునేలా ప్రోత్సహించాలి. 2.రాత్రి, పొద్దున్న వచ్చే శ్వాస ఇబ్బందులను నివారించటం, నిర్మూలించటం, తగ్గించటం. 3.ఎక్కువ శారీరక శ్రమలేని ఉపాధి ఏర్పాటు చేసుకోవటం.4. దుమ్ము ధూళి, పొగ, చల్లటి వాతావరణం నుండి దూరంగా ఉండటం. 5.ప్లాస్టిక్ బ్యాగ్స్, కార్పెట్స్, బెడ్‌షీట్స్, బెడ్స్, బ్లాంకెట్స్‌లో డస్ట్‌మైట్స్ (చిన్నపరాన్నజీవులు) ఉంటాయి. కాబట్టి 10 రోజులకోకసారి ఎండలో వేయుటం, నీటితో శుభ్రం చేయడం. 6. పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం చేయాలి.

**రోగనివారణ:**బ్రాంకోడైలేటర్స్, కార్టికో,స్టీరాయిడ్స్, యాంటీబయాటిక్స్, స్ప్రేమందులు.. వీటి వలన వెంటనే ఉపశమనం కలుగుతుంది. కాని వ్యాధి మళ్ళీ తిరగబెడుతుంది. దీర్ఘకాలికంగా మందులు వాడటం వలన సైడ్‌ఎఫెక్ట్స్, పిల్లల పెరుగుదల లోపాలు, మానసికఆందోళన, జ్ఞాపకశక్తితగ్గటం,బరువు




**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**


పెరగటం వంటివి జరగవచ్చు. యోగా, మెడిటేషన్, చేయడం మంచిది. పొగత్రాగడం,కాలుష్య పదార్థాలకు దూరంగా ఉండటం. స్వచ్ఛ మైన గాలి, నీరు ఉన్న ప్రదేశాలలో నివసించటం బాగా సివియర్ ఆస్తమా వచ్చే వారిలో అది ఆ ప్రదేశం ప్రభావంవల్ల కావచ్చు. ఇలాంటప్పుడు వారు స్థిరపడిన చోటునుంచి వీలైతే ఇతర ప్రదేశానికి మారడం మంచిది.

**హోమియోవైద్యం:**ఈ వైద్యవిధానం ద్వారా ఆస్తమాకు చక్కటి చికిత్సను అందించవచ్చు. ముఖ్యంగా పిల్లలలో అలర్జీలు, శ్వాసకోశ ఇబ్బంది లకు... వారి శారీరక, మానసిక విశ్లేషణ ద్వారా తగిన కాన్‌స్టిట్యూషనల్ ఔషధాన్నిగుర్తించి చికిత్సజరిపితేవ్యాధిని సమూలంగా తగ్గించ వచ్చును.

**వాడదగిన మందులు:**

ఆంటమ్‌టార్ట్, ఆంటిమోనిమ్, ఆర్స్ ఆర్సెనిక్ ఆల్బ్, స్పాంజియా, నాట్రంసల్ఫ్, ఆరేలియా, కార్బొవెజ్.



# సంతానలేమి సమస్యకు పరిష్కారం సాధ్యమే

పాశ్చాత్యదేశాల్లోలాగే ఇప్పుడు మనదగ్గర కూడా పని సంస్కృతి విపరీతంగా పెరిగిపోయింది. తమరంగంలో రాణిం చడం కోసం రాత్రి-పగలు తేడా లేకుండా కృషి చేయడం అన్నది ఇప్పడొక సాధారణ అంశంగా మారింది. దాంతో సరైనవయసులో పెళ్లి కాక, పెళ్లైన వాళ్లలో కూడా పై కారణాల వల్ల మానసిక ఒత్తిడి విపరీతంగా పెరిగి సంతానం కలగ డానికి అవసరమైన హార్మోన్లస్రావాలుసరిగ్గా జరగక, సమస్యలు తలెత్తి, అవి సంతానలేమికి దారి తీస్తున్నాయి. అయితే ఆధునిక విజ్ఞానం పెరిగిన ఈ రోజుల్లో సంతానలేమికి చక్కటి పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి కనుక ఆందోళన చెందనవసరం లేదు.చాలామంది మహిళల్లో నెలసరి సమస్యలున్నా స్త్రీలలో భర్త కన్నా భార్య వయసు ఎక్కువగా ఉన్నా లేదా భార్యా భర్తలిద్దరూ ఎలాంటి సంతాన నిరోధక పద్ధతులు పాటించకుండా సంవత్సర కాలం పాటు సంతానం కోసం ప్రయత్నించినా గర్భధారణ జరగకపోవచ్చు. మరి కొంతమందిలో కేవలం ఏడాది మాత్రమే గాక.. ఏళ్లు గడుస్తున్నా గర్భం రాకపోవచ్చు. స్త్రీలకే కాదు.పురుషులకు కూడా.. సంతానం కలగలేదంటే అందుకు మహిళను కారణంగా చూపడం మన సమాజంలో పరిపాటి. ఇది కేవలం అపోహ మాత్రమే. సంతానలేమికి కారణాలన్నవి అటు మహిళలలోనూ, ఇటు పురుషుల లోనూ లేదా ఒక్కోసారి ఇద్దరిలోనూ ఉండవచ్చు. అంటేదంపతులిద్దరిలో లోపం ఎవరిలోనైనా ఉండవచ్చునన్న మాట. పురుషుల్లో వీర్యకణాల సంఖ్య తగినంతగా లేకపోవడం కూడా సంతానలేమికి కారణం కావచ్చు. అలాగే స్త్రీలలోనైతే హార్మోన్ల లోపం, థైరాయిడ్ సమస్య, పీసీఓడి వంటి అనేక అంశాలు సంతానలేమికి కారణం కావచ్చు. దంపతులిద్దరూ ఎలాంటి గర్భనిరోధక సాధనాలు వాడకుండా, సంతాన నిరోధక ప్రక్రియలను అనుసరించకుండా.. తమ దాంపత్య జీవితాన్ని గడిపితే సాధారణంగా ఏడాదిలోపు 75% మందిలో గర్భం వస్తుంది. ఇక యాభై శాతం మందిలో ఐదు మాసాల లోపే 50% మందిలో గర్భం వస్తుంది. రెండేళ్లలో 90% మందిలో గర్భం వస్తుంది. కానీ ఎవరిలోనైనా అంతకాలం తర్వాత కూడా గర్భం రాలేదంటే, ఏదైనా సమస్య ఉందేమోనని భావించాలి. సమస్యను తెలుసుకోవడానికి స్త్రీలు ముందుకు వచ్చి వైద్య పరీక్షలు చేయించుకున్నట్లుగా, పురుషులు అంత తేలిగ్గా ముందుకు రారు. సంతానలేమికి ముఖ్య కారణాలు.. మన జీవనశైలితో పాటు కాలుష్యం, వాతావరణం,పొగ తాగడం, మద్యం సేవించడం, బిగుతైన దుస్తులు ధరిం చడం, అధికబరువు, మానసిక ఒత్తిడి, కొన్ని రకాల మందులు, ఆరోగ్యకరమైన వీర్యం ఉత్పత్తిపై ప్రభావం చూపిస్తాయి. పురుషుల్లో శుక్రకణాల సంఖ్య తగినంతగా లేకపోవడం, ఉన్నా... వాటిలో తగినంత చురుకుదనం లేకపోవడం వంటి లోపాలు ఉన్నప్పుడు వారి భాగస్వామి కి గర్భధారణ జరగడం కష్టమే, మరికొందరి వీర్యంలో అసలుశుక్రకణాలేఉండకపోవచ్చు. ఇక మహిళ విషయా నికి వస్తే.. నెలసరి సమస్యలు, అండాల విడుదల సరిగా లేకపోవడం లేదా విడుదలైన అండాలలో నాణ్యత లోపించడం వంటివి ప్రధాన కారణాలు, వయసు పెరిగే కొద్దీ అబార్షన్లు అయ్యే అవకాశాలూ ఎక్కువే. మహిళ వయసు 30 ఏళ్లు దాటాక సంతాన అవకాశాలు తక్కువగా ఉంటాయి. సంతానలేమికి ఇప్పుడు అందుబాటులో ఉన్న ఆధునిక పరిష్కారాలు... సంతాన లేమి ఉన్న వారికి ఇప్పుడు మూడు రకాల పరిష్కారాలు అందుబాటులో ఉన్నాయి. అవి 1) ఐ.యు.ఐ.భర్తనుంచి సేకరించిన వీర్యాన్ని ల్యాబ్‌లో పరిశీలించి, దానిలో నుంచి ఆరోగ్యంగా, చురుగ్గాఉన్న కణాలను మాత్రం వేరు చేసి సిద్ధం చేస్తారు. వాటిని ఒక సన్నని గొట్టం ద్వారా స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశ పెడతారు. ఈప్రక్రియను అనుసరించడం వల్ల గర్భధారణకు 15% వరకు అవకాశం ఉంటుంది. ఇలా ఆరు రుతుచక్రాల పాటు ఈ చికిత్స చేసినా ఫలితం లేకుంటే అప్పుడు ఐ.వి.ఎఫ్ అనే ప్రక్రియను అనుసరించవచ్చు. 2)ఇక్సీ: స్త్రీ నుంచి సేకరించి న అండా ల్లోకి, పురుషుని శుక్ర కణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మానిప్యు లేటర్ సహాయంతో ప్రవేశ పెట్టి ఫలదీకరణం చెందిస్తారు. వాటిని తిరిగి గర్భాశయం లోకి ప్రవేశపెడతారు. ఈ పద్ధతి ద్వారా గర్భధారణ విజయవంతం కావడానికి 40% వరకు అవకాశాలు ఉంటాయి. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్నవారిలో ఈ ప్రక్రియ మరింత ఉపయోగకరంగా ఉంటుంది.

3) ఐ.వి.ఎఫ్: దీన్నే టెస్ట్‌ట్యూబ్ విధానం అంటారు. ముందు గాపక్వమైనఅండాలను స్త్రీ నుంచి బయటకుతీసి, పురుషుడి శుక్ర కణా లతో బయటే ఫలదీకరణం చెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలి దశపిండాల్లో రెండు లేదా మూడింటిని తిరిగి స్త్రీ గర్భా శయం లోకి ప్రవేశపెడతారు. ఈ ప్రక్రియ ద్వారా సంతానం కలగడానికి 30 నుంచి 35% విజయావకాశాలు ఉంటాయి. ఇటీవలి కాలంలో సంతాన సాఫల్యత చికిత్సలో మరెన్నో కొత్త విధానాలు అందుబాటు లోకి వచ్చాయి. ఫలదీకరించిన పిండాలలో అతిశీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత వాటిని వాడతారు. అవసరాన్ని బట్టి అండాలను గాని శుక్రకణాలను గాని దాతల నుంచి స్వీకరించి వాడతారు. అందుకే సంతానం కలగడం లేదని ఏళ్ల తరబడి బాధపడే కన్నా ఆధునిక పద్ధతులు అనుసరించడం శ్రేయస్కరం.


– డా॥ సి. జ్యోతి ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
ఫెర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం

## తురగా కృష్ణమోహనరావు హాస్యకథలపోటీలో రూ. 5,000 బహుమతి పొందిన కథ

**"పొద్దున పొద్దున్నే అప్పుకొచ్చానని ఏమీ అనుకోకు వదినా! ఓ ఎలకుంటే ఇస్తావా, రేపు బోన్లో పడగానే ఇచ్చేస్తా!"**

**"చాల్లేవమ్మా! మొన్న పట్టుకెళ్ళిన పందికొక్కుకు దిక్కులేదు మళ్ళీ ఎలుక కావాలా ఎలుకా? మాకు మాత్రం ఇట్టిట్టే పడి పోతున్నాయా బోనుల్లో? పాతబాకీ తీర్చకుండా మళ్ళీ అప్పుకెలా వస్తారమ్మా?"**

# ఎలుకలుకలుకలు

సరసి

"అంతమాటనకొదినా! ఎలుక కాకపోతే పోనీ ఓ చుంచునన్నా ఇవ్వు! నీ బాకీ బోనుల్లోపెట్టి తీర్చేస్తా! మా ఖర్మ కాకపోతే, రోజూ చక్కగా నేతి బజ్జీలు పెడుతున్నామమ్మా ఎరగా! ఒక్కటంటే ఒక్కటి పడట్లేదు. పడితే అడుగుతానా చెప్పు! పొద్దుట్నించి మీ అన్నయ్య ఎగశ్వాస దిగశ్వాసగా ఉన్నారు. డాక్టరు దగ్గరకెళ్ళాలి. ఎలుక లేకుండా డాక్టరు దగ్గరకెలా వెడతాం చెప్పు!".

***

డాక్టరు దగ్గర కెళ్ళడానికి ఒంట్లో జబ్బుండాలి! జేబులో డబ్బుండాలి! మరి ఎలకుండటమేమిటీ అని 'డవుటు' వస్తే గతంలోకి వెళ్ళాలి.

సరిగ్గా రెండేళ్ళ క్రితం డాక్టరు దుందుభి అమెరికా నించొచ్చి ఆ ఊళ్ళో ప్రాక్టీస్ పెట్టాడు. మొదట్లో పేషంట్లు ఎక్కువమంది వచ్చేవాళ్ళు కాదు. అమెరికా డాక్టరని పేరు బాగా ప్రచారం అయ్యేసరికి ప్రాక్టీస్ ఊపందుకుంది.

మొదట్లో పడిశం, దగ్గు, జ్వరాలకు మాత్రమే వైద్యం చేసేవాడు దుందుభి. తర్వాత తర్వాత అన్ని రోగాల వాళ్ళూ రాసాగారు. దాంతో మోకాళ్ళ నొప్పులూ, బీపీ, షుగరూ, గుండె నొప్పులకూ, కీళ్ళవాపులూ, ఆర్ష మొలలూ, వరిబీజం...ఇలా అన్ని జబ్బులకు వైద్యం చెయ్యసాగాడు.

మందులకోసం పాపం పేషంట్లు మళ్ళీ టౌనుకేం వెడతార్లే అని వాటిని కూడా తనే తెచ్చి స్టాకు పెట్టి పెద్దగా లాభం వేసుకోకుండా అమ్మసాగాడు. అలా కొద్దిరోజులుపోయాక పోనీ మందులు కూడా మనమే తయారుచేసి అమ్మితే ఎలా ఉంటుంది అన్న ఆలోచన వచ్చింది. ఆ ఆలోచన అతడి జీవితాన్ని మార్చింది!

అమెరికాలో రేట్సన్ అని ఓ ఫ్రెండున్నాడతనికి. అతడి వద్ద నించి మందు పౌడర్లు, నూనెలు తెప్పించి వాటితో మందుల తయారీకి ఉపక్రమించాడు. తయారైన మందులు ఎలా పని చేస్తున్నాయో పరీక్షించాలి.

ఒకవేళ డైరెక్టుగా మనుషులమీద ప్రయోగం చేస్తే, ఏ మందన్నా వికటించి ఎవడి ప్రాణాలన్నా 'హరీ' అంటే సరాసరి జైలుకు పోవడమే. ఇక చిప్ప కూడు తింటూ శేషజీవితం గడపాల్సొస్తుంది. మరేం చెయ్యాలి? ఏ మందు కనిపెట్టినా శాస్త్రజ్ఞులు ముందుగా ఎలుకలమీద ప్రయోగించి చూడటం అనూచానంగా వస్తోంది. మందు ఎలుకలకి పడితే మనిషికి పడ్డట్టే! అందుచేత ముందు ఎలుకల్నిపట్టి వాటికి మందులు పెట్టాలని



రేట్సన్ సలహా ఇచ్చాడు.

దుందుభి ఎన్నడూ ఎలుకల్ని పట్టెరగడు! ఇప్పుడు కొత్తగా నేర్చుకోలేడు! ఎలా మరి? అందుకని ఒక రిద్దరు పేషంట్లకి చెప్పాడు ఎలుకల్ని తెచ్చి పెట్ట మని. వాళ్ళు నాలుగైదు మూషికాల్ని తెచ్చిచ్చారు. అవేం చాల్తాయి? ఒక మందు ఏ స్థాయిలో ఏ విధంగా పని చేస్తుంది, ఏ వయసు వారికి పడు తుంది, ఎంత మోతాదులో ఇస్తే పని చేస్తోంది, దాని ప్రభావం హెచ్చుతగ్గులు ఏవిటి అనేది చూడా లంటే చాలా ఎలుకలు కావాలి. పైగా విభిన్న 'మూషికత్వాలు' కలిగిన వాటిని పరిగణనలోకి తీసుకోవాలి.

ఇంటి వెనక ఓ పెద్ద రేకులషెడ్డు వేయించి, కోళ్ళ ఫారంలాగా 'ఎలుకల ఫారం' కట్టించాడు. సన్న ఊచలతో ఛాంబర్లు ఏర్పాటుచేశాడు. కొన్నివేల ఎలుకలకి వసతి కల్పిస్తూ గదులు కట్టించాడు.

అంతవరకూ అతనివద్దకు వచ్చే పేషంట్లు 'కన్సల్టేషను ఫీజు'గా వంద రూపాయలు కడు తున్నారు.

'ఎవరన్నా ఎలుకని తెచ్చిస్తే కన్సల్టేషను సొమ్ము కట్టనవసరం లేదు' అని ప్రకటించాడు దుందుభి. ఎలుకల్ని సంపాదించడానికి అంతకంటే మంచిమార్గం తోచలేదతనికి.

ఇంకేం, పేషంట్ల పంట పండింది. పండిన పంటనేకాదు, పొలాల్లోనూ ఇళ్ళల్లోనూ ఎలుకలు విధ్వంసం సృష్టిస్తూ కోకొల్లలుగా తిరుగుతున్నాయి ఊరు నిండా. ఆ రోజునుంచి ప్రతివాడూ రాత్రి పూట బోనులుపెట్టి ఎలుక పడగానే పుచ్చుకుని డాక్టరువద్దకు రావడం, దాన్ని ఇంటివెనక ఫారంలో జమకట్టి, డబ్బుకట్టకుండా వైద్యం చేయించుకుని వెళ్ళిపోవడం ప్రారంభించారు.

ఈ విధంగా ప్రారంభమైన 'నగదు రహిత లావాదేవీ' బాగా క్లిక్ అయింది!

రోజురోజుకూ ఎలుకల ఫారంలో ఎలుకల సంఖ్య గణనీయంగా పెరగసాగింది. దుందుభి ఆనందం కూడా అదే లెవెల్లో పెరగసాగింది!

కొత్తగా వచ్చిన ప్రతి ఎలక్కీ 'మూషికత' (వ్యక్తి గత అనకూడదు) గుర్తింపు సంఖ్యనిచ్చి, వాటికి కేటాయించిన ఛాంబర్లో వదిలిపెట్టేవాడు. ఒక్కో ఛాంబర్లో పాతిక ముప్ఫయ్ ఎలుకలకి వసతి కల్పించి, వాటన్నిటికీ ఒకే రకమైన తిండి, మందు ఇచ్చి ప్రయోగాలు ప్రారంభించాడు. ఎప్పటికప్పుడు వాటి వివరాలు, వాటి శరీరాల్లో రోజురోజుకూ వస్తున్న మార్పులు, ప్రవర్తనల్లో తేడాలు అన్నీ రిజిస్టర్లో నోట్ చేసుకోవడం ప్రారంభించాడు.

ఇదిలా వుండగా, ఊళ్ళో రచ్చబండలవద్దా పంచాయతీ ఆఫీసు దగ్గరా డాక్టరుగారు చేస్తున్న ప్రయోగాల గురించి చర్చోపచర్చలు జరగసాగాయి. "మందులు ఎలుకలమీదే ఎందుకు ప్రయోగించాలి? కుక్కలూ పిల్లులూ పనికి రావా?" అన్న ప్రశ్న వచ్చింది. "ఎలుకలకీ మనుషులకీ అవినాభావ సంబంధం ఉంది. మనిషి బుద్ధులు చాలా ఉన్నాయి ఎలుకకి. దొంగచూపులు చూడటం, పగలంతా 'కామ్'గా ఉండి చీకటిపడగానే దొంగపనులకి బయల్దేరడం, ధాన్యం, పప్పులూ చాటుగా బొక్కెయ్యడం, అండర్ గ్రౌండులో దాక్కోవడం; పరిమితి లేకుండా సంతానాన్ని కనడం....ఇలా చాలా ఉన్నాయయ్యా! అంతెందుకూ, 'పందికొక్కులా ఉన్నావ్' అని మనుషుల్ని అంటాంగానీ జంతువుల్నీ పక్షుల్నీ అనం కదా! అంచేత ఎలుకలమీద ముందు ప్రయోగించి వాటికి ఆ మందులు పడితే మనక్కూడా పడతాయని శాస్త్రజ్ఞులు నిర్ధారించారు. అయినా ఆయన ప్రయోగాలు కుక్కమీదచేస్తే ఏం? నక్క మీద చేస్తే ఏం? మనకి డబ్బు ఖర్చు లేకుండా వైద్యం చేస్తున్నాడుగా! చాలదా?" అన్నాడొక పెద్దాయన.

దరిమిలా జబ్బున్న వాళ్ళేకాదు, ఉందేమోనని



అనుమానం ఉన్నవాళ్ళు కూడా 'ఏం పోయిందిలే ఓ ఎలుకేగా' అనుకుని ఎలుకనిచ్చి వైద్యం చేయించు కోసాగారు. ఎలుకలు ఎక్కువైనవాళ్ళు అవి దొరకని వాళ్ళకి సరసమైన ధరలకు అమ్ముకుంటున్నారు. మరోపక్క బోనుల సైడు బిజినెస్ కూడా ఊపందు కుంది. ఊరంతా ఎలుకల కలకలంతో కళకళలాడు తోంది!

ఎవరింటికైనా స్నేహితులుగానీ, బంధువులు గానీ పలకరించడానికో చుట్టం చూపుగానో వెడితే ఉట్టి చేతుల్తో వెళ్ళకూడదని బోనులో ఓ ఎలుకని పట్టుకెళ్ళి ఇవ్వడం చేస్తున్నారు. 'పత్రం పుష్పం ఫలం తోయం' అన్నదానికి 'మూషికం' అని కొత్త పదం చేర్చారు.

అలాగే ఇంటికొచ్చిన ముత్తయిదువలు తిరిగి వెళ్ళిపోయేటప్పుడు ఇంటి ఆడవాళ్ళు వారికి బొట్టు పెట్టి ఓ పండో, రవికెలగుడ్డముక్కో ఇచ్చేవారు గతంలో. ఇప్పుడది పోయింది. బొట్టుపెట్టి ఓ ఎలుకనో, చుంచునో ఇవ్వడం అలవాటుగా పెట్టుకున్నారు.

స్కూళ్ళల్లో విద్యార్థులకి ఆటల పోటీలు, వక్తృత్వ పోటీలు వంటివి పెట్టి ఫస్టుప్రైజు వచ్చినవారికి పంది కొక్కుని, సెకండు ప్రైజుగా ఎలుకని, తరుడు ప్రైజుకి చుంచును ఇవ్వడం ప్రారంభించారు. 'కన్సో లేషన్' ప్రైజులు వచ్చిన వారికి చిట్టెలుకల్ని ఇచ్చి సంతోష పెడుతున్నారు!

పెళ్ళిళ్ళల్లో 'రిటర్న్ గిఫ్టులు'గా చిన్న చిన్న ఎలు కల్నిస్తున్నారు.

'వెనకటికొకడు పందికొక్కు బాకీని ఎలుకతో తీర్చాట్ట!'

'ఎలుకొచ్చిన వేళ పందికొక్కొచ్చిన వేళ' వంటి సామెతలు పుట్టుకొచ్చాయి!

'ఈరోజు ఒక ఎలుకని జమకట్టండి...వారం తర్వాత రెండు ఎలుకల్ని స్వంతం చేసుకోండి!' అంటూ కొత్త స్కీములు ప్రారంభమయ్యాయి.

ఒకసారి ఆస్పత్రికి తీసుకురాలేని ఒక పేషంటు కోసం దుందుభిగారిని ఇంటికి తీసికెళ్ళాడొకాయన. వైద్యం అయిపోయాక "డాక్టరు గారూ, మా ఇంట్లో ఎప్పట్నించో ఓ పోతు పందికొక్కు తిరుగుతోం దండీ! ఆ చేత్తోనే కాస్త దాన్ని పట్టి పట్టుకెళ్ళిపోండి సార్! నాకు దొరకట్లేదు!" అన్నాడు. నేను పరిశోధ నలు చేసేవాడినేగానీ పందికొక్కుల్ని పట్టేవాడిని కాను" అంటూ రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు దుందుభి.

"డాక్టరుగారూ! ఎలాగూ ఎలుకలమీద ప్రయో గాలు చేసి కొత్త విషయాలు కనుక్కుంటున్నారు కదా....' ఎలుక తోకతెచ్చి ఏడాది ఉతికినా నలుపు నలుపేగాని తెలుపురాదు' అన్నారు కదా! ఎందుకు రాదో అది కూడా పరిశోధించి కనుక్కోండిసార్ పనిలో పనిగా" అని ఉచిత సలహా ఇచ్చాడు ఇంకొకడు.

"మీరు ఎలుకలకి చేస్తున్న సేవ ఊరికేపోదు డాక్టరుగారూ! దేవుడు తప్పకుండా కరుణించి వచ్చే జన్మలో మిమ్మల్ని వినాయకుడి వాహనంగా పుట్టిం చకపోడు. వర్రీ కాకండి!" అంటూ ఓదార్చేవాడొకడు.

ఎప్పుడు ఏం జబ్బు వస్తుందో ఏమో అని చాలామంది ముందుజాగ్రత్త చర్యగా ఎలుకల్ని పట్టి బోనుల్లో దాచుకోసాగారు. అలా దాచుకున్న ఒకాయన ఇంట్లో, ఆయన కూతురికి పెళ్ళి జరిగింది. పెళ్ళికొడుకు మనుగుడుపుల 'కార్యక్రమం' కోసం మూడురోజులుందామని ఎంతో ఆశగా వచ్చాడు. అయితే ఒకరోజు కాగానే అతడిని వెనక్కి పంపే శారు. ఎందుకంటే అతగాడివి పిల్లికళ్ళట! పైగా రాత్రిపూట నిద్రలో పిల్లికూతలట! ఇంట్లో ఎలుక లన్నీ భయపడిపోతున్నాయట! అందుకని.

ఎక్కువ ఎలుకలున్న ధనవంతుల్ని 'మూషిక మహరాజ్' అని పిలిచేవారు గ్రామస్తులు. అక్రమ ఆస్తులు సంపాదించారని వారిపై కొందరు ఫిర్యా దులకు సిద్ధమయ్యారు.

మరోపక్క, దుందుభిగారి ఇలాకాలో పరిశోధ నలు మంచి ఊపుమీద సాగుతున్నాయి. రోజూ ఉదయాన్నే వెళ్ళి అటెండెన్సు తీసుకుని రిజిస్టర్లో టిక్కు పెట్టుకోవడం, ఏ ఏ ఎలుకకి ఏ సమయంలో ఎంత ఆహారం పెట్టాలో, ఆ వివరాలతోబాటు వాటిల్లో వస్తున్న మార్పుల్నీ, ఆరోగ్యపరిస్థితుల్నీ ఎప్పటి కప్పుడు రిజిస్టర్లో నోట్ చేసుకునేవాడు దుందుభి.

గింజలూ, పప్పులూ, పళ్ళ ముక్కలూ, రసాలతో పాటు అప్పుడప్పుడు స్వీట్లు, వండిన అన్నం ఇలా వేటికి ఏవి పెట్టాలో పెట్టి, ఎన్నాళ్ళ నించి అవి తింటున్నాయో రిజిస్టర్లో రాసుకునేవాడు.

తిండితోబాటు కొన్ని ఎలుకలకి సినిమా సంగీతం, కొన్నింటికి శాస్త్రీయ సంప్రదాయ కీర్త నలు, కొన్నిటికి పాప్ మ్యూజిక్కు వినిపించేవాడు. కొన్ని కథలు వినేవి. కొన్ని కార్టూన్లు మెచ్చుకునేవి. కొన్ని రాజకీయాలు ఇష్టపడితే కొన్ని లఘుశంకచేసి తమ అయిష్టతను తెలిపేవి. కొన్ని గదులముందు చిన్న టీవీపెట్టి తెలుగు సీరియల్స్ చూపించేవాడు. కొన్ని ఎలుకలకి ప్రత్యేకంగా తయారుచేసిన సెల్ ఫోన్సు ఇచ్చాడు. విత్ వైఫై! త్వరలో చిన్నసైజు కంప్యూటర్లు కూడా అందుబాటులోకి తెస్తాడని సమాచారం!

**ఎలుకలతో కళకళలాడిపోతోందా ఊరు. అక్కడ డాక్టరు ఎలుకని ఫీజుగా పుచ్చు కుంటాడు! సరసమైన ధరలకే అక్కడ ఎలు కల్ని అమ్ముతారు. స్కూళ్ళల్లో పోటీలుపెట్టి విద్యార్థులకు పందికొక్కులు, ఎలుకలు, చిట్టెలుకల్ని బహుమతులుగా ఇస్తారు. అక్కడ బంధువులిళ్ళకెవరూ వట్టి చేతులతో వెళ్ళరు. ఆడవాళ్ళకి బొట్టుపెట్టి, రవికెలగుడ్డ బదులు ఎలుకనిచ్చి పంపుతారు! ఏమిటీ ఉల్టాపల్టా? అసలు ఆ ఊళ్ళోవాళ్ళకేమైంది?**

వీటన్నిటికీ దుందుభి భార్య కుముద్వతి సహ కారం ఉందని చెప్పకతప్పదు. ఒక్కోసారి భర్తపై చిరాకుపడినా, బండబూతులు తిట్టినా ఎలుకలపట్ల మాత్రం ఉదాసీనంగా ఉండేది. ప్రతి పురుషుడి విజయం వెనుకా ఒక స్త్రీ ఉంటుందని, ఆ స్త్రీ తనే కావాలని ఆమె ఆకాంక్ష.

అయితే ఒకసారి కొన్ని కుర్ర ఎలుకలు కుము ద్వతికి కన్ను కొట్టాయని, కొన్ని ఆమెనుచూసి ఈల వేశాయని చెప్పి వాటికొక రోజు తిండి పెట్టకుండా మాడ్చింది. దాంతో ఎలుకలన్నీ దారికొచ్చాయి. చాలా ఎలుకలమీద మందుల ప్రభావం కనిపించసా గింది. కొన్ని హుషారుగా ఉంటే, కొన్ని స్తబ్దుగా పడి ఉంటున్నాయి. కొన్ని తిక్కరేగినట్లు అరుస్తూ పిచ్చి గంతులేస్తే, కొన్ని అదేపనిగా నిద్రపోతూ తిన డానికి కూడా బద్ధకిస్తున్నాయి. కొన్ని వెర్రిచూపులు చూస్తూ కాలక్షేపం చేస్తున్నాయి. వాటివాటి ప్రవర్త నల్నిబట్టి మందుమార్చడమో లేక మోతాదులు హెచ్చుతగ్గులు చేయడమో చేస్తున్నాడు దుందుభి.

ఇదిలా ఉండగా, ఆ గ్రామ సర్పంచిగారు ఓ పిల్లిని పెంచుకుంటున్నారు. ఈ మధ్య అది చిక్కి పోతోందట! చికెను తినట్లేదట, పాలు తాగట్లేదట! ఎలుకలే కావాలని నిరాహార దీక్ష చేస్తున్నదట!

ఓ రోజు సర్పంచిగారు దుందుభిగారి ఫారా నికి విచ్చేశారు. డాక్టరుగారిని, ఆ తర్వాత ఎలుకల్ని పరామర్శచేసి కుశలప్రశ్నలు వేశారు అలవాటుగా. ఎలుకలమీద తయారవుతున్న పరిశోధనాగ్రంథాన్ని చూసి మెచ్చుకున్నారు. మాటలద్వారా ఆయన సర్పంచిగారని తెలుసుకున్న కొన్ని ఎలుకలు ఆయ నతో సెల్ఫీ దిగే ప్రయత్నం చేశాయి.

"డాక్టరుగారూ, నాకు విపరీతమైన మోకాళ్ళ నొప్పులు. వయసుచూస్తే డెబ్బై! మీరేమో కుర్ర



ఎలుకల మీద ప్రయోగాలుచేసి ఆ మందులు పని చేస్తాయని ఇస్తే ఎలా?" అన్నారు సర్పంచిగారు నవ్వుతూ.

"అయితే డెబ్బై ఏళ్ళ పందికొక్కేవన్నా దొరికితే పంపించండి. దానిమీదే ప్రయోగించి ఆ మందు మీకు పంపుతా!" అన్నాడు దుందుభి చిరెత్తి.

పెద్దాయన తెలివిగా నవ్వేశాడు. "డాక్టరు గారూ, అసలు విషయానికొస్తా. మా పిల్లి ఎలుకల కోసం తహతహలాడిపోతోంది. మీ దగ్గర వేల ఎలుకలున్నాయి. వాటిని ఇవ్వమని అడగను. మీ పరిశోధనలు అయిపోయిన వాటిని, అనగా అన్ని పరీక్షలు పూర్తయిపోయి ఎందుకూ పనికిరాని ఎలు కల్ని రోజుకి రెండోమూడో మా పిల్లికి పంపరాదా? అవి మీకు ఎలాగూ ఉపయోగపడవు కదా!" అన్నారు సర్పంచిగారు. "ఎంతో కొంత మూషిక పారితోషికం కూడా పంపుతా ఊరికే వద్దులెండి!" అన్నాడు మళ్ళీ తనే.

"పరిశోధనలు అయిపోయినవి పనికిరావని ఎవరు చెప్పారండీ? అవసరం తీరగానే అమ్మేసేవి కావండీ అవి. మనం ఇలా మాట్లాడితే వాటి మన సులు విరిగిపోతాయి. ఎన్నో వేల ఎలుకల జీవిత త్యాగ ఫలితమేనండీ ఈ రోజు మనం వాడుతున్న మందులు! వాటి సేవ అజరామరమైనది! నిజానికి ప్రతి ఊళ్ళో ఓ ఎలుక శిలా విగ్రహం నెలకొల్పి నివాళులర్పించాలి!" అంటూ ఆవేశంగా మాట్లా డాడు దుందుభి.

సర్పంచిగారు పంచె సర్దుకుంటూ వెళ్ళి పోయారు కోపంగా!

ఆ మర్నాడు జీవసేవాసంఘ సభ్యులమని కొందరు ఊళ్ళోకి దిగారు. ఎలుకల్ని ఇలా నిర్బంధిం చడం నేరమని వాదించారు. వాళ్ళల్లో చాలా మందికి షుగరూ, మోకాళ్ళనొప్పులూను. వారికి ఉచితంగా మందులిచ్చేసరికి మారు మాట్లాడ కుండా వెళ్ళిపోయారు. ఈలోగా ఢిల్లీలో 'వరల్డు సింపోజియం ఆన్ రాట్ బిహేవియర్ జరగబోతోం దనీ, దానికి రమ్మనీ ఆహ్వానం అందింది దుందు భికి. దుందుభి ఉత్సాహంగా వెళ్ళాడు, ఫారం డ్యూటీ కుముద్వతికి అప్పజెప్పి.

ఇంతలో వినాయకచవితి వచ్చింది. ఊరంతా పందిళ్ళు వేసి గణేశ నవరాత్రులు కోలాహలంగా ప్రారంభించారు.

చందాకోసం కొందరు యువకులు కుముద్వతి వద్దకొచ్చారు. "మేడం! మేం తొమ్మిదిరోజులపాటు ఉత్సవాలు చేస్తున్నాం. మీకు తోచిన చందా ఇవ్వండి. అలాగే వినాయకుడి పాదాలవద్ద బొమ్మ ఎలుక కాకుండా ఈసారి నిజం పందికొక్కుని బోనులోపెట్టి పెడదాం అనుకుంటున్నాం. కాబట్టి మీరొక మంచి పందికొక్కునివ్వాలి. తొమ్మిది రోజులూ కాగానే మీకు దాన్ని భద్రంగా తెచ్చి ఇచ్చేస్తాం! అంతేకాదు రోజుకి యాభైరూపాయల చొప్పున 'రాట్ రెంట్' కూడా పే చేస్తాం. ఏవంటారు మేడం?" అన్నారు ఆశగా.

కుముద్వతి ఆలోచనలో పడింది. తన భర్త నగదు రహిత లావాదేవీలు ప్రారంభించినప్పట్నుంచి ఎలు కలేగానీ డబ్బులు చేతిలో పడట్లేదు. అందువల్ల తనకి పాకెట్‌మనీ కూడా ఇవ్వడం లేదు. అతడు ఎలాగూ ఊళ్ళో లేడు కాబట్టి ఈలోగా ఎలుకల్ని అద్దెకిచ్చి ఎంతోకొంత క్యాష్ చేసుకుంటే ఎలా ఉంటుంది అనుకుని, బాగానే ఉంటుందిలే అను కుంది. అనుకుని ఏపుగా పెరిగిన ఓ పందికొక్కుని అద్దెకిచ్చింది.

ఇది తెలిసి మిగతా పందిళ్ళవాళ్ళు కూడా వచ్చి కొన్ని పందికొక్కుల్ని అద్దెకు పట్టుకుపోయారు. అలా ఇంచుమించు ఓ పాతిక పందికొక్కులు బయటకు పోయాయి. వచ్చే డబ్బు లెక్కపెట్టుకుంటూ కుము ద్వతి మురిసిపోసాగింది.

పందిళ్ళల్లో చేరిన పందికొక్కుల్ని సాక్షాత్తూ వినాయకుడి వాహనంగా భావించిన భక్తులు వాటికి పళ్ళు, నేతి మిఠాయిలు, జీడిపప్పుపాకం వంటివి పెట్టి దండాలు పెట్టుకునేవారు. అన్నీ తిని తిని ఆ తొమ్మిదిరోజుల్లో అవి మరింత ఒళ్ళు చేశాయి.

దుందుభి ఢిల్లీనుంచి రావడానికి ముందే

## మనమీదేసర్రోయ్!

సరసి





# దిష్టి తీసిన కాజల్

**ఓ** మామూలు అమ్మాయిలా కాజల్ అందరి ముందూ ప్రవర్తించింది అంటున్నారు సినీ జనాలు. ఇంతకీ అసలు సంగతేమిటంటే 'నేనే రాజు నేనే మంత్రి' ప్రమోషన్లలో రానాతో పాటు కాజల్ కూడా పాల్గొంది. ఇందులో వింతేమీ లేదు. కాకపోతే ఆ సందర్భంగా 'తన రాజుకి(రానా) అందరూ దిష్టి పెడుతున్నారంటూ దిష్టి తీసింది. దీన్ని రానా తేలిగ్గా తీసుకున్నా సినీ జనాలు మాత్రం తీసుకోలేకపోతున్నారు. ఇద్దరి మధ్యా ఎంత చనువు లేకపోతే కాజల్ అందరి ముందూ అలా ప్రవర్తిస్తుంది అంటున్నారు. కాకపోతే అదంతా ప్రమోషన్ల ట్రిక్ అని కాజల్, రానా సన్నిహితులు కొట్టి పారేస్తున్నారు. కాజల్‌లాగా మిగతా హీరోయిన్లు కూడా ప్రవర్తిస్తే? అన్న అనుమానాన్ని మరికొందరు వ్యక్తం చేస్తున్నారు. ఇకపోతే ఈ సినిమా ప్రచారానికి కాజల్ ప్రత్యేకించి కొంత సొమ్ము తీసుకుందనే ప్రచారం జోరుగా సాగుతోంది. అందుకే ఎన్నడూ లేనంతగా ఈ సినిమాని ప్రచారం చేసిందని అంటున్నారు.

బయటకెళ్ళిన పందికొక్కులన్నీ తిరిగి వచ్చేశాయి. వాటి విహార ఆహార యాత్ర గురించి భర్తకి తెలియకుండా జాగర్తపడింది కుముద్వతి.

ఈలోగా హాలీవుడ్‌నుంచి స్టీల్‌బర్గ్ అనే డైరెక్టరు దుందుభికి ఫోన్‌చేసి తాను ఎలుకలమీద తీస్తున్న 'రాట్‌పార్క్' అనే సినిమా క్లైమాక్సు సీన్లు ఇక్కడ కొచ్చి తీసుకుంటానని అడిగాడు. ఈ విషయం ప్రెస్సు వాళ్ళకి తెలిసి పేపర్లలో వేశారు. కొందరు దుందుభి ఎలుకలఫారం గురించి ప్రత్యేక కథనాలు ప్రచురించారు.

ఈ విధంగా దుందుభి కీర్తి నలుదిశలా పాకిపోతుండటం సర్పంచిగారికి కంటగింపయింది. ఇలా వదిలేస్తే దుందుభి బాగా పాపులర్ అయిపోయి తర్వాత ఎన్నికలలో తనకు పోటీగా నిలిచి గెలిచినా గెలుస్తాడని భావించి దుందుభిని ఎలా అడ్డుకోవాలా? అని ఆలోచించాడు.

"పొలాల్లో తిరిగే జంగురు పిల్లుల్నీ, బావురు పిల్లుల్నీ ఓ ఇరవయ్యో పాతికో సంపాదించి డాక్టరు గారి పెరట్లో వదిలేద్దాం సార్! రాత్రి తెల్లవార్లూ అవి ఎలుకలకి మనశ్శాంతి లేకుండా అరుస్తూ బోనులచుట్టూ తిరుగుతాయి! అదను చూసి ఎప్పుడో వాటి మీద దాడిచేస్తాయి" అని సలహా చెప్పాడు సర్పంచిగారి సహాయకుడు.

"ఏడ్చినట్టుంది నీ సలహా! మళ్ళీ పిల్లుల్ని పట్టే పనొకటా మనకి? అలాక్కాదు. మన గంగుల్ని పంపి అర్థరాత్రి వేళ ఆ ఎలుకల బోనుల తలుపులన్నీ తెరిపించేద్దాం. ఎలుకలన్నీ పారిపోతాయి. అలాగే ఆ పరిశోధనాగ్రంథాన్ని కూడా తెప్పించి ముక్కలు ముక్కలుగా చింపిపారేస్తే సరి!" అన్నారు సర్పంచిగారు మీసం రాసుకుంటూ. ఆ రాత్రే అందుకు ముహూర్తం పెట్టారాయన.

ఓ రాత్రివేళ ఉలికిపడిలేచాడు దుందుభి! ఏదో చప్పుడైంది! ఎలుకల కలకలం వినిపిస్తోంది. చటుక్కున మంచం దిగి పెరట్లోకి వెళ్ళాడు.

అప్పటికే ఘోరం జరిగిపోయింది. ఎవరో ఎలుకల ఛాంబర్ల తలుపులన్నీ తెరిచేశారు! ఎలుకలన్నీ కిందకి దూకి పారిపోతున్నాయి. దుందుభికి గుండె పగిలినంత పనైంది. ఆత్రుతగా అటూఇటూ పరుగులు పెట్టాడుగానీ పారిపోతున్న ఎలుకల్ని ఎలా కట్టడి చేయగలడు?

కొన్ని ఎలుకలు అతనిమీదనించి దూకేస్తున్నాయి. కొన్ని అతని కాళ్ళ మధ్యనించి పారిపోతున్నాయి. కొన్ని కేరింతలు కొడుతూ పరుగెడుతున్నాయి. ఒక ఎలుక దుందుభి మీదకిదూకి అతడి చొక్కా కొరికి చింపేసి పోయింది. మరొకటి అతడివీపుని గీరేసి దూకేసింది. కొన్ని అతడి కాళ్ళదగ్గర నిలబడి చేతులు జోడించి నడుచుకుంటూ వెళ్ళాయి! కొన్ని కళ్ళ నీళ్ళెట్టుకున్నాయి!!

దుందుభి నీరసంగా కూలబడిపోయాడు. ఎవరు చేశారీ పని? దీనివల్ల వాళ్ళకేం లాభం? తన పరిశోధన చివరికి వస్తున్న దశలో ఏవిటీ విఘాతం? అనుకుంటూ కనీసం రిజిస్టరైనా జాగ్రత్తగా ఉందా అని గుర్తుకొచ్చి అటువైపు వెళ్ళాడు.

సరిగ్గా అదే సమయంలో రిజిస్టరు దాచిన బల్ల సొరుగులాగి రిజిస్టరును బయటకు తీస్తున్నాడొకడు చీకట్లో. ఆ దృశ్యం కంటబడేసరికి దుందుభి రక్తం ఉడికిపోయింది.

అమాంతం ముందుకురికి ఆ వ్యక్తిని పట్టుకోబోయాడు. అతడు విదిలించుకుని పారిపోయాడు. దుందుభి ముందుకురికి పడిపోతూ అతడి రెండు కాళ్ళనూ ఒడిసి పట్టుకున్నాడు గట్టిగా. బలంగా లాగి అతడిని పడగొట్టే ప్రయత్నంలో ఉండగా ఆ వ్యక్తి రిజిస్టరుతో దుందుభి నెత్తిమీద బలంగా మోదాడు!

అంతే! కళ్ళు బైర్లుకమ్మాయి దుందుభికి! కళ్ళు నులుముకుని ఆ వ్యక్తి వంక చూశాడు. చూస్తూనే నోరు వెళ్ళ బెట్టాడు! ఆ వ్యక్తి ఎవరో కాదు. కుముద్వతి!!

"కుమ్మూ! నువ్వా?" ఆశ్చర్యంతో అరిచాడు.

"అవును నేనే!"

"ఎందుకిలా చేశావ్ కుమ్మూ? అభం శుభం తెలియని ఆ ఎలుకలు నీకేం అపకారం చేశాయ్? నా పరిశోధననెందుకు మంట కలపాలని చూశావ్?" అన్నాడు ప్రాధేయపూర్వకంగా!

"అంటే మీకింకా మెలకువ రాలేదన్నమాట!" అంటూ చేతిలో ఉన్న ఏసీ రిమోటుతో భర్త నెత్తి మీద ఒక్కటిచ్చింది!

"ఎలుకలేమిటీ? పరిశోధనేవిటీ? ఇప్పుడిప్పుడే నాకు నిద్ర పడుతోందనుకుంటూ ఉంటే నన్ను గట్టిగా పట్టుకుని, కాళ్ళుచ్చుకుని మంచంమీంచి కిందికి లాగేసిందే కాకుండా, ఈ పిచ్చివాగుడేవిటి? ఇది కూడా చాల్లేదా? ఇంకోటివ్వనా?" అంటూ రిమోటును పైకి లేపింది.

విషయం అర్థమైంది దుందుభికి! పిచ్చి వాగుడు కట్టిపెట్టి సైలెంటైపోయాడు.

రెండు నిమిషాలు పోయాక తేరుకుని గ్లాసుడు మంచినీళ్ళు తాగి అన్నాడు.

"మనం ఇండియా వెళ్ళిపోవాలనీ, వెళ్ళిపోయాక అక్కడ ఏదో పల్లెటూళ్ళో సెటిలై పేద తెలుగు ప్రజలకి వైద్యం చేస్తూ ఉండిపోదామనీ అనుకున్నాం కదా! రాత్రి పడుకోబోయే ముందు ఇదే ఆలోచిస్తూ పడుకున్నానేమో భలే కలొచ్చింది" అన్నాడు.

"కలా ఏం కలా?" అడిగింది కుముద్వతి కాళ్ళ మీది చీర సరిచేసుకుంటూ.

"భలే కల! ఎలుకల కల!" అన్నాడు దుందుభి నెత్తిమీది దెబ్బని చేత్తో రాసుకుంటూ!

**సెల్: 94405 42950**

## సరదాగా....

### ఎందుకు?

రాకేష్ ప్రతీ శుక్రవారం గుడికి వస్తుంటాడు. వచ్చినప్పుడల్లా వెంట ఓ అమ్మాయి ఉంటుంది. దర్శనం అయిన తరువాత ఆ అమ్మాయికి ప్రపోజ్ చేస్తాడు రాకేష్. ఆ అమ్మాయేమో అతనివంక చూడకుండా వెళ్ళిపోతుంది. ప్రతీవారం ఇదే తంతు. ఆ గుడి పూజారి ఇదంతా గమనించి, విషయమేంటో తెలుసుకోవాలనుకున్నాడు. ఓ రోజు ఒంటరిగా వచ్చిన రాకేష్‌ని పూజారి పక్కకి పిలిచి అడగనే అడిగేశాడు. "బాబూ, ప్రతివారం చూస్తున్నాను. అమ్మాయిని తీసుకొస్తావు. ఐ లవ్ యూ చెబుతావు. ఆ అమ్మాయేమో ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోతుంది. అసలేం జరుగుతోంది? నువ్వు అమ్మాయిలను గుడికే ఎందుకు తీసుకొస్తున్నావు? ఏ పార్కులోనో, ఐస్‌క్రీం పార్లర్‌లోనో నీ ప్రేమ విషయం చెప్పాలిగానీ...". దానికి రాకేష్ "అదేం లేదు పూజారిగారూ... ఏ పార్క్‌కో, బీచ్‌కో, రెస్టారెంట్‌కో తీసుకువెళ్ళి ప్రపోజ్ చేస్తే, చెప్పులు తీస్తున్నారు. గుడిలో అయితే చెప్పులు నాట్ అలౌడ్ కదా! అందుకనన్నమాట!"

### ఒక ప్రశ్న?

సూర్యోదయం కాకముందే నిద్రలేచాడు చింటూ. చక్కగా తలంటుస్నానం చేసి, కొత్తబట్టలు వేసుకుని, తండ్రితోపాటు బజారుకి వెళ్ళాడు. ముందురోజే వినాయకుడికి ఎలా పూజ చేయాలో గూగుల్ సెర్చ్ చేశాడు. కావలసినవన్నీ ముందే రాసిపెట్టుకున్నాడు. పర్యావరణ హితంగా మట్టిగణపయ్యే కావాలన్నాడు. 21 రకాల పత్రి తీసుకునేదాకా ఊరుకోలేదు చింటూ. కావలసిన పూజాసామగ్రి, పాలవెల్లి, పళ్ళు, మామిడాకులు, పూలు తీసుకోమన్నాడు. వినాయక పూజా వ్రతకల్పం పుస్తకం కొనమన్నాడు. అన్నీ తీసుకున్నాడు తండ్రి. ఇంటికి వెళ్ళి చక్కగా పూజామందిరాన్ని అలంకరించి, గణపయ్యని ప్రతిష్ఠించి, పూజ చేశారు. చింటూ తన తరగతి పుస్తకాల మీద ఓం రాసుకుని గణపయ్య ఎదుటపెట్టాడు. ప్రసాద ఉండ్రాళ్ళు, పాయసం, పులిహోర తినేసి ఆడుకోవడానికి వెళ్ళాడు. వాళ్ళుంటున్న అపార్ట్‌మెంట్ సెల్లార్‌లో కూడా పేద్ద బొజ్జగణపయ్య పూజలందుకుంటున్నాడు. అయితే అక్కడ అప్పుడే వినాయక వ్రతకథను చదువుతున్నాడు పూజారి. ఆసక్తిగా వింటూ కూర్చున్నాడు చింటూ. కథలో పాలలో చందురుడిని చూసి, ఇక్కట్లపాలయిన కృష్ణుడి కథ చింటూకి బాగా నచ్చింది. ఆ కథతోపాటు ఓ పొడుపుకథ కూడా అతని చిన్ని బుర్రలో తళుక్కున మెరిసింది. గబగబా ఇంటికి వెళ్ళి తల్లితో "అమ్మా, నేనో పొడుపు కథ వేస్తాను, విప్పుతావా?" అని అడిగాడు. తల్లి సరేనంది. మరే..మరే పొడుపుకథ ఏంటంటే "రాత్రిపూట ఎవరూ పిలవకుండానే వచ్చేసి, తళుక్కున మెరుస్తాయంట. తెల్లారితే మాత్రం మనకు ఎక్కడా కనిపించవంట. వాటిని ఎవరూ దొంగతనం చేయలేరు కూడా! అవేంటి?" అని అడగటంతో తల్లి కాసేపు ఆలోచించి, నావల్ల కావటం లేదురా, నువ్వే చెప్పు అంది. దాంతో చింటూ పకపకా నవ్వేసి అమ్మ ఓడిపోయింది... నేనే గెలిచాను అంటూ పొడుపు కథ విప్పేశాడు. మరి మీకూ తెలిస్తే సమాధానం చెప్పేయండి.

**సమాధానం**

నక్షత్రాలు

# తీన్ మార్















**మహాద్వారం దగ్గర భటులు విదిలించి కొట్టినట్టు, ఆ గ్రామీణుల్ని అవమానించలేదు విద్యార్థులు. ఆప్యాయంగా అక్కున చేర్చుకున్నారు. తమ వెంట తీసుకుపోయి వారందరి అవసరాలను దగ్గరుండి గమనించుకున్నారు.**

**సూర్యుడు నడిమింటిని దాటి పడమటి దిశ కేసి పరుగులు మొదలుపెట్టబోతున్న సమయంలో గ్రామీణులందరినీ తన ఎదుటికి పిలిపించుకున్నాడు సూసీయన్.**

'ఇప్పుడు చెప్పండి.. మీకు వచ్చిన కష్టం ఏమిటో?' వాత్సల్యంగా చూస్తూ అడిగాడు.

'స్వామి... తరతరాలుగా మేము సముద్రం ఒడ్డున ఉన్న సారవంతమైన భూమిని సాగు చేసుకుంటూ బ్రతుకుతున్నాం. గత నెలరోజుల నుంచీ ఎందుకో తెలియదుగాని, సముద్రం తనకు ఆగ్రహం వచ్చినట్టు చెలరేగిపోతున్నది. చెలియలికట్టను దాటి మా భూముల మీదికి వచ్చేస్తున్నది ఉప్పు నీరు. పంటలు నాశనం అయిపోతున్నాయి. పచ్చగా కళకళలాడుతూ కనిపించే మహావృక్షాలు కూడా మలమలామాడి కృంగి కృశించిపోతున్నాయి' చేతులు జోడించి గద్గదస్వరంతో తమకు వచ్చిన కష్టాన్ని చెప్పుకున్నాడు అందరిలోకి అతి వృద్ధుడి మాదిరిగా కనిపిస్తున్న గ్రామీణుడు.

అతను చెపుతున్న ప్రదేశం ఎక్కడ ఉన్నదో సూసీయన్‌కి అర్థం అయింది.

'మీరెవరూ భయపడవలసిన అవసరం లేదు. మీరు ఎదుర్కొంటున్న కష్టానికి కారణం ఏమిటో తెలుసుకుని, అందుకు ప్రతిక్రియను నేను ఆలోచిస్తాను. మీరు నిశ్చింతగా మీ మీ ఇళ్ళకు వెళ్ళిపొండి' తన దక్షిణ హస్తంతో అభయం ఇచ్చాడు.

దిగులుగా ఉన్న గ్రామీణుల ముఖాలన్నీ వికసించాయి ఒక్కసారిగా. చేతుల్ని గాలిలోకి ఎత్తి పెద్ద పెద్ద గొంతుకలతో ఆ వస్తాదుకి జయజయ ధ్వానాలు చేశారు.

కూర్చున్న ప్రదేశం నుంచి లేచి నిలబడి వినయంగా తలవంచి వారికి తన కృతజ్ఞతలను తెలియ చేసుకున్నాడు సూసీయన్.

తిరుగుప్రయాణంలో ఆరగించటానికి, ఆకలి దప్పులు తీర్చుకోవటానికి చక్కగా కాల్చిన రొట్టెల్ని, అందంగా తయారుచేయబడిన మట్టిపాత్రల్లో పరిశుభ్రమైన నీటిని తీసుకువచ్చి గ్రామీణులందరికీ అందచేశారు విద్యార్థులు. తామందరూ దగ్గరుండి, అందరినీ మహాద్వారం దగ్గరికి తీసుకుపోయి వీడ్కోలు పలికారు.

'సముద్రం ఉప్పొంగటం, పరిసర ప్రాంతాలన్నిటినీ ముంచెత్తటం ప్రకృతిసహజం. ఆ ప్రక్రియను అడ్డుకోవటం మానవులకు సాధ్యపడుతుందా గురుదేవా?' మహాద్వారం దగ్గర్నించి వెనక్కి వచ్చిన తర్వాత సూసీయన్‌ని అడిగాడు ఒక విద్యార్థి.

'సహజంగా ఏర్పడేవాటిని అడ్డుకోవడం సాధ్యపడదు. అసహజంగా కనిపించే మార్పుల్ని ఎంతో కొంత అదుపులో పెట్టవచ్చు' సాలోచనగా చెప్పాడు సూసీయన్.

'అక్కడ జరుగుతున్నది సహజమో, అసహజమో ఎలా తెలుసుకోవటం?' మరో ప్రశ్న వేశాడు ఆ విద్యార్థి.

'ఇక్కడ కూర్చుని మాట్లాడుతూ ఉంటే మనకు తెలిసేది ఏదీ ఉండదు. పాదానికి దెబ్బ తగిలినప్పుడు, గాయాన్ని చూసి వైద్యం చేయాలి. ఈ సమస్య కూడా అటువంటిదే...' అంటూ ఉన్నట్లుండి పైకి లేచాడు సూసీయన్. 'నేను ఆ ప్రదేశానికి వెళ్ళివస్తాను' అంటూ వేదిక దిగి మహాద్వారం దగ్గరికి నడిచాడు.

గ్రామీణులు తరలిపోయిన తక్షణం గట్టిగా మూసివేయబడిన తలుపుల్ని వెంటనే తెరచి పట్టుకున్నారు అక్కడి భటులు.

'తమకు ఎటువంటి సమస్య ఎదురయినా, మనం పరిష్కరించగలమనే నమ్మకంతో ఆఘమేఘాల మీద వచ్చి పడుతూ ఉంటారు అమాయక ప్రజలు. వారి కష్టాలను కడతేర్చవలసిన మనం – మనకేదో కష్టం రాబోతున్నట్టు తలుపులు మూసుకు కూర్చోవడం హాస్యాస్పదం. తెరచి ఉంచండి... మనుష్యులకే కాదు, పశుపక్ష్యాదులకు కూడా ప్రవేశం ఉంటుందన్న మాటను గట్టిగా గుర్తు పెట్టుకోండి...' మృదువైన కంఠంతో, గట్టిగానే హెచ్చరించి ద్వారానికి ఆవలగా నిలబడి ఉన్న ఒక అశ్వం దగ్గరికి పోయాడు సూసీయన్.

### జరిగిన కథ

*కుంగ్‌ఫూ విద్యాపీఠానికి కాబోయే పీఠాధిపతి ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు షాడో. గంగారాంతో కాంటన్ సిటీ చేరి, హుహుశాన్ మనుషులతో గొడవపడతాడు. వారిద్దరినీ వెతుకుతూ బురదనేలలకు ఆవలిపక్కన ఉన్న సెటిల్మెంట్ చేరుకుంటాడు ఫ్యుజీశాన్. అక్కడ ఓ వ్యక్తి దగ్గర డూడూ సామ్రాజ్యపు నాణేలు కనిపిస్తాయతనికి. అవి కానిస్టేబుల్ ద్వారా షాడో వద్దకు చేరతాయి. దాంతో డూడూ సామ్రాజ్యం గురించి గంగారాంకి చెబుతుంటాడు షాడో. కుంగ్‌ఫూ విద్యాపీఠానికి సూసీయన్ పీఠాధిపతిగా ఉన్న కాలంలో కొంతమంది గ్రామీణులు అతని కోసం వస్తారు.*

*ఆ తర్వాత...*

దట్టంగా తన మెడ మీద పరుచుకుని ఉన్న జూలును విదిలిస్తూ, ఆవరణ మొత్తం ప్రతిధ్వనించేటట్లు సకిలించింది ఆ అశ్వం.

'అవును మిత్రమా... పని చాలా పెద్దదే పడింది. ఒకటి రెండు రోజుల్లో పూర్తి అవుతుందని నాకు అనిపించటం లేదు..' అంటూ చెంగున ఎగిరి దాన్ని అధిరోహించాడు అతను.

కళ్ళెం లేదు. కుదురుగా కూర్చోవటానికి అవసరమైన పరికరాలు లేవు. పొడవాటి పాదాలు పెట్టుకోవటానికి రికాబులు కూడా శూన్యం.

అతని మాదిరిగానే ఛెంగున ఎగిరి పరుగు మొదలుపెట్టిందా ప్రాణి. మొదలుపెట్టిన మూడో క్షణంలోనే దారుణమైన వేగాన్ని అందుకున్నది.

'నీ వేగాన్ని తట్టుకోలేక నేను తలక్రిందులు అయిపోతే చూడాలని నీకు మహాకోరికగా ఉన్నట్టుంది. అందుకు ఈ వేగం చాలదు. ఇంతకు మూడింతలు కావాలి. అది నీకు సాధ్యపడదు' చీమ కుట్టినట్లయినా చలించకుండా, దక్షిణ హస్తాలతో దాని మెడను స్పృశిస్తూ వెక్కిరించాడు సూసీయన్.

మొదలుపెట్టిన పరుగును సూర్యుడు పడమటి దిశలో పడి మటుమాయం అయిపోయే వరకూ అలాగే కొనసాగించింది అశ్వం. చీకట్లు తమ దారిని చుట్టుముడుతున్న సమయంలో, ఒక చిన్న రాతి గుట్ట దగ్గర నిలబడిపోయింది.

'మరికొంచెం దూరంలో మనకు బాగా పరిచయం ఉన్న గ్రామం ఉన్నది. నాకు ఆహారం లభిస్తుంది. గ్రామం చుట్టూ ఉన్న గడ్డిమైదానంలో నువ్వు తినగలిగినంత పసిరిక ఉంటుంది. అక్కడికి పోదాం' దాని తలను స్పృశిస్తూ మృదువుగా అన్నాడు సూసీయన్.

అతను అలా తన శిరస్సును తాకిన వెంటనే తిరిగి కదలటం మొదలు పెట్టవలసిన ఆ ప్రాణి, మెడ మీది జూలు చిందరవందర అయ్యేటట్టు తలను గట్టిగా విదిలించింది.

'కదులు మిత్రమా... మనకు ఆప్తులైన ఆ గ్రామస్థులందరూ నిద్రపోకముందే అక్కడికి పోవటం బాగుంటుంది. ఆర్చుకు తీర్చుకుని అతి నెమ్మదిగా ప్రయాణంచేసి వారికి నిద్రాభంగం కలిగించటం మర్యాదకాదు' అంటూ మరోసారి ముందుకు కదలమని సంజ్ఞ చేయబోతూ, చటుక్కున ఆగిపోయాడు సూసీయన్.

రెండు తాటి చెట్లంత ఎత్తులో ఉన్న ఆ రాతి గుట్ట వెనక నుంచి గగ్గోలుగా అరుస్తూ అనేక మంది దృఢకాయులు ఇవతలికి రావటమే అందుకు కారణం.

'మంచి జరగాలి మీ అందరికీ... మీరు చేసే వృత్తులన్నీ శోభస్కరంగా కొనసాగాలి' దక్షిణ హస్తాన్ని పైకెత్తుతూ చిన్నకంఠంతో వారికి చెప్పాడు సూసీయన్.

'ఈయన ఒక పెద్ద దేవుడు... ఈయన చెప్పినవన్నీ చకచకా జరిగిపోతాయని ఈయన గారికి నమ్మకం కాబోలు' వెక్కిరింపుగా అంటూ తన దగ్గర ఉన్న పొడవాటి బరిశెను బలంగా ముందుకు విసిరాడు వారిలో ఒకతను.

గాలిని చీల్చుకుంటూ బర్రున దూసుకు వచ్చిందా ఆయుధం. సూటిగా వచ్చి సూసీయన్ గుండెల్లో దిగబడాలి దానిని విసిరిన వ్యక్తి అంచనా ప్రకారం. ఒకవేళ సూసీయన్ గనుక తన వాహనం మీది నుంచి క్రిందికి దూకేయటం అంటూ జరిగితే,



కనీసం అతని భుజాలనైనా అది గాయపరిచి తీరాలి.

తన వాహనం మీది నుంచి దూకలేదు సూసీయన్. భయంతో బిగుసుకు పోలేదు.

తన గుండెలకు తాకేటంత దగ్గరికి వచ్చేదాకా ఆగి, కన్ను మూసి కన్ను తెరిచేటంతలో ఆ బరిశెను తన వామహస్తంతో ఒడిసి పట్టుకున్నాడు.

వికృతంగా మారిపోయింది ఆ ఆయుధాన్ని విసిరిన వ్యక్తి ముఖం. 'వాడు ఎవడో యుద్ధవిద్యల్ని బాగా అభ్యసించి ఉన్నట్టుగా కనిపిస్తోంది. చుట్టు ముట్టి కిందికి లాగి పడేయండి' ఖంగుమంటున్న కంఠంతో ఆజ్ఞ ఇచ్చాడు.

బొమ్మల మాదిరి నిలబడిపోయిన మిగిలిన వారందరిలోను వెంటనే వచ్చింది చలనం. చెవులు చిల్లులు పడిపోయేటట్లు గావుకేకలు పెడుతూ ఒకే సారి ముందుకు వచ్చారు అందరూ.

నల్లటి కనుల్ని గిరగిరా తిప్పుతూ ఎగిరి వెనక్కి దూకబోయిన తన వాహనాన్ని కాలి మడమలతోనే కట్టడి చేసేశాడు సూసీయన్. 'కదలకు... ఒక్క అంగుళం కూడా వెనక్కిపోకు' అంటూ దానికి చెప్పి, ఒక్కసారిగా క్రిందికి దూకాడు.

తమ చేతుల్లో ఉన్న బరిశెలతో అతని శరీరం తూట్లు పడిపోయేటట్టు పొడవాలని అనుకున్న దృఢకాయులకు మతులు పోయినంత పని అయింది. అశ్వం మీదినించి క్రిందికి దూకిన వెంటనే బొంగరం మాదిరి గిరగిరా తిరుగుతూ, దొరికిన ఆయుధాన్ని దొరికినట్లే గాలిలోకి ఎగరగొట్టేశాడు సూసీయన్. పిడికిళ్ళు బిగించి, వాటిని పట్టుకున్న వారి ముఖాలన్నిటినీ పచ్చడి పచ్చడి చేసేశాడు.

ఎంతోసేపు కొనసాగలేదు ఆ రచ్చ. ఒకటి నుంచి నలుబది అంకెలు లెక్కబెట్టేలోపుగానే పూర్తి అయిపోయింది.

ఏపుగా ఎదిగిన వరిచేను సుడిగాలి దెబ్బకు ఎలా నేలకు వాలిపోతుందో, అలాగే కింద పడిపోయారు అందరూ. పచ్చటి చేలో మొండిగా ఎదిగిన పిచ్చి మొక్క మాదిరి వారి నాయకుడు ఒక్కడే నిలబడి కనిపించాడు.

రెండే రెండు గంతుల్లో అతన్ని సమీపించి, పిడికిలితో ముఖం మీద పొడవబోతూ, ఆఖరి క్షణంలో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు సూసీయన్.

ఆ వ్యక్తి మెడలో ధగధగమని మెరుస్తోంది ఒక విచిత్రమైన హారం. ఖరీదయిన వెండి బంగారు లోహాలతో తయారు చేయబడినది మాత్రం కాదు. తెల్లటి పాలనురుగు పులిమినట్టు ధవళ వర్ణంతో మెరిసిపోతోంది.

'ఏమిటిది? నీకు ఎక్కడినుంచి వచ్చింది?' ముఖాన్ని చితక్కొట్టవలసిన చేతితో ఆ హారాన్ని స్పృశిస్తూ అడిగాడు అతి మృదువుగా.

తాను విసిరిన బరిశెను అవలీలగా అతను అడ్డుకున్నప్పుడే సగం వరకూ అణిగిపోయి ఉంది ఆ వ్యక్తి పొగరు. గడ్డి దుబ్బుల మాదిరి నేలకూలిపోయిన తన పరివారాన్ని చూసుకునేసరికి అది మరింతగా మాయం అయిపోయింది. కాలయముడి మాదిరి ఆ మనిషి తన ఎదుట ప్రత్యక్షం అయ్యేసరికి పూర్తిగా దిగజారిపోయింది.

'ఇది... నాదే... నా స్వంతం' తడబడుతున్న కంఠంతో అన్నాడు.

చూపుడు వేలిని జాచి అతని నాసిక మీద అలవోకగా మీటాడు సూసీయన్.

అడవుల్లో కనిపించే కందిరీగలు రెండు వచ్చి తన ముఖం మీద కుట్టినట్టు అదిరిపడ్డాడు అతను. క్షణాల మీద అధికం అయిపోతున్న బాధను భరించలేక నిట్టనిలువుగా నేలమీద పడి పొర్లిగింతలు మొదలుపెట్టాడు.

'నా ప్రశ్నకు సమాధానం కావాలి. మొండికేస్తే ఇంకో గంట తర్వాత వాసనలు తెలుసుకోవటానికి నీకు నాసిక ఉండదు' నడుము మీద చేతులు వేసుకుంటూ చెప్పాడు సూసీయన్.

మరో రెండు క్షణాలు గడిచిపోయాయి. బాధ అంతకంతకూ పెరుగుతూ ఉండటంతో తట్టుకోలేక, గావురు గావురుమని అరవటం మొదలుపెట్టాడు అతను.

'సమయం మించిపోతోంది. పరిస్థితి చేతులు దాటిపోబోతున్నది' మృదువుగా హెచ్చరించాడు సూసీయన్.

'చెప్తాను. చెప్తాను. నిన్న సాయంత్రం శీకూ కోటకు సమీపంలో సైనికులు కొందరు వేటకు వచ్చారు. దారి కాచి వాళ్ళని ఎదిరించాం. వంద నాణేలు, ఈ హారం తప్ప ఇంకేమీ దొరకలేదు' గజ గజ వణుకుతూ చెప్పాడు అతను.

'శీకూ కోట మింగ్ చక్రవర్తికి చాలా ప్రీతిపాత్ర

**ప్రశాంతంగా ఉంది సముద్రం. సహజంగా ఎగసిపడే అలలతో కనులపండువగా కనిపిస్తోంది. దగ్గరలోనే ఉన్న ఒక బండరాయి మీద పద్మాసనం వేసుకు కూర్చున్నాడు సూసీయన్. కనులు మూసుకుని ధ్యానసమాధిలోకి వెళ్ళబోతుండగా, ఉన్నట్టుండి జలదరించింది అతని శరీరం. చెవులు దద్దరిల్లేలా భయంకరమైన శబ్దం... కనులు తెరిచి చూసిన సూసీయన్ ఆశ్చర్యపోయాడు. ఒక్క ఉదుటన లేచి నిలబడ్డాడు. అసలేమిటా శబ్దం? అక్కడేం జరిగింది?**

మైనటువంటిది. సముద్రం మీదినుంచి శత్రువులు వచ్చి దాడిచేయకుండా రెండువేలమంది సైనికుల్ని కాపలా పెట్టి ఉంచుతాడు' సాలోచనగా అన్నాడు సూసీయన్.

'ఆ మాట మాకు తెలుసు.... అందుకే దొరికింది చాలని అనుకుని అధికంగా ఆశపడకుండా పారిపోయి వచ్చాం' అన్నాడు ఆ వ్యక్తి.

'మింగ్ చక్రవర్తికి సంబంధించిన పరివారం మీద కత్తిని ఎత్తినవాళ్ళు ఎంతోకాలం బ్రతికి ఉండరు. వెతుక్కుంటూ వచ్చేస్తారు సైనికులు' అన్నాడు సూసీయన్. 'అయ్యా మీరు ఎవరు? ఆ కోటలో నుంచి వచ్చిన వారు కాదా?' అడిగాడు ఆ వ్యక్తి.

దీర్ఘంగా నిట్టూర్చి తల అడ్డం తిప్పాడు సూసీయన్. 'వెళ్ళిపొండి... త్వరగా ఈ ప్రదేశాన్ని వదిలి దూరంగా పారిపొండి... అదృష్టం బాగుంటే మీలో కొందరయినా ప్రాణాలు దక్కించుకోగలుగుతారు' అంటూ ముందుకు వంగి, ఆ వ్యక్తి నాసికను మరోసారి మీటాడు.

నరాలను మెలిపెట్టే బాధ చేత్తో తీసివేసినట్టు మటుమాయం అయిపోయేసరికి, ఆశ్చర్యంగా చూస్తూ, క్రింది నించి లేచి నిలబడ్డాడు ఆ వ్యక్తి.

'అయ్యా... తమరి పరిచయం' అని మరోసారి మాట్లాడబోయాడు. మాట అతని నోటి నుంచి పూర్తిగా వెలువడక ముందే, వేగంగా వెనుతిరిగి, తన వాహనం దగ్గరికి వెళ్ళిపోయాడు సూసీయన్.

'వెళ్ళిపొండి... ఆలస్యం చేయవద్దు' అంటూ ఎగిరి దానిమీద కూర్చున్నాడు. అతను సైగ చేయవలసిన అవసరం లేకుండానే కదిలింది అది. రాతిగుట్టను చుట్టి, ఎదురుగా కనిపించిన ఒక మట్టి దారి మీద వేగంగా పరుగులు తీసింది.

***

సూర్యుడు అస్తమించక ముందే ఆహారం తీసుకుని, గ్రామం మధ్యలో ఉన్న ఒక పెద్ద అబుటో వృక్షం దగ్గర కూర్చున్నారు గ్రామస్థుల్లో కొంచెం వయస్సు అధికంగా ఉన్న వారందరూ.

'శీకూ కోటలో ఉండాల్సినవారి కంటే ఎక్కువగా సైనికులు కనిపిస్తున్నారు. ఏదైనా దండయాత్ర ఆరంభం అవుతుందేమో తెలియటం లేదు' అబుటో వృక్షపు మొదలును ఆనుకుంటూ అన్నాడు ఒకతను.

'నీకు ఎలా తెలిసింది? అటువైపు వెళ్ళవద్దని అనుకున్నాం కదా...' అన్నాడు మరో గ్రామస్థుడు.



'మొన్న సాయంత్రం నా మందలో నుంచి ఒక మేకపిల్ల తప్పిపోయింది. వెతుక్కుంటూ అటుకేసి...' అంటున్న మొదటి గ్రామస్థుడి మాట ముగియక ముందే, 'ఆశ వదిలేసుకో... అది గనుక కోట దగ్గరికి పోయి ఉంటే ఎప్పుడో నిప్పుల మీద కాల్చబడి ఉంటుంది. సైనికుల పొట్టల్లోకి పోయి, అరిగిపోయి కూడా ఉంటుంది' అన్నాడు ఇంకోమనిషి.

దీర్ఘంగా నిట్టూర్చాడు చెట్టు మొదలును ఆనుకుని కూర్చున్న వ్యక్తి. 'అదే జరిగింది. తినగా మిగిలిన ఎముకల్ని బొమికల్ని నా మీదికి విసిరేసి పకపకా నవ్వారు...' అన్నాడు.

'దాదాపు రెండువేలమంది దాకా ఉన్నారట కోటలో... వాళ్ళందరికీ నీ మేకపిల్ల సరిపోయి ఉంటుందా?' వెక్కిరింపుగా అడిగాడు వేరే వ్యక్తి.

'కోటలో ఉన్నవాళ్ళు కాదు. కోట వెలుపల ఉంది గుడారం. పాతిక మంది మాత్రమే ఉన్నారు. వాళ్ళు చేసిన పని...' అన్నాడు మొదటి మనిషి.

అప్పటివరకూ అతను మాట్లాడిన మాటకు వెంటనే స్పందించి ఎదురుమాటలు చెప్పిన వాళ్లు – ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

'ఏమిటి నీ అనుమానం?' అనుమానంగా చూస్తూ అడిగాడు మొదటి గ్రామస్థుడు.

'సైనికులు కోటలోనే ఉంటారు. రాత్రి సమయాల్లో గోడల మీద నిలబడి కనిపిస్తారు. కోట వెలుపల గుడారం అంటే – ఖచ్చితంగా అది ఏదో దండయాత్రకి గుర్తే. సందేహం లేదు' అన్నాడు రెండో గ్రామస్థుడు.

మౌనంగా ఆ మాటలు వింటున్న ఇతరులు ఉన్నట్లుండి లేచి నిలబడ్డారు. 'దండయాత్ర అంటే మాటలు కాదు. కోటను ముట్టడించడానికి వచ్చిన వాళ్ళు కోటకు సమీపంలో ఉన్న గ్రామాల మీద పడి దోపిడీలు మొదలుపెడతారు. మనం వెంటనే జాగ్రత్తపడాలి. లేకపోతే నాశనం అయిపోతాం' అంటూ తమ తమ ఇళ్ళకేసి బయలు దేరారు.

పది పదిహేను అడుగులు కూడా వేయక ముందే, అందరికీ వినవచ్చింది ఏదో అశ్వం అతి వేగంగా వస్తున్న శబ్దం.

'అనుకున్నంతా అయింది. మనకి చేటుకాలం వచ్చేసింది..' వణుకుతున్న కంఠాలతో అంటూ చెట్టు క్రింద మిగిలినవాళ్ళు కూడా లేచి నిలబడ్డారు.

అదే సమయంలో వారికి కనిపించింది తమ అలజడికి కారణమైన అశ్వం. వేగంగా వస్తూ ఉండడం వల్ల గాలి విసురుకు ఎగిరిపోతున్న ఉత్తరీయాన్ని గట్టిగా పట్టుకుంటున్న ఆకారం కూడా కనిపించింది వారికి ఆ అశ్వం మీద.

'పారిపోండి... పారిపోయి ప్రాణాలు దక్కించుకోండి' బిగ్గరగా అరిచి, చెట్టుకు ఆవలివైపున ఉన్న పొదల్లోకి పరుగు తీయబోయాడు ఒక గ్రామస్థుడు.

'స్నేహితులారా... ఆగండి... ఆగిపోండి... శత్రువును కాదు' బిగ్గరగా వినవచ్చింది ఆ కంఠం.

కనులు చిట్లించుకు చూసిన వారందరికీ కనిపించాడు అశ్వం మీది సూసీయన్. తను ఎవరో వారికి తెలిసే లోపల చాలా దగ్గరికి వచ్చేశాడు. అశ్వం మీదినుంచి ఎగిరి క్రిందికి దూకాడు.

దట్టంగా ముసురుకున్న వర్షపు మబ్బులు గట్టిగా వీచిన ఈదురుగాలి దెబ్బకు చెల్లాచెదరైనట్టు, చిటికెలో మాయం అయిపోయింది ఆ గ్రామస్థుల్ని ఆవరించుకున్న భయం.

ఒక్కసారిగా తమ చేతుల్ని గాలిలోకి ఎత్తి ఒకేసారి జయజయధ్వానాలు చేశారు.

'భగవంతుడు మీకందరికీ మంచి చేస్తాడు. కుశలంగానే ఉన్నారు కదా అందరూ... పండిన పంటలన్నీ చేతులకు అంది వస్తున్నాయా? మీ పశువుల మందలు క్షేమమేనా?' అడిగాడు సూసీయన్.

'సరైన సమయానికి దేవుడు పంపినట్టు వచ్చారు. షీకూ కోటలో ఉన్న సైనికులతో మాట్లాడి మా గ్రామం జోలికి రావద్దని మీరు చెప్పాలి' సూటిగా తమ సమస్యను అతనికి వినిపించాడు ఒక గ్రామస్థుడు.

'కోటలోని వారు మీ జోలికి రారనే నేను అనుకుంటున్నాను. ఇంతవరకూ అటువంటి దారుణాలు ఎక్కడా జరగలేదు' అన్నాడు సూసీయన్.

'ఇంతకుముందు జరగకపోయినా, ఇప్పుడు జరుగుతుందనే మాకు భయంగా ఉంది. మంద నుంచి వేరుపడిన మేకపిల్లను నిర్మొహమాటంగా విందు చేసుకున్నారు. అది తప్పుకదా... అదేమని అడిగితే, ఎముకలు ముఖం మీద కొట్టి ఎగతాళి చేశారు. అది కూడని పనేకదా' అన్నాడు మేకపిల్లను పోగొట్టుకున్న గ్రామస్థుడు.

తనను చూడగానే ఆప్యాయంగా ఆహ్వానించి, తన అవసరాలు గమనించుకునే ఆ అమాయకులు ఆతిథ్యం మాట మరిచిపోయి, వేరే మాటలు మాట్లాడటం మొదలు పెట్టేసరికి, అక్కడ విడిది చేయాలన్న కోరికను వెంటనే మనసులోనుంచి తుడిచి వేసుకున్నాడు సూసీయన్.

'నేను అత్యవసరమైన పనిమీద సముద్రతీరం వరకూ వెళుతున్నాను. తిరిగివచ్చే సమయంలో కోట దగ్గర ఆగి, సైనికులతో మాట్లాడతాను. మీరెవ్వరూ భయపడవలసిన అవసరం లేదు. ప్రశాంతంగా ఉండండి' అంటూ తిరిగి తన వాహనం మీదికి చేరుకున్నాడు.

అప్పుడు కూడా వాళ్ళు తనను ఆగమని అనక పోవటంతో అధికం అయిపోయింది అతని ఆశ్చర్యం.

'చూడటానికి చిన్నదిగానే కనిపిస్తున్నా, వారి తడబాటు వెనక ఏదో పెద్ద కారణం ఉండి ఉంటుంది. తిరిగివచ్చే సమయంలో తప్పకుండా అదేమిటో తెలుసుకోవాలి' తన వాహనానికి చెపుతూ తిరిగి ప్రయాణం మొదలు పెట్టాడు.

***

ప్రశాంతంగా ఉంది సముద్రం... సహజంగా ఎగసిపడే అలలతో కన్నుల పండువగా కనిపిస్తోంది.

సూర్యోదయం అయిన తర్వాత చాలాసేపటికి తన అశ్వాన్ని తీరానికి దూరంగా ఉన్న చెట్ల గుంపులో వదిలి, కాలినడకన అక్కడికి చేరుకున్నాడు సూసీయన్.

తమ గ్రామానికి దగ్గరగా వస్తున్న సమయంలో అతన్ని గమనించి పరుగులాంటి నడకలతో

## హన్సిక అంత డేంజరా?

*కోలీవుడ్‌లో హన్సికను అందరూ 'టైంబాంబ్' అంటారట! టైంబాంబ్ అంటే డేంజర్ అని కాదట! షూటింగులకి టైముకి వస్తుంది కనుక అందరూ తనను టైంబాంబ్ అంటారట! షూటింగ్‌కి అందరికన్నా ఓ పది నిమిషాలు ముందే ఉంటుందట. తన పిల్లల మధ్య హన్సిక పుట్టినరోజు వేడుకను జరుపుకుంది. ఆ సందర్భంగా తీసిన ఫోటోలను మీడియాలో పోస్ట్ చేసి పనిలో పనిగా ఈ విషయాలను పంచుకుంది. కోలీవుడ్ మీద చూపించినంత ప్రేమను టాలీవుడ్ మీద చూపించడం లేదు అన్న విమర్శలను కూడా హన్సిక తిప్పికొట్టింది. తనకు కోలీవుడ్, టాలీవుడ్ రెండు కళ్ళలాంటివని, అందులో ఏ కంటినీ నిర్లక్ష్యం చేయనని అంటోంది. కాకపోతే కోలీవుడ్‌లో ఒప్పుకున్న సినిమాలు ఉండడంతో టాలీవుడ్‌లో డేట్లు ఇవ్వడం కుదరడం లేదట! కాకపోతే టాలీవుడ్‌లో తనకు ఎవరూ ఛాన్సులు ఇవ్వడం లేదన్న విషయాన్ని చక్కగా కవర్ చేస్తోందని సినీ జనాలు అంటున్నారు.*



ఎదురు పోయారు గ్రామంలోని స్త్రీ, బాల, వృద్ధులు చాలామంది.

'ఏమైంది? మీరందరూ చాలా తక్కువగా కని పిస్తున్నారెందుకని?' వారి సంఖ్య తగ్గి ఉండడంతో ఆశ్చర్యంగా అడిగాడు అతను.

'మీ దగ్గరికే వచ్చారు కదా స్వామి... మిమ్మల్ని కలుసుకోవటానికి బయలుదేరారు' చెప్పింది ఒక మహిళ.

ఆ మాటలు చెవులపడిన వెంటనే తన మతి మరుపుతనానికి తనే సిగ్గుపడి తల వంచు కున్నాడు సూసీయన్.

తనను కలిసి తమ బాధను చెప్పుకోవటానికి వచ్చిన వారందరూ కాలినడకన వచ్చారు. తిరిగి తమ గ్రామం చేరుకోవటానికి చాలా రోజులు ప్రయాణం చేయాలి. గాలితో పోటీ పడుతున్నట్టు పరిగెత్తే వేగం కలిగిన వాహనం మీద వెంటనే తాను కూడా బయలుదేరి వచ్చాడు. దారిలో ఎక్కడా ఆగలేదు విశ్రాంతి కోసం...

'నిజమే... నాదే పొరపాటు. మీ వారందరూ ఇంకా దారి మధ్యలోనే ఉన్నారు' అన్నాడు నిజాయితీగా.




'అలసిపోయి కనిపిస్తున్నారు. ఆహారం తీసు కోవాలి. రండి' అంటూ ఆహ్వానించింది ఒక మహిళ.

ఆమె ఆదరణకు తలవంచి నమస్కరించాడు సూసీయన్. 'తల్లీ... అది అంత ముఖ్యం కాదు. ముందు మీ సమస్యను నేను స్వయంగా చూడాలి' అంటూ బయలుదేరి తీరానికి దూరంగా ఉన్న చెట్లతోపులోకి తన వాహనాన్ని నడిపించాడు.

విద్యాపీఠం దగ్గరికి వచ్చిన గ్రామస్థుల మాటల్లో అసత్యం ఏమీలేదని వెంటనే అర్థం అయింది అత నికి.

తెగులు తగిలినట్టు మాడిపోయి ఉన్నాయి చెట్లు అన్నీ.. ఉప్పు నీటితో కడిగినట్లు తెల్లగా కనిపిస్తు న్నాయి వాటి మొదళ్ళు.

'సముద్రం వీరావేశంతో చిందులు తొక్కుతూ నిలబడి ఉంటుంది' తనలో తను అనుకుంటూ వాహనాన్ని అక్కడే వదిలి ముందుకు నడిచిన అతనికి, మతిపోయేనంత పని అయింది సముద్రాన్ని చూడ గానే.

ప్రశాంతంగా ఉంది. ఆనవాయితీని మించి ఒక్క అంగుళం కూడా పైకి లేవటం లేదు అలలు. అవి చేస్తున్న శబ్దంలో కూడా మార్పు కనిపించటం లేదు.

కుంగ్‌ఫూ వస్తాదు అంతటి వాడు స్వయంగా వచ్చి తమ సమస్యను పరిష్కరించటం జరుగు తుందనే సంతోషం గ్రామస్థుల ముఖాల్లో కనిపించిన మాట వాస్తవం. అయితే ఆ సమస్యను గురించి వివరంగా చెప్పి, స్వయంగా చూపించటానికి మాత్రం ఎవరూ అతనితో పాటు రాలేదు.

నురగలు కక్కుతున్న నీటికి కొంచెం ఇవత లగా కనిపించిన ఒక బండరాయి మీద పద్మాసనం వేసుకు కూర్చున్నాడు సూసీయన్. కనులు మూసు కుని ధ్యాన సమాధిలోకి పోబోతుండగా, జలదరిం చింది శరీరం.

కనులు తెరచిన వెంటనే కనిపించింది సముద్రంలో వస్తున్న మార్పు. అంతకుముందు పది క్షణాల వరకూ పరమ ప్రశాంతంగా ఉన్న నీరు ఎవరో చేతులుపెట్టి కెలుకుతున్నట్టు ఎగిరెగిరి పడటం మొదలుపెట్టింది. పెద్దవై పోసాగాయి అలలు.. చెలియలి కట్టను దాటి వేగంగా ముందుకు రాసా గింది నీరు.

దూరంగా ఉన్న బండరాయి చుట్టూ చేరింది. చూస్తూ చూస్తూ ఉండగానే మునిగిపోయింది రాయి. సూసీ యన్ నడుము కూడా దిగిపోయింది.

చటుక్కున లేచి బండను వదిలిపెట్టాడు అతను. పరుగులాంటి నడకతో తన అశ్వాన్ని వదిలిన చెట్ల గుంపు దగ్గరికి పోయాడు.

ఎంతో సమయం అవసరం లేకపోయింది నీటికి. చూస్తూ ఉండగానే చెవులు చిల్లులు పడే మ్రోతలు చేస్తూ చెట్ల దగ్గరికి వచ్చేసింది నీరు. మరికొద్దిసేపటి లోనే తోపు కూడా సగం వరకు నీటిలో మునిగి పోయింది.

***

కాలినడక ప్రయాణమే అయినా తాము కూడా ఎక్కడా ఆగకుండా తిరిగి వచ్చేశారు విద్యా పీఠం దగ్గరికి పోయిన గ్రామస్థులు అందరూ.

గ్రామం మధ్యలో వేదిక వంటి మట్టి అరుగు మీద కూర్చుని ఉన్న సూసీయన్‌ని చూసి సాష్టాంగ నమస్కారాలు చేయబోయారు.

'వద్దు... నేను కూడా మీ వంటి మానవుడినే. దేవు డిని కాదు' అంటూ వారిని వారించాడు అతను.

'స్వామీ... మీ కళ్ళతో మీరు చూశారు కదా.. చెట్లతోపు దగ్గర్నించి అంతా పల్లపు ప్రదేశం. అది మా జీవనాధారం. సముద్రపు నీటితో ఇప్పుడు కలు షితమైపోతున్నది' మరోసారి తమ గోడును చెప్పు కున్నాడు విద్యాపీఠంలో అతనితో మాట్లాడిన వృద్ధుడు.

'మీరెవరూ కలతపడకండి. ఇందుకు కారణం ఏమిటో నేను తెలుసుకు తీరుతాను' అన్నాడు సూసీ యన్.

వెదురుతో చేయబడిన పళ్ళేరాలలో చక్కగా కాల్చిన రొట్టెల్ని తెచ్చి అతని ముందు పెట్టారు మహిళలు.

సముద్రపు ఒడ్డున తను చూసిన దృశ్యమే సూసీ యన్ మనసును అదేపనిగా కలవరపెడుతోంది. ఆకలి మందగించి పోయింది.

'అవసరం అయినప్పుడు నేనే అడిగి ఆరగిస్తాను. ఇప్పుడు వద్దు' అంటూ కనులు మూసుకున్నాడు.

కొద్దిసేపు గడిచిన తర్వాత కూడా అతను కనులు తెరవకపోవటంతో, నిశ్శబ్దంగా వెనుతిరిగి ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు గ్రామస్థులు.

అర్ధరాత్రి సమయంలో కనులు తెరిచాడు సూసీ యాన్. భుజం మీది ఉత్తరీయాన్ని నడుము చుట్టూ చుట్టుకుంటూ సముద్రం వైపు బయలుదేరాడు.

చిన్నగా సకిలించింది అతని వాహనం. తను కూడా అతని వెనుకే బయలుదేరబోయింది.

'వద్దు మిత్రమా.... ఇది ఒడ్డున నిలబడి చేయ వలసిన పనికాదు. నీటిలోకి దిగాలి. అది నీకు అపాయకరం' అంటూ అతిబలవంతంగా దాన్ని గ్రామంలోనే వదిలి, తాను ఒక్కడే అంతకుముందు ఏ బండ మీద కూర్చున్నాడో, తిరిగి అదే చోటికి పోయాడు సూసీయన్.

తన విశ్వరూపం చూపించకముందు ఎలా ప్రశాంతంగా ఉన్నదో, తిరిగి అదే మాదిరి శాంతంగా కనిపించింది నీరు.

మరోసారి బండమీద ఆశీనుడైనాడు అతను. కనులు చిట్లించి తదేకంగా నీటివైపే చూస్తూ ఉండగా--

చెవులు చిల్లులు పడే శబ్దం చేస్తూ ఎగసి పడటం మొదలుపెట్టాయి అలలు. అంతకు ముందు కంటే వేగంగా ఒడ్డు మీదికి వచ్చేయసా గింది నీరు.

అతిగా ఆలోచించలేదు సూసీయన్. బండ మీది నుంచి ఎగిరి నీటిలోకి దూకాడు. ఎత్తెత్తి కొట్ట టానికి ప్రయత్నిస్తున్న అలలకు అందకుండా వెనక్కి తిరగలేదు. బలంగా బారలు వేస్తూ సము ద్రంలోకి పోయాడు.

ఒడ్డును వదిలి దూరంగా పోయిన తర్వాత గుండెల నిండా గాలిని పీల్చుకుని ఒక్కసారిగా నీటిలో మునిగాడు.

**(ఇంకా వుంది)**



# సం గతులూ! సం దర్భాలూ! 7



-ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సెల్:98480 78079

# కుల పర్వతాలు

**ఒక శుభసాయంకాలం వేళ..**

**రిఫార్మిస్టు గిరీశాన్ని కన్‌ఫార్మిస్టు పార్వతీశం ఒక ప్రశ్న అడిగాడు.**

**"మహాశయా! మన సంప్రదాయంలో ఏడు పర్వతాల్ని 'కుల పర్వతాలు' అని పిలుస్తుంటారు ఎందుకని?"**

"ఆహా! మాంచి 'కాంపేను'కు అవకాశం ఇచ్చే ప్రశ్న పృచ్ఛించావు పార్వతీశా! లెక్చర్లిచ్చే పండితుణ్ణి. నాకీ విషయం పేలపిండి అనుకో. అసలు నీకు ఈ కులపర్వతాలవైనం తెలుసా?– తెలియదు. అవి ఒక్క ఏడే కాదు. రెండేళ్ళు పద్నాలుగు. నోటు బుక్కుంటే రాసుకో. ఒక సెట్టు: ఉదయ, అస్త, హిమ, వింధ్య, మేరు, త్రికూట, లోకాలోక పర్వతాలు. మరొక సెట్టు మహేంద్ర, మలయ, సహ్య, మాల్యవంత, ఋక్ష, వింధ్య, పారియాత్ర పర్వతాలు.

నువ్వు ఎంత కన్ఫార్మిస్టువైనా తెలుసుకోవలసింది ఈ పర్వతాలగురించి కానేకాదు. అవి ఎక్కడెక్కడో పడి వాటి మానానికవి ఉన్నాయి.

నీకు నేను లెక్చరివ్వదలచిన అసలు విషయం విను. 'కులం' అనగా తెలుగులో అర్థం ఏమిటి? 'గుంపు' – 'పర్వతం' అంటే ఏవిటి? 'కదిలించ శక్యం కానిది' ఫలితార్థం. ఇవి మన మధ్యనే ఉంటాయనీ, ఎప్పుడూ ఏదో ఒకవైపు మళ్లుతూ కదిలించశక్యం కాకుండా ఉంటాయని! కద!

అలా ఆశ్చర్యంగానూ, భయపడుతూనూ నాకేసి చూడకు. మనదేశంలో 'కులం' అనే మాట చెవినిపడగానే విద్యుద్ఘాతం తగిలినట్టూ, వినకూడని మాట విన్నట్టూ, కొందరు నటిస్తుంటారు. పైగా ఆ మాట మోటుగా అనిపించిగావును, ఆ పేరు మార్చి కొన్నేళ్లుగా 'సామాజిక వర్గం' అని 'రిపేరు' చేయించారు. ఆలూరి సుబ్బారావుగారే చక్రపాణి అన్నట్టు, పేరుమారితే ఏముంది? పదార్థం ఒకటే. సిగ్గెందుకు? విషయం వెల్లడిగానే మాట్లాడుకుందాం.

ఆ పర్వతాలకిలాగే, వేల సంవత్సరాలుగా మన దేశంలో కులాలు కూడా, పాతాళంలోకంటా పాతుకుపోయి ఉన్నాయి. ఆ మధ్య ఒక తోచీతోచని వేళ 'రిమోట్' పట్టుకుని టి.వి.ఛానళ్ళు తిప్పుతున్నాను. ఒక ఆసక్తికరమైన నినాదం లేదా హెచ్చరిక లేదా అభ్యర్థన వాక్యాలు తెరమీద మెరిశాయి.

'కులాలను కూకటివేళ్లతో పెకలిద్దాం' అని వెంటనే నా బుర్రకి ఒక సందేహం గుచ్చుకుంది. అస్తిత్వవాద ఉద్యమాల వడగాలులు, అన్నికులాల వారికీ ఏదో ఒకతీరులో చెమటలు పోయిస్తున్న 21వ శతాబ్దంలో ఏ కులాన్ని ఎవరు పెకలించాలి? అని. ఎందుకంటే, స్వకులాల అస్తిత్వపోరులో నిమగ్నమై ఉన్నవారెవరూ – బుద్ధిమంతులు కనుక–స్వకులాన్ని పెకలించుకునే అవకాశం లేదు. బోధించో, బాధించో, లాలించో, ఇంకొక కులాన్ని పెకలిద్దామంటే, ఆ సదరు కులానికే ఒక అస్తిత్వవాదం ఉన్నదాయె! అదలావుంచు. రాజకీయాలు ఇక్కడా అక్కడా అనే తేడా లేకుండా ఆసేతు హిమాచలం, దేశమంతటా ఏ మోస్తరుగా నడుస్తున్నాయో చూస్తున్నావా? నిన్నకాక మొన్న దేశంలోనే అత్యున్నత పదవికి పోటీ తలెత్తినవేళ, ఆయా ప్రముఖ అభ్యర్థుల వ్యక్తిగత శీలసంపద, సామాజిక లక్ష్యాలు, విద్య, అనుభవ సంపత్తీ ఎంతో ప్రశస్తమైనవైనా ఉభయ రాజకీయ పక్షాలూ 'ప్రొజెక్టు' చేసిన విశేషం ప్రధానంగా ఏమైంది? కులం చుట్టూనే తిరిగింది కద!

అది వదిలెయ్యి. మూలాల్లోకి ఒకసారి వెళ్ళి చూద్దాం. ఎందుకంటే, ఇవాళ, దేశంలో చాలా బలమైన కులాలకీ, బలహీనకులాలకీ మధ్య పెనుగులాటలో అందరి లక్ష్యం రాజ్యాధికారమే కద!

## అసలు కులాల కథ విను

భారతంలో భీష్మపర్వంలో శ్రీకృష్ణమూర్తుల వారు అర్జునుడికి భగవద్గీత బోధిస్తూ, "అబ్బాయీ, గుణం బట్టీ, పని విభజన బట్టీ, నాలుగుకులాలు ఏర్పరచానయ్యా" అన్నాడు కద! అయితే ఈ 'గుణ' 'కర్మ'ల అర్థం అదికాదూ, ఇంద్రియ నిగ్రహం, శాంతస్వభావం అని చెప్పాలీ అంటూ కొందరు సవరణ చెప్పారనుకో, ఆ అర్థాల గొడవలోకి వెళ్ళొద్దు. ఇక్కడొక తమాషా ఉంది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే విభజన ఇప్పటికీ ఉన్నా వేల సంవత్సరాల క్రితమే ఈ కులాల స్త్రీ పురుష సంబంధాల్లో అనులోమ విలోమ కాపురాల కారణంగా, కరణకులం, అంబష్ఠకులం, ఉగ్రకులం, మాగధకులం, మాహిష్యకులం, క్షత్తకులం, సూతకులం, వైదేహికకులం, రథకారకులం, పారశవకులం, చండాలకులం అనే పదకొండు కొత్తకులాలు పుట్టుకొచ్చాయి. ఈ వివరం అమరసింహుడనే ఆయన, క్రీస్తుశకం నాలుగో శతాబ్దిలో కూర్చిన 'అమర నిఘంటువు' వెల్లడించింది. ఈ పదకొండుకులాల్లో మళ్ళీ అనులోమ, విలోమ గుణకారాలతో మరిన్ని 'పిల్ల కులాలు' పుట్టుకొచ్చాయి. అబ్బాయ్ పార్వతీశా! ఇంతెందుకూ? చరిత్రలో యుద్ధాలు, కరువు కాటకాలు, సమాజ వ్యవస్థలో చోటు చేసుకున్న సంస్కరణలు, తప్పనిసరి ఇతర పరిస్థితులూ, "చాతుర్వర్ణ్యాన్నో" ఈ 'ఏకాదశ' కులాలనో అలాగే మననిచ్చాయంటే నేన్నమ్మను.

ఒకప్పుడు ఈ దేశంలో తలెత్తిన మత ఉద్యమాలు, సంస్కరణోద్యమాలు, సమాజంలోంచి కులాన్ని తోడి పారేద్దామని ప్రయత్నించాయి. బౌద్ధ మతం దగ్గర ప్రారంభిస్తే, చార్వాకం, వీరశైవం, తెంగళ్ వైష్ణవం, ఆధునికకాలంలో ఆర్యసమాజం, బ్రహ్మసమాజం, గాంధీ ప్రభావం, తొలితరం కమ్యూనిస్టుల ప్రభావం కులాల భేదాల్ని పెకలించాలనే గాఢ ప్రయత్నాలు చేశాయి. తమ సిద్ధాంతాల డైనమైట్లతో కులపర్వతాలను కూల్చేద్దామనే ఉద్యమించాయి. వీరిలో కొందరి ప్రయత్నాలవల్ల, కులపర్వతాలకి కాస్తకాస్త పెచ్చులూడాయితప్ప అవి పాతుకునే ఉన్నాయి. ఇక ముందు మరీ బలంగా విస్తరిస్తాయేమో కూడా.



ఈ దేశంలో –సారాంశంగా చెపుతున్నా– తోకకి తొంభై జెండాలతో, ఎజెండాలతో ఎన్నికల రాజకీయ సిద్ధాంతాలతో, పావులుకదిపే రాజకీయపార్టీలకన్నా, కులమే బలమైనది. దీని పేరిట తిరుగులేని తర్కాలను సామాజికస్థాయిలోనూ, రాజకీయస్థాయిలోనూ ప్రయోగించే వీలుంది. ఆ యీ కారణాలవల్ల ఏ కులానికి ఆ కులమే ఒక్కొక్కపార్టీగా అవతరించి పోరాటపటిమ చూపగలిగితే, రాజ్యాధికారం సంగతి తేలిపోయే అవకాశాలు మెండు. నా సలహా అడిగితే, అలాగే కుల సామరస్యం సాధ్యం! కులపర్వతాలు విహారస్థలాలు కాగలవు" అని ముగించాడు గిరీశం.

అంతా విని పార్వతీశం చిరునవ్వు నవ్వి, పూజకు వేళయిందని వెళ్ళిపోయాడు.

నవ్య

# పల్లెకు పోదాం!

## తుల్లి రాజగోపాల్

**చాలా ఏళ్ళ తర్వాత మా ఊరికి వెళుతున్నాను. నా కూడా ఇంటర్ చదివే నా కూతురు రమ్య ఉంది. ఉదయం హైదరాబాద్ నుంచి విమానంలో బయలుదేరితే గంటలో రాజమండ్రి సమీపంలోని మధురపూడి విమానాశ్రయం చేరుకున్నాం. అక్కడినుంచి కారు మాట్లాడుకుని కోనసీమ బయలుదేరాం. మా అమ్మాయి దారిలో రకరకాల ప్రశ్నలు వేస్తోంది. "తాతయ్య వాళ్ళ ఊరు ఎలా ఉంటుంది? అక్కడి ప్రత్యేకతలు ఏంటి? మనం అక్కడ ఎన్నిరోజులు ఉంటాం?" అనడుగుతోంది. ఓపిగ్గానే సమాధానాలు చెబుతున్నాను.**



నాన్నను చూసి చాలా కాలమైంది. ఆయన హైదరాబాద్ రారు. ఫోన్‌లోనే మాట్లాడుకుంటాం. ఊళ్ళో మాకు పొలాలు, తోటలు చాలా ఉన్నాయి. అవన్నీ నాన్నే చూసుకుంటారు. వాటిపై వచ్చే ఆదాయంలో నా వాటా నా బ్యాంక్ ఖాతాలో జమ చేస్తుంటారు. ఆ రకంగాను నా బ్యాంకు బ్యాలెన్స్ పెరుగుతూ ఉంటుంది. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా మంచి ఆదాయం నాకుంది. హైదరాబాద్‌లో పెద్ద భవనం, రెండు ఖాళీ స్థలాలు ఉన్నాయి. వాటిలో అపార్ట్‌మెంట్లు నిర్మించి ఫ్లాట్స్ విక్రయించాలనుకుంటున్నాను.

పెద్ద చదువులకోసం నేను పుట్టిన ఊరు వదలాల్సి వచ్చింది. తర్వాత మంచి కంపెనీలో ఉద్యోగం, లక్షల్లో జీతం, పెళ్ళి, పిల్లలు... అన్నీ నగరంలోనే. ఇక ఆ ఊరు వెళ్ళాల్సిన అవసరం అంతగా రాలేదు. ఉద్యోగజీవితం, కుటుంబజీవితం సంతృప్తికరం. భార్యాబిడ్డలతో నగరంలో హ్యాపీగానే ఉన్నాను. ప్రస్తుత పరిస్థితుల్లో మా ఊళ్ళో ఆ పొలాలు ఉండడం నాకు ఇష్టం లేదు. పేరుకు ఎకరాలకు ఎకరాలు ఉన్నా కొన్నేళ్ళుగా వాటిమీద వచ్చే ఆదాయం తక్కువగా ఉంటోంది. అందుకే ఆ పొలాలు అమ్మివేసి వచ్చినడబ్బు నా అకౌంట్లో వేయాలని నాన్నకు చెప్పాలనుకుంటున్నాను. "పొలం పనులు లేకపోతే ఇక్కడ ఉండి చేసేదేముంటుందిరా" అని నాన్న అడిగితే ఆయన్ని నాతో హైదరాబాద్ వచ్చేయమంటాను.

మా కారు కోనసీమ చేరింది. పచ్చని పంట పొలాలు, కొబ్బరిచెట్లు... వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. మేమెక్కిన కారు గోదావరి కాలువ వద్దకు చేరింది. అక్కడినుంచి పడవకాని, పంటుకాని ఎక్కి అవతలి ఒడ్డుకు చేరాలి. ఆ తర్వాత ఆటోకాని, రిక్షాకాని ఎక్కితే ఓ అర గంటలో మా ఊరు చేరతాం. కారు దిగి డ్రైవర్‌కి డబ్బిచ్చి పంపించేశాను. మా లగేజీ తీసుకుని రేవు దగ్గరకు వెళ్ళాం. మా అమ్మాయికి ఇదంతా కొత్తగా ఉంది. నీటిని చూసి సరదా పడిపోతోంది. వచ్చే పోయే జనంతో రేవు సందడిగా ఉంది. పంటులో మనుషులతో పాటు మోటారు బైకులు, సైకిళ్ళు, ఇతర సామాన్లు ఎక్కిస్తున్నారు.

పడవలో వెళదామంటే మా రమ్య వద్దు పంటులో ఎక్కుదామని సరదాపడింది. ఆమె ముచ్చట తీర్చడానికి పంటు ఎక్కాం. నీటిమీద

## తురగా జానకీరాణి కథలపోటీలో రూ. 5,000 బహుమతి పొందిన కథ

ప్రయాణం అదో సరదా. అవతలి ఒడ్డు చేరే లోగా పంటులో ఉన్న వారంతా కబుర్లు చెప్పుకుంటు న్నారు. యువతీయువకుల కేరింతలు, ఆడవాళ్ళ ముచ్చట్లు, మగవాళ్ళ ఉద్యోగం, వ్యాపార గొడ వలు...ఇలా ఒకేసారి ప్రపంచంలోని అన్ని అంశాలు వారిమాటల్లో ధ్వనిస్తున్నాయి. కొన్నిమాటలు విని నాకు నవ్వొచ్చింది. మా అమ్మాయి దృష్టి గోదావరి కాలువలో ప్రవహిస్తున్న నీటిమీద, అందులో కని పిస్తున్న చేపలమీద ఉంది. అవతలి ఒడ్డుకు చేరాం.

మాకోసం నాన్న అక్కడికి వస్తానంటే నేనే వద్ద న్నాను. మేం ఆటోకాని, రిక్షాకాని ఎక్కి ఇంటికి వస్తామని చెప్పాను. రేవు గట్టుపక్కన చాలా ఆటోలు, కొన్ని రిక్షాలు ఉన్నాయి. చాలామంది వాటిని బేరమాడుకుని తమ గమ్యస్థానాలకు వెళు తున్నారు. నేను ఒక ఆటోని పిలిచాను. ఆ డ్రైవరు మా దగ్గరకు వచ్చాడు. ఊళ్ళోకి వెళ్ళాలనిచెప్పి మా లగేజీ ఆటోలో పెట్టబోతున్నాం. ఇంతలో "అబ్బాయి గోరూ బాగున్నారా" అని వినిపించడంతో అటు వైపు చూశాను. మా పొలం పనులు, ఇంటిపనులు చూస్తూ నాన్నకు తోడుగా వుండే వెంకన్న. రెండెడ్ల బండి తోలుకుంటూ వెళుతున్నాడు. నన్ను చూడ గానే ఆనందం పట్టలేక గట్టిగా అరిచాడు.

వద్దని వారిస్తున్నట్లుగా. నా కూతురు ఒప్పు కోలేదు. "ఆటోలో వద్దు. ఎడ్లబండే ఎక్కుదాం" అని పట్టుబట్టింది. వెంకన్న నవ్వుతూ "చిన్నమ్మ గారి ముచ్చట కాదనడమెందుకు బాబు, రండి" అని బండి దిగి మా లగేజీ దానిలో పెట్టాడు. మా అమ్మాయి బండిలో ఎక్కేందుకు వీలుగా ఆ పక్కనే దుకాణం దగ్గర ఉన్న ఒక స్టూలు తీసుకొచ్చి పెట్టాడు. రమ్య నా చేతి ఆసరాతో స్టూల్‌మీదుగా ఎడ్లబండి ఎక్కింది. నేనూ బండిలో కూర్చోగానే వెంకన్న ఆ స్టూల్ తీసుకువెళ్ళి ఇచ్చేశాడు. తర్వాత బండెక్కి ఎడ్లను అదిలించాడు. అవి చురుగ్గా కదులు తుంటే బండి వేగంగా పరుగెత్తసాగింది.

నా కూతురు చిన్నపిల్లలా సంబరపడిపోతోంది. అదిచూసి నాకు చాలా ఆశ్చర్యమేసింది. విమా నాల్లో విదేశాలు తిరిగి వచ్చినప్పుడు కూడా ఆమెలో ఇంత సంతోషం చూడలేదు. ఆ ఎడ్లబండి ఆమెకు చాలా సరదాగా అనిపిస్తోంది. వేగంగా కదులుతున్న ఎడ్లను, రోడ్డుకు ఇరువైపులా ఉన్న పచ్చని పంటపొలాలు, అక్కడ వాలుతున్న పక్షులు, చెట్లు చూసి పులకించిపోతోంది.

"తాతయ్య వాళ్ళ ఊరికి ఇలా ఎడ్లబండిలో వెళ్ళడం ఎంతబాగుందో తెలుసా" అంది సంతోషంగా. వెంకన్న వెనక్కి తిరిగి నావంక చూసి నవ్వాడు. నా కూతురినిచూస్తే ఎంతో ముద్దొస్తోంది ముచ్చటగా అనిపించింది. రేవునుంచి ఇరవై కిలోమీటర్లు ఉన్న మా ఊరు ఇట్టే వచ్చేసినట్లనిపించింది. "అప్పుడే తాతయ్య ఇల్లు వచ్చేసిందా" అంది రమ్య నిరాశగా. ఎడ్లబండి దిగడం ఇష్టంలేనట్టు దానిపై నించొని అలాగే ఉండిపోయింది.

చేస్తున్నారు. వడ్రంగిపని చేసేవారిలో ఒకతను "బాగున్నావా శీనుబాబూ" అనడంతో అటు వైపు చూశాను. అతను రాము. చిన్నప్పుడు నాతో కలిసి చదువుకున్నాడు. "ఏయ్ రామూ, ఎలా ఉన్నావ్? నువ్వు చాలా మారిపోయావు తెల్సా" అన్నాను. "నువ్వు మాత్రం మారలేదు శ్రీనుబాబు" అన్నాడు. నిజమే తను నాఈడు వాడైనా నాకంటే పెద్దవా డిలా కనిపిస్తున్నాడు. కుటుంబ బరువుబాధ్యతలు మోస్తున్నవాడిలా కనిపిస్తున్నాడు. నేనేమో జీన్స్ పాంటు, బ్రాండెడ్ షర్ట్‌తో టక్‌చేసుకుని ఇంకా యవ్వనంతో కనిపిస్తుంటే రాము గెడ్డం నెరిసి పోయి కనిపిస్తున్నాడు.

ఈలోగా నాన్న అక్కడకు వచ్చి "ఇప్పుడు మన రాము ఈ ఊళ్ళో పెద్ద పనోడు. వడ్రంగి పనితోపాటు తాపీపని నేర్చుకోవడంతో ఇళ్ళు కూడా కట్టేస్తు న్నాడు తెలుసా!" అన్నారు. "అలాగా!" అని నేను అనడంతో అతను సిగ్గుపడ్డాడు. మా చిన్నప్పుడు రాము వాళ్ళ నాన్న వడ్రంగిపని చేసేవాడు. ఇతను హైస్కూలుతో చదువు ఆపేసి తండ్రికి సాయంగా ఆ పనిలోకి దిగి తర్వాత కుటుంబభారం తనమీద వేసుకున్నాడు. పెరుగుతున్న ఆర్థిక అవసరాలను తట్టుకునేందుకు తాపీపని కూడా నేర్చుకోవడంతో మేస్త్రీగా ఎదిగాడు. మరింత డబ్బు సంపాదించా లని పట్నం వెళ్ళకుండా ఉన్న ఊళ్ళోను, చుట్టు పక్కల గ్రామాల్లోను పనిచేస్తూ జీవనం సాగిస్తు న్నాడు. ఆరోజు పని పూర్తయ్యాక మళ్ళీ కలుస్తా నని రాము వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు అతడిని ఆపి మిత్రులు గిరి, రమణ ఎక్కడ ఉన్నారు, ఎలా ఉన్నా రని అడిగాను. ఈ ఊళ్ళోనే ఉన్నారని చెప్పాడు. వీలు



నేను నవ్వుతూ "వెంకన్నా ఎలా ఉన్నావ్" అని కుశల ప్రశ్నలు వేశాను. "బెమ్మాండంగా ఉన్నా నబ్బాయిగోరూ, ఎవరూ మీ అమ్మాయిగోరా" అని మా రమ్యను చూసి అడిగాడు. నేను నవ్వాను. "అచ్చం మీ పోలికేనండి. బంగారుబొమ్మలా ఉన్నారు" అన్నాడు. మా అమ్మాయి సిగ్గుపడింది. "ఎక్కడి కెళ్ళొస్తున్నావ్?" అనడిగాను. "రాయుడిగారింటికి బియ్యంబత్తాలు దింపి వత్తున్నానండి. మనింటి కెళుతూ ఇటుసూత్తే మీరు అగుపించారు" అన్నాడు. "సరే నువ్వెళ్ళు. మేం ఆటోలో వచ్చేస్తాం" అన్నాను.

"డాడీ ఎడ్లబండెక్కుదాం" అంది మా అమ్మాయి. "నువ్వంతదూరం బండిలో కూర్చో గలవా? రోడ్డు కుదుపులకు ఇబ్బందిపడతావ్" అన్నాను,

నేను నవ్వుతూ "ఇక్కడ ఉన్నన్ని రోజులూ ఆ బండి ఎక్కి తిరుగుదువుగానిలే, వెంకన్న రోజూ నిన్నలా తిప్పుతాడు" అన్నాను. "నిజంగా! అయితే సరే" అని నెమ్మదిగా బండి దిగింది. మమ్మల్ని చూడగానే నాన్నకళ్ళలో మెరుపు తెలుస్తూనే ఉంది. మనవరాలిని ప్రేమగా దగ్గరకు తీసుకున్నారు. "తాతయ్యా, ఈ ఊరు చాలా బాగుంది. ముఖ్యంగా ఆ ఎడ్లబండి నాకు భలే నచ్చేసింది" అంది. ఆయన ఆప్యాయంగా ఆమె తల నిమిరారు. వెంకన్న లగేజీ లోపల పెట్టాడు. ముఖం, కాళ్ళూ, చేతులూ కడు క్కొని ఫ్రెషప్ అయ్యాం.

నాన్న ఇంట్లో ఏదో పని చేయిస్తున్నారు. వడ్రంగి పనివాళ్ళు తలుపులు, గుమ్మాలు బాగు

చూసుకుని వాళ్ళని కలవాలని నిర్ణయించుకున్నాను.

మేం ఆ ఊరికివెళ్ళిన రెండోరోజు వర్షం కురి సింది. వాన వెలిసిన తర్వాత బయటనుంచి మా నాన్న "రమ్యా, ఇలా రామ్మా" అని పెద్దగా పిలవడంతో నా కూతురు లేడిపిల్లలా చెంగుచెంగున దూకుతూ బయటకు పరుగెత్తింది. లోపలనుంచి నేను ఆయన వంక చూస్తున్నాను. నాన్న రమ్యకు ఆకాశంవంక చేతితో చూపించారు. అలా చూసిన మా అమ్మాయి "ఓహ్! రెయిన్‌బో.... వండర్‌ఫుల్ తాతయ్యా. ఎంత బావుందో. పుస్తకాల్లో చూడ్డం తప్ప, ఇంతవరకు నేచురల్‌గా ఇలా ఎప్పుడూ చూళ్ళేదు" అంటుండడంతో నేనూ రోడ్డుమీదకు వెళ్ళి చూశాను. ఆకాశంలో ఏడురంగుల ఇంద్రధనుస్సు.

అద్భుతంగా ఉందా సన్నివేశం. చిన్నపిల్లాడిలా దాని వంక చూస్తూ ఉండిపోయాను. నా కూతురు చాలాసార్లు అడిగేది. పుస్తకాల్లో రెయిన్‌బో బొమ్మ చూసి "ఆకాశంలో ఎప్పుడు కనిపిస్తుందో చూపించు డాడీ" అనేది. కాని కాంక్రీట్ జంగిల్‌లాంటి నగరంలో ఆకాశహర్మ్యాలమధ్య ఇంద్రధనుస్సు చూపించడానికి కుదరనే లేదు.

తర్వాతరోజు గిరి ఇంటికి వెళదామని బయలుదేరాను. నావెంట మా అమ్మాయి వచ్చింది. తన చేతిలోని స్మార్ట్‌ఫోన్ కెమెరాలో తనకు నచ్చిన వాటిని చిత్రీకరిస్తోంది. గిరి ఇంటికి వెళ్ళేసరికి అతను మాకు ఎదురొచ్చి "శీనూ... ఎన్నాళ్ళయిందో నిన్నుచూసి" అంటూ నా చేతులు పట్టుకున్నాడు ఆప్యాయంగా. నేనుకూడా అతడి భుజంచుట్టూ అభిమానంగా చేతులు వేశాను. ఎంతయినా నా చిన్నప్పటి నేస్తం. స్కూల్లో చాలా అల్లరి చేసేవాడు. ఆటల్లో ఎప్పుడూ అతనే ఫస్టు. అల్లతద్దికి గిరి చేసే అల్లరి భరించలేక ఊరంతా గగ్గోలు పెట్టేది. రాత్రిపూట కరణంగారి పెరట్లో బత్తాయి, నారింజచెట్ల కాయలన్నీ కోసేసి అందరికీ పంచిపెట్టేవాడు. అనేకమంది ఇళ్ళలోని పువ్వులన్నీ కోసి ఆడపిల్లలకు ఇచ్చేవాడు. ఊరి మధ్యలో రచ్చబండ దగ్గరున్న చెట్టుకు కట్టిన ఉయ్యాలమీద అతనిలా ఎవరూ ఊగలేకపోయేవారు. ఎంత విసురుగా ఊపినా భయపడేవాడు కాదు. చిన్నప్పటి ముచ్చట్లన్నీ జ్ఞాపకం వచ్చాయి.

గిరి తల్లి నన్ను గుర్తుపట్టి "బాగున్నావా శీనుబాబూ" అని పలకరించింది. రమ్యనుచూసి "పిల్ల చాలా చలాకీగా ఉందే" అందామె. నేను నవ్వుతూ "నాయనమ్మకు నమస్కారం చెయ్యి" అనగానే నా కూతురు రెండుచేతులూ జోడించింది. ఆ మాత్రం దానికే ఆ పెద్దావిడ. "నా తల్లే, పట్నం పిల్లవైనా వినయ విధేయతలు ఉన్నాయి" అని రమ్య బుగ్గలు పుణికి ఆప్యాయంగా పొదివిపట్టుకుంది. మా అమ్మ బతికుంటే నా కూతురినిచూసి ఇలాగే మురిసిపోయేది అనుకోగానే నా కళ్ళు తడిదేరాయి.

గిరి మమ్మల్ని ఇంట్లోకి తీసుకెళ్ళాడు. వాళ్ళ ఇల్లు ఏమీ మారలేదు. ఒకప్పుడు తాటాకిల్లు ఉండేది. ఇప్పుడు పెంకుటిల్లు అంతే. వారి కులవృత్తి చేనేత కావడంతో అదే గొయ్యి, అదే మగ్గం, అదే నేత. మగ్గం గోతిలో వాళ్ళ నాన్న కూర్చుని నేస్తున్నాడు.

"అదేంటి? మీ నాన్న ఇంకా పని చేస్తున్నారా?" అనడిగితే గిరి చిన్నగా నవ్వుతూ, "ఇప్పటి వరకూ నేనే నేస్తున్నాను. నువ్వు రావడంచూసి లేచి వచ్చాను. పని ఆగిపోవడం ఇష్టంలేక నాన్న మగ్గంముందు కూర్చొని నేస్తున్నారు" అన్నాడు. నేత నేస్తున్న ఆ పెద్దాయనవంక మా అమ్మాయి ఆశ్చర్యంగా చూస్తోంది. ఎందుకంటే నేస్తున్న వ్యక్తి సగం మగ్గంకింద, సగం మగ్గంకి పైన ఉంటాడు. ఆ మగ్గం గొయ్యి, ఆ నేత చూడడం మా రమ్యకు ఇదే మొదటిసారి.

అంతవరకు కండెలు చుడుతున్న గిరి భార్య మాకు టీ పెట్టడానికి లోపలికెళ్ళింది. గిరి తల్లి తెగిన పోగులు అతకసాగింది. గిరి తండ్రి వీరభద్రం ఎంతో నైపుణ్యం ఉన్న నేతగాడు. ఆయన ఎంతో మన్నికైన వస్త్రాలు నేస్తారని పేరుండేది. ఇప్పుడు ఆయన మగ్గం నేస్తున్నప్పుడు వస్తున్న శబ్దం ఎంతో లయబద్ధంగా, వినేందుకు హాయిగా ఉంది. ఒక ప్రముఖ కవి చెప్పినట్లు ఏ దేవతో గానం చేస్తున్నట్లుంది. గిరి కూడా తండ్రి బాటలోనే నడిచి చేనేత కులవృత్తికే అంకితమయ్యాడు.

మా అమ్మాయి గిరితో "అంకుల్ నాకు చేనేత గురించి కొద్దిగా ఎక్స్‌ప్లెయిన్ చేయండి" అంది. "చేతివృత్తుల్లో ఒకప్పుడు చేనేతవృత్తికి ఎంతో గొప్ప స్థానం ఉండేదమ్మా. ఈ వృత్తి చేపట్టిన వారు పూర్వకాలంలో ఎంతో గౌరవాదరణలు పొందేవారు. అగ్గిపెట్టెలో అమరేలా చీర నేసిన నైపుణ్యం మన దేశ చేనేత పనివారి సొత్తు. కాలంతోపాటు ప్రజల అభిరుచులు, అలవాట్లు మారాయి. యంత్రాలపై తయారయ్యే వస్త్రాలకు, రెడీమేడ్ దుస్తులకు ఆదరణ పెరిగింది. దీంతో చేనేతను నమ్ముకుని బ్రతుకుతున్న మాలాంటి లక్షలాదిమంది నేతన్నల బతుకు దుర్భరంగా మారింది. ఎంతో కష్టపడినేసిన చేనేత వస్త్రాలకు తగిన ప్రతిఫలం లభించడం లేదు. వచ్చే ఆదాయం కుటుంబ అవసరాలకు సరిపోదు. ప్రభుత్వం ఆదుకుంటేనే మాకు భవిష్యత్" గిరి విచారంగా చెప్పాడు.

మా అమ్మాయి తన స్మార్ట్‌ఫోన్‌లోని యూట్యూబ్‌లోకి వెళ్ళి "అంకుల్ ఇందులో లేటెస్ట్ డిజైన్లు ఉన్నాయి చూడండి. ఇలాంటివి ట్రై చేస్తే మీ వస్త్రాలకు డిమాండ్ పెరగవచ్చు" అని రకరకాల డిజైన్లు

**అతనొక సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. లక్షల్లోజీతం. పైగా రియల్‌ఎస్టేట్ వ్యాపారం. అదీ కలిసొచ్చింది. కోట్లు సంపాదించి నగరంలో సెటిలైపోయాడు. ఇక గ్రామంలో ఎకరాల కెకరాలు పొలాలున్నాయి. ఆ ఆదాయం కూడా అతని బ్యాంకు అకౌంట్లో జమ అవుతోంది. బిజినెస్‌మైండ్‌తో ఆలోచించి ఓ నిర్ణయం తీసుకుని తన గ్రామానికి బయలుదేరాడతను. వెంట కూతుర్నీ తీసుకెళ్ళాడు. ఆ గ్రామంలో వాళ్ళేం చూశారు? ఏం చేశారు?**

చూపించసాగింది. అతను ఆప్యాయంగా రమ్య తల నిమురుతూ "భలే చెప్పావమ్మా, నిజమే. ఈ డిజైన్లు చాలా బాగున్నాయి" అని వాటిని పరిశీలించసాగాడు. ఈలోగా బయట నుంచి వచ్చిన గిరి కూతురు కూడా ఆ డిజైన్లను ఆశ్చర్యంగా చూస్తూ "కొత్తగా నేసే చీరలకు ఇవి బాగుంటాయి నాన్న" అంది. "అలాగేనమ్మ. ఈసారి ఈ డిజైన్లు ఉపయోగిద్దాం" అన్నాడు గిరి. "నేను ఇవన్నీ డౌన్‌లోడ్ చేసి మీకిస్తానంకుల్" అంది రమ్య.

ఎన్నో ఇబ్బందులమధ్య ఎంతో గుండెధైర్యంతో కులవృత్తిని కొనసాగిస్తున్న గిరి కుటుంబాన్ని చూసి నాకు మనసులో బాధగా అనిపించింది. కాని వారి ముఖాల్లో సంతోషం, పెదాలపై చిరునవ్వు చెరగడం లేదు. అదే వారి గొప్పదనం. అక్కడ చాలాసేపు ఉన్నాం. వాళ్ళు పనిచేస్తున్న విధానాన్ని రమ్య సెల్ కెమెరాలో చిత్రీకరించింది. మధ్యాహ్నం సమయానికి నాన్న ఫోన్ చేయడంతో వారి వద్ద వీడ్కోలు తీసుకుని ఇంటికి బయలుదేరాం.

ఇంటిముందు రాము పనులు పూర్తి చేసినట్టున్నాడు. నాన్న అతనికి డబ్బిచ్చి పంపిస్తున్నారు. "తర్వాత కలుస్తాను శీనుబాబు" అనిచెప్పి వెళ్ళిపోయాడు రాము.

ఆరోజు రాత్రి త్వరగా భోజనాలు ముగించి పడుకోడానికి సిద్ధమవుతున్నాను. నాన్న రమ్యని తీసుకుని ఎక్కడికో బయలుదేరుతున్నారు. "ఈ సమయంలో ఎక్కడికి?" ఆశ్చర్యంగా అడిగాను. "చెరువు దగ్గరకు" బదులిచ్చారాయన. "ఇప్పుడెందుకు? మీవెంట రమ్యను తీసుకెళుతున్నారేంటి?" ప్రశ్నలు సంధించాను. "వచ్చాక చెబుతాం డాడీ" అని నా కూతురు నవ్వుతూ నాన్నవెంట బయటకు నడిచింది. వాళ్ళొచ్చేవరకు నాకు ఆ సస్పెన్స్ ఏంటో తెలియదు. సరే, వచ్చాక వాళ్ళే చెబుతారులే అనుకుని పుస్తకంతీసి చదువుకోసాగాను. గంటన్నర గడిచాక ఇద్దరూ వచ్చారు. వస్తూనే మా రమ్య "డాడీ, వెన్నెల్లో చెరువు ఎంత అందంగా ఉందో తెలుసా! చెరువునీటిలో నిండు చందమామ ప్రతిబింబం కదులుతుంటే చూడ్డానికి ఎంత బాగుందో" అని ఆనందంగా చెబుతోంది. నాకు చిన్ననాటి సంగతులు జ్ఞప్తికివచ్చాయి. పున్నమిరోజున నాన్న నన్ను అక్కడికి తీసుకువెళ్ళి అలాగే చూపించేవారు. నాన్న గదిలోనే రమ్య పడుకుంటోంది. వాళ్ళిద్దరూ చెప్పుకుంటున్న కబుర్లు నాకు వినిపిస్తూనే



ఉన్నాయి. తాతయ్యతో కబుర్లు చెబుతూ కిలకిలానవ్వుతోంది. వారి మాటలు అలా వింటూనే నిద్రలోకి జారుకున్నాను.

తెల్లారి ఆరుగంటలకే తెలివొచ్చింది. నేను వచ్చినపని నాన్నతో ఎలా మొదలుపెట్టాలో తెలియడంలేదు. ఆలోచనల్లతో అన్యమనస్కంగానే లేచి నెమ్మదిగా తయారయ్యాను. టిఫిన్ చేశాక ఊళ్ళో తిరిగొద్దామని మా రమ్య గోల చేసింది. ఆ ఊళ్ళో ఇంకా చూడాల్సినవి, తన కెమెరాలో చిత్రీకరించాల్సినవి చాలా ఉన్నాయని చెప్పింది.

నాన్నకుచెప్పి బయటకు వచ్చాం. అలావెళుతూ రమణ ఉండే వీధిలోకి వచ్చేసరికి నా ప్రమేయం లేకుండానే నా కాళ్ళు రమణ ఇంటివైపు నడిచాయి. అది పాతకాలంనాటి ఇల్లు. ఒకవైపు పశువులపాక. ఇంటిముందు పెంపుడుకోళ్ళు తిరుగుతున్నాయి. నేను గుమ్మంలోకి వెళ్ళగానే ఒక ఆడమనిషి ప్రశ్నార్థకంగాచూస్తూ బయటకు వచ్చింది. రమణ భార్య అయి ఉంటుందని "రమణ కోసం వచ్చాను. ఉన్నాడా?" అనడిగాను. "మీరు" అంది. "నా పేరు శ్రీను. రాజారావుగారి అబ్బాయిని" అని చెప్పాను.

"ఓ... శీనుబాబు అంటే మీరేనా! మీ గురించి అప్పుడప్పుడు చెబుతుంటారు. ఆయన పొద్దున్నే చేలోకి వెళ్ళారు. రావడం ఆలస్యం అవుతుంది. లోపలికి రండి" అని ఆహ్వానించింది.

"ఫర్వాలేదమ్మా. నేను పొలం దగ్గరకెళ్ళి రమణను కలుస్తాను" అనిచెప్పి వచ్చేశాను. "పద మన చేలుకూడా చూద్దువుగాని" అని మా అమ్మాయికి చెప్పి గబగబా నడవసాగాను. "డాడీ ఏంటా కంగారు. నెమ్మదిగా నడవండి. నేను ఇవన్నీ వీడియో తీసుకోవాలి కదా" అంది రమ్య. నేను నడక వేగం తగ్గించాను.

మేం మాట్లాడుకుంటూ పంటచేలు ఉన్న ప్రాంతానికి చేరుకున్నాం. కనుచూపుమేర అంతా పచ్చని తివాచి పరిచినట్లు పంటపొలాలు. మా పొలాలు ఎక్కడి నుంచి ఎంతవరకు ఉన్నాయో మా అమ్మాయికి చూపించసాగాను. దూరంగా పొలంలో పని చేస్తున్న వెంకన్న కనిపించాడు. దగ్గరకు వెళ్ళగానే మమ్మల్నిచూసి "అయ్ బాబోయ్, సెప్పాపెట్టకుండా ఇలా వచ్చేశారేంటండి" అని ఆశ్చర్యపోతూ అడిగాడు. "ఇదంతా మన పొలమేనా?" రమ్య అడిగింది. "అవునమ్మాయిగోరూ...అదిగదిగో ఆ చివర తాడిసెట్టు వరకు మనవే" అన్నాడు.

"రమణ పొలానికి ఎటువైపు వెళ్ళాలి" వెంకన్నను అడిగాను. "అదిగోనండి. అలా ఎడమచేతివైపు ముందుకెళ్తే ఆళ్ళ సేలు వత్తాయండి".

"సరే నేను రమణను కలిసి వస్తాను" అనిచెప్పి ముందుకు కదిలాను. నేను వెళ్ళేసరికి రమణ పంటకాలువకు అడ్డుపడిన మట్టిని, ఆకుల్ని చిన్న పారలాంటి దానితో తొలగిస్తున్నాడు. పంచె కట్టుకోలేదుగానీ, తలకు టవల్ చుట్టుకుని బనీను, ప్యాంటుతో ఉన్నాడు. చొక్కా అక్కడి చెట్టుకు తగిలించి ఉంది. నన్ను చూడగానే గుర్తుపట్టేశాడు. చేస్తున్నపని వదిలేసి "శీనూ ఎలా ఉన్నావ్! ఎప్పుడొచ్చావ్" అని ప్రశ్నలు వేశాడు.

"ఊరొచ్చి మూడురోజులైంది. మీ ఇంటికెళ్తే పొలంలో ఉన్నావని చెప్పారు. ఇలా వచ్చేశాను" అని రమ్యను పరిచయం చేశాను. "ఇంటర్ చదువుతున్న కూతురు ఉన్నా అప్పుడెలా ఉన్నావో ఇప్పుడూ అలానే ఉన్నావు. ఏమీ మారలేదు" అన్నాడు.

"మీరు భలే చెప్పారంకుల్, డాడీని మా అన్నయ్యంటే అంతా నమ్మేస్తారు" అంది నన్ను ఆట పట్టిస్తున్నట్లుగా. ఇద్దరం నవ్వుకున్నాం. పొలం గట్టుమీద ఉన్న కొబ్బరిచెట్టు బొండాలు తనే స్వయంగా దింపి తెచ్చాడు. వాటిని కత్తితోకొట్టి దాహం తీర్చుకోమని ఇచ్చాడు. కొబ్బరినీళ్ళు తాగుతూ "ఏంటి సంగతులు? నీ గురించి చెప్పు" అన్నాను.

"ఒక్కడే అబ్బాయి, అగ్రికల్చరల్ బీఎస్సీ చదువుతున్నాడు" అని చెప్పాడు. "అదేంటి? వాడిని కూడా నీలాగే పొలం పనుల్లోకి దింపుదామనుకుంటున్నావా?" ఆశ్చర్యంగా అడిగాను. "నా తర్వాత వాడే కదా వ్యవసాయం చూసుకోవాల్సింది" అన్నాడు. నాకు మతిపోయింది. రమణవాళ్ళ నాన్న వ్యవసాయం చేసేవాడు. స్వయంగా ఆయనే పొలంపనులన్నీ చేసేవాడు. మాకూ పొలాలు ఉండడంతో నాన్నతో ఆయనకు మంచిస్నేహం

## సుధామ పదగారడి-328

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ❖ | ❖ | 1 | 2 | | 3 | | ❖ | ❖ |
| ❖ | 4 | ❖ | | ❖ | | ❖ | 5 | ❖ |
| 6 | | 7 | | ❖ | 8 | 9 | | 10 |
| ❖ | ❖ | | ❖ | 11 | ❖ | | ❖ | |
| 12 | | ❖ | 13 | | | ❖ | 14 | |
| | ❖ | 15 | ❖ | | ❖ | 16 | ❖ | ❖ |
| 17 | 18 | | 19 | ❖ | 20 | | 21 | |
| ❖ | | ❖ | | ❖ | | ❖ | | ❖ |
| ❖ | ❖ | 22 | | | | | ❖ | ❖ |

**ఆధారాలు**

**అడ్డం**

1. సంగతులు సందర్భాలు చెబుతున్న ఇంద్రగంటి (5)
6. ఎయిర్‌ఫోర్స్ (4)
8. రాష్ట్రాధినేత పదవి (4)
12. పశువు (2)
13. మేఖల (3)
14. ఊపిరున్నంతకాలం వుండేది (2)
17. పూబోడి అనే! (4)
20. పొట్ట (4)
22. కలహభోజనుడైన యతి (5)

**నిలువు**

2. ఎయిర్‌హోస్టెస్ నుంచి సినీనటి అయిన అందాల తెలుగుతార (3)
3. శరణము అన్న అందులోంచి బాణము తీశారా! (3)
4. దాచిపెట్టు (2)
5. పొగ (2)
7. పరిచర్య (2)
9. తలక్రిందయిన లేలేక ఆలేఖ్య (2)
10. ట్రయాంగిల్ (3)
11. అడ్డాలనాడు బిడ్డలుగానీ ఇవి వచ్చాకా? (3)
12. హారము (3)
15. జారుగా మధ్యలో లేని చోటు (2)
16. సమూహము (2)
18. మరల, తిరిగి (2)
19. అడుగునుండి వీరపుత్రి ముందే పోయింది (3)
20. వేడి (3)
21. చీముపట్టిన పుండు నుండి కారేది(2)

### పదగారడి-327 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 స్వా | 2 తం | త్ర్య | 3 ది | నో | త్స | 4 వం | ■ |
| 5 వి | ను | తి | ■ | ధు | ■ | ■ | 6 గు | 7 హ |
| ■ | భ | ■ | 8 అం | బా | లి | 9 క | ■ | ను |
| 10 భ | వం | 11 తి | ■ | టు | ■ | 12 ల | 13 కు | మ |
| ■ | ■ | 14 ర | థం | ■ | 15 వి | ■ | క్క | ■ |
| 16 తా | లూ | కా | ■ | 17 సం | పం | గి | ■ | 18 వం |
| టం | ■ | 19 సు | 20 ధ | ■ | చి | ■ | 21 సా | ద |
| 22 కం | 23 ప | ■ | మ | ■ | ■ | 24 దూ | ■ | నం |
| ■ | 25 కృ | ష్ణ | ని | జ | న్మ | ది | నం | ■ |

## అందుకే తప్పుకుందట!

*హీరో రామ్ సినిమా 'జిందగీ' నుంచి మేఘా ఆకాష్ తప్పుకోవడం గురించి చాలా వార్తలు హల్‌చల్ చేశాయి. వీటి మీద మేఘా ఆకాష్ చివరికి నోరు విప్పింది. ఈ సినిమా కన్నా ముందే తెలుగులో మరో మూడు సినిమాలు ఒప్పుకుందట! దానితో దీనికి డేట్లు అడ్జస్టు కాలేదని చెప్పుకొచ్చింది. మామూలుగా హీరోయిన్లందరూ సినిమా ఎందుకు వదులుకున్నామో చెప్పాల్సి వస్తే ఇదే కారణాన్ని ఎంచుకుంటారు. కానీ ఈ సినిమాలో మేఘా ఆకాష్ సెకండ్ హీరోయిన్ అట! అందుకే ఈ సినిమాను వదులుకుందట! మేఘా నోరు తెరిచి ఈ విషయాన్ని చెప్పకపోయినా, సినీ జనాలు అసలు సంగతిని ఊహించేశారట!*

ఉండేది. రమణ చాలా తెలివైనవాడు. స్కూల్లో అన్ని సబ్జక్టుల్లోను అతను ఫస్టే. లెక్కలు చాలాబాగా చేసేవాడు. నాకు తెలియనివి అతనితోనే చెప్పించుకునేవాడిని. పదోతరగతిలో నాకన్నా ఎక్కువ మార్కులు అతనికి వచ్చాయి. ఇంటర్‌లో ఇద్దరం ఎంపీసీగ్రూపు తీసుకున్నాం. అప్పుడూ అతనికి మంచి మార్కులు వచ్చాయి. ఇంటర్ తర్వాత రమణ చదువు ఆపేసి తండ్రితో వ్యవసాయంలోకి దిగాడు. నేను ఎంసెట్ రాసి ఇంజనీరింగ్ చదవడానికి సిటీకి వెళ్ళిపోయాను. చదువు పూర్తవ్వగానే నిపుణుడిగా మంచి ప్యాకేజీతో ఉద్యోగం వచ్చింది. సంపాదన బాగుండడంతో ఆస్తి బాగా కూడబెట్టాను. రియల్‌ఎస్టేట్ రంగంలోకి దిగడంతో అది కూడా కలిసొచ్చి కోట్లకు పడగెత్తాను.

ఆరోజున రమణకూడా నాతోపాటు ఇంజనీరింగ్ చదివుంటే అతనూ ఇవాళ మంచి పొజిషన్‌లో ఉండేవాడేమో. కాని వ్యవసాయాన్ని నమ్ముకుని ఈ ఊళ్ళోనే ఉండిపోయాడు. ఐదెకరాల పొలం ఇప్పుడు మూడెకరాల్లోకి వచ్చింది. ఇప్పుడు కొడుకును కూడా తన దారిలో నడిపించడానికి సిద్ధమవుతున్నాడు. నాకు అతనిమీద కోపం వచ్చింది. కాలంతోపాటు మారకపోతే ఎలా? అందుకే "వ్యవసాయాన్ని నమ్ముకుని నువ్వేం సంపాదించగలిగావ్? మీ ఇల్లు ఏమీ మారలేదు. నీ ఆర్థికపరిస్థితి కూడా పెద్దగా మారినట్లు కనిపించడంలేదు. వ్యవసాయం జూదంగా మారిపోయింది. సకాలంలో వానలురావు. వానలు కురిసినా విత్తనాలు అందవు. అరకొరజల్లులతో సాగినా పంటలు సరిగా పండవు. వరదలు, తుపానులు తట్టుకుని పంటలుపండినా గిట్టుబాటుధర రాదు. కష్టానికి తగిన ప్రతిఫలంరాక రైతులు దిగులు చెందుతున్నారు. ఇలాంటి వాతావరణంలో ఏటా వ్యవసాయాన్ని వదిలేస్తున్న రైతుల సంఖ్య పెరుగుతోంది. ఇవన్నీ తెలిసికూడా వ్యవసాయం చేయడం అవసరమా?" అనడిగాను. నేను వచ్చినపని పూర్తి చేసుకోడానికి రమణకూడా నాకు మద్దతుగా మాట్లాడతాడని ఆశించాను. రమణ చిన్నగా నవ్వుతూ "చాలా ఏళ్ళుగా నగరంలో జీవించడం వల్ల నువ్వు రైతు బిడ్డవన్న సంగతి మర్చిపోయావా ఏంటి? చాలామందికి ఒక అపోహ ఉంది. వ్యవసాయమనేది చదువులేనివారి వృత్తి అని భావిస్తుంటారు. కానీ అది తప్పు. ఇంజనీరింగ్, సైన్సు సబ్జెక్టులకన్నా వ్యవసాయంలోనే సాంకేతికత ఎక్కువ. ఎంతో జ్ఞానం ఉంటేకాని ఆదర్శరైతుగా ఉండలేడు. ఉద్యోగాలు చేసేవారు ఎవరో ఒకరికింద పనిచేయాల్సి ఉంటుంది. రైతుమాత్రమే ఎవరికీ ఊడిగం చేయకుండా స్వతంత్రంగా ఉండగలుగుతాడు. నా కొడుకులాంటివారు, నీలాంటి విద్యావంతులు వ్యవసాయరంగంలోకి రానంతవరకు దేశం క్లిష్ట పరిస్థితిని ఎదుర్కోవాల్సి ఉంటుంది. అందుకే వ్యవసాయాన్ని గౌరవప్రదమైన వృత్తిగా చూడాలి" అన్నాడు ఆవేశంగా.

నాముఖం కోపంతో జేవురించింది. అది గమనించిన రమణ "శీనూ, నిన్ను తప్పుపట్టడానికి ఇలా పరుషంగా మాట్లాడ్డంలేదు. అందరికీ అన్నంపెట్టే రైతన్న భూమితో ఉన్న బంధాన్ని అంత త్వరగా వదులుకోలేడు. లాభనష్టాలతో బేరీజు వేసుకోకుండా ఏటా కొత్త ఆశలతో ఏరువాక సాగించాలి. నేనొక రైతునని చెప్పుకోడానికి ఎప్పుడూ గర్వపడుతుంటాను. నీలా చదువుకున్నవాళ్ళు కొద్దిశాతమైనా పట్టణాలు వదిలి గ్రామాలకు రావాలి. ఆధునిక పద్ధతుల్లో వ్యవసాయంచేసి చిన్న, సన్నకారు రైతులకు మార్గదర్శకంగా ఉంటూ పల్లెల్లో మళ్ళీ పూర్వ చైతన్యం నింపాలి. పల్లెల్లో ఉండికూడా సంపదను ఎలా సృష్టించవచ్చో మిగతావారికి ఋజువు చేసి చూపించాలి" ప్రశాంతంగా పలికాడు రమణ.

అంతవరకూ మా సంభాషణ వింటున్న రమ్య గట్టిగా చప్పట్లు కొడుతూ "అద్భుతంగా చెప్పారంకుల్, మీ విజన్ వండర్‌ఫుల్. మీ కల సాకారమయ్యేందుకు నావంతు కృషి చేయాలనిపిస్తోంది. డాడీకూడా నాకు సపోర్టు చేస్తారన్న నమ్మకం ఉంది" అంది.

రమణ ఆత్మవిశ్వాసంచూసి అతనిపైన నాకు గౌరవం కలిగింది. అతని భుజంపై చేయివేసి అభినందన పూర్వకంగా తట్టాను. ఈలోగా అక్కడికి వెంకన్న వచ్చి "అబ్బాయిగోరూ ఇంకా మీ ముచ్చట్లవ్వలేదా" అన్నాడు. నేను రమణదగ్గర సెలవు తీసుకుని ఇంటికి బయలుదేరాను.

ఇంటికివచ్చాక ఆలోచనలు నన్ను చుట్టుముట్టాయి. ప్రతిమనిషికీ కూడు, గూడు, గుడ్డ అవసరం. రైతుగా రమణ తిండి అందిస్తుంటే, గిరి వస్త్రాలు సరఫరా చేస్తున్నాడు. అవసరమైన వారికి గృహాలు నిర్మిస్తూ రాము గూడు కల్పించడానికి తనవంతు సాయపడుతున్నాడు. ఈ ముగ్గురిలాంటి వారివల్ల దేశానికి ఉపయోగం ఉంది. తనలాంటి వారివల్ల ప్రజలకు, సమాజానికి ఒనగూరే ప్రయోజనమేంటి? ఇలా ప్రశ్నించుకునేసరికి నాకన్నా నా మిత్రులే ఎంతో ఉన్నతంగా కనిపించారు.

నా దగ్గర కావలసినంత డబ్బుంది. పల్లెల్లో ఉండే వనరులను ఉపయోగించుకుని చిన్న పరిశ్రమలు ఏర్పాటుచేస్తే ఎలా ఉంటుందన్న ఆలోచన మదిలో మెదిలింది. సమీప పట్టణాలకు కావలసిన ఉత్పత్తులు అందించడానికి అవసరమైన నైపుణ్యాలను, జ్ఞానాన్ని ఇక్కడి యువతకు అందిస్తే అప్పుడు పల్లె, పట్టణ జీవితాలమధ్య సమతూకం ఏర్పడుతుంది కదా అనిపించింది.

నా ఆలోచనలు ఇలా ఉండగానే మా అమ్మాయి నా దగ్గరకు వచ్చి "డాడీ నేను డాక్టరయ్యాక ఈ ఊళ్ళోనే ఆసుపత్రి పెడితే ఎలా ఉంటుంది?" అనడిగింది. మా అమ్మాయిని దగ్గరకు తీసుకుని ప్రేమగా ఆమె నుదుటిపై ముద్దాడాను. నేను ఈ ఊరు వచ్చిన పని మరచిపోయాను. నాన్నతో ఇక ఆ విషయం ప్రస్తావించనవసరం లేదు. ఇప్పుడు నా మనసు ప్రశాంతంగా ఉంది.

సెల్:89850 69675



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

ఇంటర్వ్యూలు, సమావేశాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ఆరోగ్యం మెరుగుపడుతుంది. 24, 25 తేదీల్లో భాగస్వామి సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. శ్రీవారు, శ్రీమతి ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 26, 27 తేదీల్లో వైద్యం, పరిశ్రమల రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. గత అనుభవంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 28, 29 తేదీల్లో వృత్తిపరమైన ప్రయాణాలు, సమావేశాలు ఫలిస్తాయి. సంకల్ప సిద్ధి కోసం అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, పొదుపు పథకాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం సంతానం విషయంలో శుభపరిణామాలు సంభవం. 24, 25 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రియతములతో విందుల్లో పాల్గొంటారు. 26, 27 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ప్రేమానుబంధాలు బలపడతాయి. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 28, 29 తేదీల్లో ప్రియతముల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

కుటుంబ వ్యవహారాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యత ఉంటుంది. బుధవారం కుటుంబ సభ్యుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. బదిలీలకు అనుకూలం. 24, 25 తేదీల్లో విద్యా సంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. ఇంట్లో వేడుకలతో ఉల్లాసంగా గడుపుతారు. ఏర్పాట్లు చేస్తారు. 26, 27 తేదీల్లో బదిలీలు, ఇల్లు మార్పునకు అనుకూలం. విందు వినోదాల్లో పాల్గొంటారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తిచేస్తారు. పరిశ్రమలు, హోటల్స్, రియల్ ఎస్టేట్ రంగాల వారికి శుభప్రదం. 28, 29 తేదీల్లో వేడుకల్లో ఉల్లాసంగా పాల్గొంటారు. ఖర్చులు అధికం. భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

విద్య, వృత్తి, వ్యాపారాలు, వేడుకులకు ఈ వారం ప్రాధాన్యత ఇస్తారు. బుధవారం విద్య, రవాణా, కాంట్రాక్టుల రంగాల వారికి అనుకూలం. 24, 25 తేదీల్లో బదిలీలు, మార్పులకు సంబంధించిన సమాచారం అందుకుంటారు. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. 26, 27 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. పొదుపు పథకాలు లాభిస్తాయి. విద్యాసంస్థలు, చిట్‌ఫండ్ రంగాల వారికి శుభప్రదం. 28, 29 తేదీల్లో కమ్యూనికేషన్లు, హోటల్, వైద్య రంగాల వారికి ప్రోత్సాహకరం. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, షాపింగ్, కుటుంబ విషయాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 24, 25 తేదీల్లో చెక్కులు, విలువైన పత్రాలు అందుకుంటారు. రవాణా, బోధన, కమ్యూనికేషన్ రంగాల వారికి శుభప్రదం. 26, 27 తేదీల్లో నిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. కుటుంబ సభ్యుల సహకారంతో ఆర్థిక విషయాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 28, 29 తేదీల్లో చిన్నారులు ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి ముందడుగు వేయాలి. ఖర్చులు అధికం.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, షాపింగ్, విద్యా విషయాలు, బదిలీలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం కొత్త పనుల ప్రారంభానికి అనుకూలం. మనసు ఉల్లాసంగా ఉంటుంది. 24, 25 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక విషయాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. అదనపు ఆదాయం లభిస్తుంది. 26, 27 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. 28, 29 తేదీల్లో గృహనిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల వారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు. కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. బదిలీ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

విద్య, దూరప్రయాణాలు, విద్యావిషయాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం ఉన్నత విద్య, దూరప్రయాణాలకు అనుకూలం. 24, 25 తేదీల్లో సమీక్షలు, సంస్కరణలకు అనుకూలం. ఒత్తిళ్లు తొలగిపోయి మనసుకు సాంత్వన లభిస్తుంది. వేడుకలు, ఉత్సవాల్లో పాల్గొంటారు. 26, 27 తేదీల్లో సినీ, రాజకీయ రంగాలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. 28, 29 తేదీల్లో వాహనాల కొనుగోలుకు, ప్రయాణాలకు అనుకూలం. ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.

# సౌభాగ్య చక్రం

ఆగస్టు 23 నుంచి
ఆగస్టు 29 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. 24, 25 తేదీల్లో సినీ, రాజకీయ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. సమావేశాలు, బృందకార్యక్రమాల్లో మీ అనుభవానికి గుర్తింపు లభిస్తుంది. 26, 27 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. వేడుకల్లో పాల్గొంటారు. స్నేహానుబంధాలు విస్తరిస్తాయి. సమావేశాలు, బృందకార్యక్రమాల్లో కీలకపాత్ర పోషిస్తారు. 28, 29 తేదీల్లో పెట్టుబడులు, పొదుపు పథకాలపై దృష్టి సారిస్తారు. ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, ఇంటర్వ్యూలు, ఆర్థిక విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం ఉద్యోగ, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. 24, 25 తేదీల్లో వృత్తి, వ్యాపారపరమైన సమావేశాలు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. గౌరవ మన్ననలు అందుకుంటారు. 26, 27 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వాయిదా పడుతున్న పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. గౌరవ పదవులు లభిస్తాయి. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. 28, 29 తేదీల్లో కొత్త పనులు ప్రారంభించేందుకు సన్నాహాలు చేసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ఒత్తిడి అధికం. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

విద్య, పెట్టుబడులు, ప్రయాణాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధవారం రక్షణ, న్యాయ, బోధన, రచనల రంగాల వారికి ప్రోత్సాహకరం. 24, 25 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. గౌరవ పదవులు అందుకుంటారు. 26, 27 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 28, 29 తేదీల్లో ప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

ఆర్థిక వ్యవహారాలు, వేడుకలు, క్రయవిక్రయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధవారం రుణప్రయత్నాలు ఫలిస్తాయి. 24, 25 తేదీల్లో విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థిక విషయాల్లో మీ వ్యూహాలు ఫలిస్తాయి. 26, 27 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆర్థికంగా ప్రోత్సాహకరం. గత అనుభవంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. పెన్షన్, పన్నుల వ్యవహారాలకు అనుకూలం. 28, 29 తేదీల్లో సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతారు. ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధవారం శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 24, 25 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. షాపింగ్ ఉల్లాసం కలిగిస్తుంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 26, 27 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమావేశాలు లాభిస్తాయి. న్యాయ, బోధన, రక్షణరంగాల వారికి ప్రోత్సాహకరం. 28, 29 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో భాగస్వామి సహకారం అందుకుంటారు. గౌరవ మర్యాదలకు భంగం కలిగే ప్రమాదం ఉంది. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.

# అన్వేషణ

6

-సలీం

**లోపల లైట్లు వెలుగుతున్నా వెలుతురు మసగ్గా ఉంది. మనుషులు గొడవ గొడవగా మాట్లాడుకుంటున్నారు. సిగరెట్ పొగ అక్కడంతా వ్యాపించి, మసాలా వాసనల్తో కలిసి అదోరకమైన వెగటు వాసన వేస్తోంది.**

**ఓ టేబుల్ దగ్గర కూచున్నాం.**

**వెయిటర్ రాగానే "రెండు పీటర్‌స్కాచ్ విస్కీ లార్జ్, చికెన్ మంచూరియా, బేబీకార్న్ 65" అని ఆర్డర్ ఇచ్చాడు.**

**"రెండు చెప్పావేమిటి? నేను తాగనన్నాను కదా" అన్నాను.**

"నాకు తెలుసు. నువ్వు ఇప్పటివరకూ టీటోటలర్‌వని. ఇప్పుడు తాగు. ఎప్పుడో ఒకప్పుడు మొదలెట్టాలి కదా"

"ఎందుకు మొదలెట్టాలి?"

"తాగి చూడు, స్వర్గం కనిపిస్తుంది. అమ్మాయిల వైపు కన్నెత్తి చూడవు సరే. కనీసం ఈ మందులో దొరికే స్వర్గాన్నయినా అనుభవించు".

"తాగితే ఏమొస్తుంది? మనమీద మనం నియంత్రణ కోల్పోవడం తప్ప".

"నువ్వు తాగి చూస్తేనే కదా ఎలా ఉంటుందో తెలిసేది. ఓసారి రుచి చూడు. నచ్చలేదనుకో... మరోసారి తాగకు".

మంద్రంగా వినిపిస్తున్న పాత హిందీ సినిమాలోని పాట... ముఖేష్ గొంతు... దుఃఖాన్ని సంగీతంలో మేళవించి గొంతులో పలికిస్తూ... మనసుని ఆ పాటమీద కేంద్రీకరించి విన్నాను.

### జరిగిన కథ

రామక్రిష్ణ తల్లి వసుధ పేరంటానికని వెళ్ళి, తిరిగి రాదు. ఆమె ఎవరితోనో వెళ్ళిపోయిందని తెలుస్తుంది. తండ్రి ఆత్మహత్య చేసుకోవటంతో, ఒంటరివాడవుతాడు రామక్రిష్ణ. ఊరిపెద్దల సమక్షంలో రామక్రిష్ణ బాధ్యతను వాళ్ళ పెదనాన్న తీసుకుంటాడు. ఒంగోలు కాలేజీలో డిగ్రీలో చేరిన రామక్రిష్ణ, మోహిత్‌తో స్నేహం చేస్తాడు. ఒకరోజు మోహిత్ రూంకి వెళతాడతను. మోహిత్ ఎక్కువగా అమ్మాయిల గురించే మాట్లాడుతుంటాడు. ఇద్దరి మధ్యా కాసేపు చర్చ జరుగుతుంది.

ఆ తర్వాత....

జానే కహా గయే వో దిన్.. చుట్టూ పరికించి చూశాను. ఎవ్వరూ పాట వినే ధ్యాసలో లేరు. తాగుడుమీద, తిండిమీద, సిగరెట్లమీద ధ్యాసంతా నిలిపి మాటల్తో పరిసరాల్ని నింపేస్తున్నారు. ఆ ధ్వనుల మధ్య పాటలోని కొన్ని పదాలు స్పష్టంగా విన్పించడం లేదు.

వెయిటర్ మా ముందు రెండు లార్జ్‌పెగ్గులు పెట్టి, వాటితోపాటు మంచింగ్‌కి ఆర్డర్ చేసిన పదార్థాలు, రెండు సోడా బాటిళ్ళు, ఐస్‌క్యూబ్ కంటెయినర్ పెట్టాడు.

"సిగరెట్స్ కావాలి" తను తాగే బ్రాండ్ ఏదో చెప్పాడు మోహిత్.

వెయిటర్ సిగరెట్ ప్యాకెట్ తెచ్చి, అందులోంచి ఒక సిగరెట్ తీసి అతని చేతికిచ్చాడు. అతను నోట్లో పెట్టుకున్నాక తనచేతిలో ఉన్న లైటర్‌తో దాన్ని వెలిగించాడు. సోడా బాటిల్ తెరిచి రెండు గ్లాసుల్లో పోశాడు.

మోహిత్ ఒక గ్లాసుని ఎత్తి పట్టుకుని "వూ కానీ..ఛీర్స్..." అన్నాడు.

"జీవితం మీద నాకు కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి. నాకో లక్ష్యముంది. దాన్నుంచి పక్కకు జరగను" అన్నాను.

"మళ్ళా పెద్దమాటలు.. నీకో నమస్కారం. నీ మాటలు వింటుంటే తాగిందంతా దిగిపోవటం ఖాయం. కనీసం తిండైనా తింటావా లేక గాలి భోంచేస్తావా?"

నేను నవ్వాను. "తింటాలే. నాకూ ఆకలి వేస్తోంది" అన్నాను.

రెండు పెగ్గులు అతనే తాగేశాడు. తన కోసం చికెన్ బిర్యానీ తెప్పించుకున్నాడు. నాకు చపాతీ చాలని చెప్పాను.



"నాన్‌వెజ్ తినడం కూడా మానేశావా?" అతని మాట ముద్దముద్దగా ఉంది.

"తినాలనిపించటం లేదు."

"జీవహింస మహాపాపమనా?" అంటూ పెద్దగా నవ్వాడు. "బుద్ధుడు కూడా మాంసాహారం తిన్నాడు, తెలుసా?"

"నేను బుద్ధుణ్ణి కాదు. రామక్రిష్ణని. నా ఇష్టాయిష్టాలు నాకుంటాయి".

మేము బైటికొచ్చేటప్పటికి సమయం పది దాటింది. మోహిత్ బాగా తూలుతున్నాడు. మాటలు తడబడుతూ ఉండటంవల్ల ఏమంటున్నాడో అర్థం కావటం లేదు.

అతని నడుందగ్గర చేయివేసి నడిపించడానికి ప్రయత్నించాను. వీలుకావడం లేదు. పడిపోయేలా ఉన్నాడు. ఆటోని పిలిచి అతన్ని ఎక్కించుకుని రూమ్‌కి తీసుకెళ్ళాను. గేట్ తీసి మెల్లగా మెట్లమీద నడిపించుకుంటూ పైకి తీసుకెళ్ళాను.

తాళం తీయడానికి ప్రయత్నించి విఫలమై నా చేతిలో పెట్టాడు. నేను తాళం తీసేలోపల బాత్రూంలో కెళ్ళి వాంతి చేసుకున్నాడు.

***

రాత్రి చాలాసేపటి వరకు నిద్రపట్టలేదు. మోహిత్ స్పృహ లేకుండా నిద్రపోతున్నాడు. తాగిందీ తిన్నదీ అంతా కక్కుకున్నాడు. ఎందుకు తాగి శరీరాన్ని కష్టపెట్టుకుంటారో.. ఎంత డబ్బు ఖర్చో...

మేము బార్ నుంచి బైటికొచ్చినప్పుడు రోడ్డు పక్కన అడుక్కుంటున్న ముసలి బిచ్చగాణ్ణి చూశాను. అతని పొట్ట వీపుకి అతుక్కుపోయి ఉంది.

'ఆకలేస్తోంది... ధర్మం చేయండి బాబూ' అంటూ దీనంగా అర్థిస్తున్నాడు. అప్పటికే రాత్రి పది దాటింది. అతని కళ్ళల్లో ఆకలితో పాటు ఆరిపోవడానికి తయారుగా ఉన్న ఆశ కూడా... ఎవరైనా ధర్మాత్ములు కాసిని డబ్బులు విసిరేస్తే కాలుతున్న కడుపుని చల్లార్చుకోవాలన్న ఆశ. తాగుడికి ఖర్చుపెట్టే కన్నా అతనికో పూట అన్నం పెడితే చాలా తృప్తిగా ఉండేదేమో.

ఉదయం చాలా ఆలస్యంగా లేచాను. నేను లేచేటప్పటికే మోహిత్ బాల్కనీలో నిలబడి ఎవరికో సైగలు చేస్తున్నాడు. నేను లేవటం గమనించి "ఇక్కడికి రా. మా ఇంటి ఓనర్ వాళ్ళు పెరట్లో పెంచుతున్న అందమైన పూలమొక్కల్ని చూద్దువు గానీ" అన్నాడు.

వెళ్ళి అతని పక్కన నిలబడ్డాను. పూలమొక్కలకు నీళ్ళు పోస్తూ పదహారేళ్ళ అమ్మాయి.

"పూలు చాలా అందంగా ఉన్నాయి కదూ" అన్నాడు పెద్దగా ఆ అమ్మాయికి వినబడేలా.

ఆ అమ్మాయి తలపైకెత్తి మోహిత్‌వైపు చూసి "నాకు తెలుసులే.. నువ్వు నా గురించే అంటున్నావని" అనేలా నవ్వింది.

'పైకి రా.. నా ఫ్రెండ్‌ని పరిచయం చేస్తాను' అనే అర్థం వచ్చేలా సైగ చేశాడు.

'పది నిమిషాలు' అంటూ ఆ అమ్మాయి కూడా సైగల్తో తెలిపింది.

ఈ లోపల బ్రష్ చేసుకుని కాలేజీకి తయారయ్యాను.

ఆ అమ్మాయి రెండు ప్లేట్లలో ఉప్మా పట్టుకుని పైకి వచ్చింది.

చాలా అందంగా ఉంది. తెల్లటి రోజా పువ్వులా, కళ్ళు విశాలంగా, విచ్చుకున్న మందార పువ్వుల్లా ఉన్నాయి.

"నా ఫ్రెండ్ రామక్రిష్ణ" అంటూ నన్ను పరిచయం చేశాడు.

"తను ప్రణాలి. మా బంధువులమ్మాయి. బాగా దూరపు చుట్టరికం. ఏమవుతుందో తెలియదు. అందుకే అత్త కూతురని ఫిక్సయిపోయా" అంటూ నవ్వాడు. "మూడు పూటలా భోజనం ఇక్కడే. నాన్న నెలకింతని ఆంటీకి పంపిస్తాడు. పేయింగ్ గెస్ట్ అన్మాట" అన్నాడు.

ఏదో ఒకటి మాట్లాడాలి కాబట్టి "ఏం చదువుతున్నావు?" అని అడిగాను.

"నేను ఇంజనీరింగ్ ఫస్టియర్ చదువుతున్నాను. కంప్యూటర్ సైన్స్" అందా అమ్మాయి.

"ఉదయం నిద్రలేవగానే తన మొహం చూడకపోతే ఉండలేను తెలుసా? ఈ ఆర్నెల్లలో అంత గాఢంగా తన మీద ప్రేమ పెంచుకున్నాను. చివరికి నీట ముంచుతుందో పాల ముంచుతుందో తన చేతుల్లోనే ఉంది" అన్నాడు నాటకీయంగా.

"ఏయ్, ఏమిటా మాటలు? ఎవరి ముందు ఏంమాట్లాడాలో తెలియదా?" ముద్దుగా కసురుకుందా అమ్మాయి.

"వీడు నా బెస్ట్ ఫ్రెండ్. మన ప్రేమ విషయం చెప్పకుండా ఎలా చెప్పు. ఇంతకూ ఎప్పుడు కరుణిస్తున్నావు?" అన్నాడు.

"ఛీ పో" అంటూ సిగ్గుపడింది. మేం తిన్న ప్లేట్లు తీసుకుని కిందికెళ్ళిపోయింది.

"ఆ అమ్మాయి చాలా అమాయకంగా ఉంది. అభం శుభం తెలీని పిల్ల. జీవితంలోని లోతుపాతులు తెలీని వయసు. నువ్వు నిజంగానే ప్రేమిస్తున్నావా?" అన్నాను.

"ప్రేమా దోమా... ఈ రోజుల్లో నిజమైన ప్రేమలు ఎక్కడున్నాయి రామక్రిష్ణా. ఓ గాలం వేశాను. చేప చిక్కింది".

"నువ్వు కోరుకున్నట్టే తనూ ప్రేమిస్తోందిగా. మరి ఎప్పుడు కరుణిస్తావని అడిగావేమిటి?"

"ఆ అమ్మాయి కాదు, నువ్వు అమాయకుడివి రామక్రిష్ణా. తనకర్థమయ్యే కదా ప్రణాలి సిగ్గుపడింది. కరుణించడమంటే కౌగిలిలోకి రావడం".

"తప్పు మోహిత్... తను నిన్ను సిన్సియర్‌గా ప్రేమిస్తోంది. ఆ పిల్లకు అన్యాయం చేయకు. చదువై



పోయాక మంచి ఉద్యోగం తెచ్చుకో. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకో. తర్వాత నీ ఇష్టం.

మోహిత్ పెద్దగా నవ్వాడు. తెరలు తెరలుగా నవ్వాడు. "చదువై పోవడానికి ఐదేళ్ళు పడుతుంది. ఉద్యోగం తెచ్చుకోడానికి మరో రెండేళ్ళు. అంటే దాదాపు ఏడేళ్ళు మడికట్టుకుని ఉండమంటావా? ఈ పోయిన యవ్వనమంతా ఎంత పరితపించినా తిరిగి రాదే. చూడు బ్రదర్... ఇక్కడున్నన్ని రోజులు స్వర్గసుఖాలు అనుభవిస్తాను. భోజనమూ, వసతితో పాటు అందమైన ఆడపిల్ల పొందు దొరకటం ఎంత దృష్టమో కదా. ఈ ఇంట్లో వసతి ఏర్పాటు చేసినందుకు నాన్నకు థాంక్స్ చెప్పాలి".

"అలా అనకు మోహిత్. ఆ పిల్ల కళ్ళలోకి చూశావా ఎప్పుడైనా... నువ్వంటే చాలా ఇష్టం, ప్రేమ, అంతకుమించి ఆరాధన కనిపించాయి".

"అంతా ట్రాష్... ఆడపిల్లలకు కూడా ఎంజాయ్‌మెంట్ కావాలి. పెళ్ళయ్యే వరకు ఇద్దర్నో ముగ్గుర్నో ముగ్గులోకి లాగి సుఖాలు అనుభవించి ఆ తర్వాత ఇంకెవర్నో పెళ్ళి చేసుకుని సెటిలయిపోతారు. ఈ వయసులో ఏదైనా దారితీసేది సెక్స్‌కే. ఇవన్నీ ముసుగులు. మన మనస్సాక్షిని సంతృప్తిపర్చుకోడానికి ఆడే నాటకాలు. ఒకటి గుర్తుపెట్టుకో. ప్రపంచమంతా డబ్బు చుట్టూతా, సెక్స్ చుట్టూతా మాత్రమే తిరుగుతోంది" అన్నాడు.

ఈసారి ఆ అమ్మాయి ఒంటరిగా కన్పిస్తే మోహిత్ విషయంలో హెచ్చరిద్దామని నిర్ణయించుకున్నాను.

***

కొన్ని సంఘటనలు జీవిత గమనాన్నే కాదు దిశను కూడా మార్చేస్తుంటాయి. నా జీవితంలో పదేళ్ళ వయసులో జరిగిన సంఘటన అలాంటిదే. అమ్మ ఎవరితోనో లేచిపోవటం అది మా కుటుంబాన్ని అతలాకుతలం చేసేసింది. నా జీవితాన్ని అవమానాలపాలు చేసింది. భయంకరమైన ఆత్మన్యూనత. ఎవరు ఎదురుపడి ఏమడుగుతారోనన్న బెదురు.. 'అయ్యో పాపం, లేచి పోయింది వీళ్ళమ్మే' అంటూ పైకి జాలి చూపిస్తూనే పక్కకు తిరిగి క్రూరంగా నవ్వుకునే మనుషులు. ఇదంతా చివరికి నాన్న ప్రాణాన్ని బలి తీసుకునేదాకా వెళ్ళింది.

నాకన్నా నాన్న మరిన్ని అవమానాలు, అవహేళనల్ని భరించి ఉంటాడు. నాన్నను ఈసడిస్తూ మాట్లాడుకున్న మాటలు నేనూ కొన్ని చూచాయిగా విన్నాను. 'వ్యవసాయం మీద చూపించిన శ్రద్ధ పెళ్ళాం మీద చూపించి ఉంటే ఎందుకు లేచి పోయేది?' అని కొందరనుకున్నారు.

'ఈడిలో ఆ శక్తి తగ్గిపోయి ఉంటుంది. పైకి బలంగా కన్పిస్తే చాలా? పడకమీద ఎంతటి మగాడో తెలిసేది ఒక్క పెళ్ళానికేగా, ఆడదానికి తిండీ గుడ్డా ఇస్తే చాలా? ఆ సుఖం కూడా ఇవ్వాలిగా. అందుకే ఈడి పెళ్ళాం ఈణ్ణి వదిలేసి, అదిచ్చే మగాణ్ణి వెతుక్కుంటూ వెళ్ళింది" అని కూడా చెవులు కొరుక్కున్నారు.

పెళ్ళాం లేచిపోయిన మగాడు అందరికీ లోకువే. వాణ్ణి చాతకాని వాడి కింద జమకడ్తుందీ లోకం. భార్యను కట్టడి చేయలేని అసమర్థుడంటుంది. మగవాడిలో ఏదో లోపం ఉండబట్టే పరాయి మగవాడి పంచన చేరి ఉంటుందని కథలేవో అల్లుకుని తృప్తిపడే మనుషులే ఎక్కువ.

ఇలాంటివన్నీ వినీ వినీ తానూ మగాడినేనని నిరూపించుకోవడం కోసం నాన్న కసితో మరొక స్త్రీతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడేమోననిపిస్తోంది.

భార్య లేచిపోయిన మగవాణ్ణి ఆడవాళ్ళకంటే మగవాళ్ళే చులకనగా చూస్తారు. వాళ్ళే మగవాళ్ళయినట్టు వాళ్ళలోనే మగతనం ఉన్నట్టు... ఛాతీ విరుచుకుంటారు. దానికి రుజువేమిటంటే తమ భార్యలు లేచిపోకుండా కాపురాలు చేయడమే అనుకుని విర్రవీగుతారు. కానీ మా ఊళ్లో ఆడవాళ్ళు చాటుగా ఎన్నెన్ని వ్యవహారాలు నడుపుతారో నాకు వయసొచ్చాక అర్థమైంది.

అమ్మకొట్టిన దెబ్బ నాన్న అహాన్ని ఛిద్రం చేసింది. ఆ అవమానాన్ని తట్టుకోలేక పోయాడు. చివరికి తను ఆసరాగా ఎన్నుకున్న స్త్రీ సాంగత్యం కూడా ఆయన గుండెకయిన గాయాన్ని మాన్పలేకపోయింది. 'నా జీవితంలో వసుధకు తప్ప మరో ఆడదానికి స్థానం లేదని' పెద్దమ్మతో పెదనాన్నతో అన్న వ్యక్తి మరో ఆడదాని సాన్నిహిత్యాన్ని వెతుక్కోవాల్సిన అగత్యం ఏర్పడినందుకు ఎప్పుడో మానసికంగా చచ్చిపోయి ఉంటాడు. ఆయన చావుకి కారణం అమ్మ ఒక్కతే కాదు ఆయన్ని కాకుల్లా పొడిచి హింసించిన ఈ మనుషులు కూడా.

నేను డిగ్రీ ద్వితీయ సంవత్సరంలో ఉన్నప్పుడు నా జీవితాన్ని ప్రభావితం చేసే మరో సంఘటన జరిగింది.




**ఆకాశంలో మేఘాలు దట్టంగా అలముకున్నాయి. హోరున గాలి. నెమ్మదిగా సైకిల్ తొక్కుతూ వెళుతున్నాడు రామక్రిష్ణ. వర్షం మొదలై నిమిషాల్లోనే జడివానలా మారింది. దాంతో సైకిల్ స్టాండు వేసి ఓ ఇంటి గడపలోకి వెళ్ళి నిలబడ్డాడు. ఇంతలో తలుపు తీసిన చప్పుడు. ఆ వైపు చూసిన రామక్రిష్ణ తలుపు తీసిన వ్యక్తిని చూసి ఉలిక్కిపడ్డాడు. ఇంతకీ ఎవరా వ్యక్తి? ఆ తరువాతేం జరిగింది?**

నేను రోజూ కాలేజీకి సైకిల్ మీద వెళ్తున్నా.

"అందరికీ స్కూటర్లున్నాయి. నువ్వూ ఒకటి కొనుక్కోకూడదా? నాన్న నీ బ్యాంక్ ఎకౌంట్‌లో వేసిన డబ్బులున్నాయిగా" అన్నాడో రోజు సుందరం.

"నాకొద్దు. సైకిల్ ఉందిగా, చాల్లే" అన్నాను.

"పోనీ రోజూ నేను డ్రాప్ చేయనా? ఎటొచ్చీ మీ కాలేజీ నేను వెళ్ళేదారిలో కాకుండా వేరే వైపుంది. అయినా పర్లేదు. ఓ అరగంట ముందుగా బయల్దేరితే చాలు. వచ్చేటప్పుడు కూడా నిన్ను పికప్ చేసుకుంటాను".

"వద్దు. సైకిల్ వాడటం వల్ల పర్యావరణానికి హాని కలగదు. నాకు మంచి ఎక్సర్‌సైజ్ కూడా. దానికి తోడు నాకు వేగంగా వెళ్ళడం ఇష్టం ఉండదని నీకు తెల్సుగా. నా మనస్తత్వానికి సైకిలే బెటర్" అన్నాను.

ఈ మధ్య మా ఊళ్ళో ఉండటానికి మనస్కరించడం లేదు. చిన్నప్పుడు ఎవరైనా 'మీ అమ్మేగా లేచి పోయింది... అయ్యో పాపం' అంటే నాకు నీ మీద జాలేసేది. అమ్మ అలా చేసినందుకు బాధేసేది.

ఇప్పుడు వయసొచ్చాక ఎవరైనా అలా అనుకుంటుంటే అవమానంతో చచ్చిపోవాలనిపిస్తుంది. వీలైనంత వరకు మనుషుల్ని తప్పించుకుని తిరగడం అలవాటు చేసుకున్నాను.

ఒక్కోసారి వాళ్ళేమీ అడగకపోయినా వాళ్ళు ఎదురుపడినప్పుడు వాళ్ళ కళ్ళల్లో కనిపించే జాలిని చూసి తట్టుకోలేకపోతున్నాను. నిజంగానే వాళ్ళు జాలిగా చూస్తున్నారో లేకపోతే నాలో గూడు కట్టుకుని ఉన్న అనేకానేక అనుమానాల వల్లా, భయాల వల్లా నేనలా అపోహ పడుతున్నానో తెలియటం లేదు. ఎటొచ్చీ నేను పడుతున్న హింస మాత్రం నిజం. ఏ అడవుల్లోకో కొండల్లోకో పారిపోవాలన్న కోరిక బలపడుతూ ఉండటం మాత్రం నిజం.

'ఇక్కడ దొరకని సుఖాన్ని వెతుక్కుంటూ వెళ్ళి పోయింది' అని ఊళ్ళో వాళ్ళు అనుకోవటం చిన్నతనంలో విన్నప్పుడు, ఆ సుఖం ఏమిటో తెలియదు. ఇప్పుడదేంటో తెలిశాక అమ్మను తల్చుకుంటే మరింత అసహ్యం వేస్తోంది.

జంతు ప్రవృత్తి! జంతువుల్లో కూడా ఇంత నీచ ప్రవృత్తి ఉండదేమో.. ఆడకుక్క వెంట మగకుక్కలు పడటం చూశాను. కానీ ఓ మగకుక్కను వెతుక్కుంటూ ఆడకుక్క వెళ్ళటం నేనెప్పుడూ చూళ్ళేదు. జంతువులు కూడా తమ పిల్లల్ని ఎంత ప్రాణప్రదంగా కాపాడుకుంటాయో. కానీ ఈ మనుషులే జంతువుల కన్నా హీనం. సెక్స్ సుఖం కోసం కన్న

## అన్న కోసం నో చెప్పాడట!

అందాల దేవత ఐశ్వర్యారాయ్‌తో నటించను అనేవాళ్ళు ఎవరూ ఉండరు అన్న భావన చాలా మందిలో ఉంది. కానీ ఓ యువనటుడు మాత్రం ఐష్‌తో నటించను అని ఏకంగా సినిమా నుంచే తప్పుకున్నాడట! వివేక్ ఒబెరాయ్ తమ్ముడు అక్షయ్ ఒబెరాయ్ పక్కన ఐష్‌ని అనుకున్నారట! ఐష్ కూడా ఓకే చెప్పిందట! కానీ అక్షయ్ మాత్రం ఐష్ పక్కన నటించను అంటూ ఆ సినిమానుంచి తప్పుకున్నాడట! దీనికి కారణం అక్షయ్ అన్నయ్య వివేక్ ఒబెరాయ్ కారణం అయి ఉండవచ్చని బాలీవుడ్ జనాలు అంటున్నారు. ఒకప్పుడు ఐష్, వివేక్ గాఢంగా ప్రేమించుకుని ఆ తరువాత విడిపోయారు. ఈ కారణంగానే అక్షయ్ ఐష్‌తో నటించడానికి ఇష్టపడి ఉండకపోవచ్చని అంటున్నారు.

పిల్లల్ని సైతం నిర్దాక్షిణ్యంగా వదిలి వెళ్ళిపోగలరు.

అనుబంధాలూ ప్రేమలూ అక్కరలేదు. సెక్స్ ఉంటే చాలు. దానికోసం ఎంతటి నీచానికైనా దిగజారతారు.

నాకలాంటి అమ్మ ఉన్నందుకు బాధపడని రోజు లేదు. నన్నూ నాన్ననీ బతికున్న శవాల్లా చేసి పోయిన దుర్మార్గురాలు. దురదృష్టంలో అదృష్టం ఏంటంటే నాకో అక్కో చెల్లెలో లేకపోవడం. ఖర్మ కాలి ఉండి ఉంటే దానికి పెళ్ళయ్యేదా? లేచిపోయిన ఆడదాని కూతుర్ని చేసుకోవడానికి ఎవరైనా ముందుకొస్తారా? ఆ వంశమంతా అలాంటిదేమోనని ఛీత్కరించరా?

ఎవరైనా 'మా అమ్మ ఎంత గొప్పదో తెలుసా?' అనో 'దేవుడు అన్నిచోట్లా ఉండటం వీలుకాక తల్లుల్ని సృష్టించాడు. తల్లే ప్రత్యక్ష దైవం' అనో అంటే నాకు అరికాలిమంట నెత్తికెక్కుతూ ఉంటుంది. 'మా అమ్మంటే నాకెంతిష్టమో తెలుసా?' అని కాలేజీలో ఎవరైనా అంటే ఈర్ష్యతో దహించుకుపోతుంటాను.

ఈ హింస నుంచి కొంతైనా ఉపశమనం పొందుదామని ఈ మధ్య ఎక్కువగా ఒంగోల్లోనే గడుపుతున్నాను. మా రమత్తకు కూడా నేను పెద్దమ్మ దగ్గరకెళ్ళకుండా తనింట్లో ఉండటమే ఇష్టం. చుట్టుపక్కల అమ్మలక్కలతో "మా అన్న కొడుకు. మాకు కాబోయే అల్లుడు" అని చెప్పుకుని మురిసిపోతూ ఉంటుంది.

ఆ రోజు కాలేజీలోనే బాగా ఆలస్యమైంది. ఇంటర్నెట్ వల్ల లాభమా నష్టమా అనే అంశం మీద డిబేట్ పెట్టారు. సమస్త ప్రపంచాన్ని మన కళ్ళముందు ఆవిష్కరించే అంతర్జాలం వల్ల ఎన్ని లాభాలున్నాయో అన్ని నష్టాలూ ఉన్నాయి. ఇంటర్నెట్ సౌకర్యం పల్లెటూర్లకు కూడా విస్తరించిన కొత్తల్లో మా ఊళ్లో కూడా ఒకడు ఇంటర్నెట్ కేఫ్ అంటూ మొదలెట్టాడు. గంటకు పది రూపాయలు వసూలు చేసేవాడు.

నేను పదో తరగతిలో ఉన్నప్పుడు నా క్లాస్‌మేట్ ఒకడు తరచూ ఇంటర్నెట్ కేఫ్‌కి వెళ్ళేవాడు. ఆ మరునాడు క్లాస్‌లో 'అబ్బ... ఎంత మజా వచ్చిందో' అనేవాడు.

"రోజూ అక్కడికెళ్ళి ఏం చేస్తావు?" అని అడిగాను.

"ఈ రోజు సాయంత్రం ఆరింటికి అక్కడికి రా... చూపిస్తాను" అన్నాడు. "వచ్చేటపుడు ఇరవై రూపా యలు తెచ్చుకోవటం మర్చిపోవద్దు" అని కూడా అన్నాడు.

"గంటకు పది రూపాయలేగా" అని అడిగితే "అది వేరు ఇది వేరు. దీనికోసమైతే గంటకు ఇరవై రూపాయలు" అన్నాడు.

సాయంత్రం ఇరవై రూపాయలు జేబులో వేసుకుని ఇంటర్నెట్ కేఫ్‌కి వెళ్ళాను. వాడు నా ఇరవై రూపాయల్తో పాటు తన ఇరవై రూపాయలు కూడా కట్టి నన్ను లోపలికి తీసుకెళ్ళాడు. చెక్కలు అడ్డుపెట్టి చిన్నచిన్న గదులుగా ఉన్న వాటిలో ఒకదానిలోకి తీసుకెళ్ళి కూచోబెట్టాడు. ఎటువంటి అద్భుతమైన దృశ్యాలు చూపించ బోతున్నాడోనని ఉత్కంఠగా చూశాను. తెర మీద ఆడా మగా.. నగ్నంగా... వెంటనే లేచి బయటికొచ్చేశాను.

ఆ అనుభవం వల్లనేమో నేను అంతర్జాలం వల్ల కలిగే నష్టాల గురించే మాట్లాడాను. నాకు బహుమతి రాలేదు. రాదని ముందే ఊహించటం వల్ల నిరాశ పడలేదు.

సైకిల్ మీద అత్తావాళ్ళింటికి బయల్దేరాను. బయల్దేరిన ఐదు నిమిషాలకే హోరున గాలి, ఆకాశంలో మేఘాలు దట్టంగా అలముకున్నాయి. సైకిల్ ముందుకు కదలటం కష్టంగా ఉంది. ఎదురుగాలి... దుమ్ము కళ్ళల్లో పడుతోంది. మెల్లగా నడుపుతున్నాను.

వర్షం మొదలైంది. నిమిషాల్లోనే జడివానగా మారింది. ఎడమచేతి వైపు ఓ ఇల్లు కనిపిస్తే సైకిలాపి ఆ ఇంటి గడపలోకెళ్ళి నిలబడ్డాను. పైన చూరు ఉండటం వల్ల తల తడవడం లేదు కానీ జల్లు కొడుతూ ఉండటం వల్ల తడుస్తూనే ఉన్నాను.

జల్లు నుంచి రక్షణకోసం వీపు వైపున్న తలుపులోకి మరింత ముడుచుకుపోయాను. అలా చేయటం వల్ల గొళ్ళెం కదిలి శబ్దమైంది. శబ్దమైన కొద్దిసేపటికే ఓ స్త్రీ వచ్చి తలుపు తీసింది.

నేను పక్కకు జరిగి, సంజాయిషీగా "సారీ అండీ. వర్షం పెద్దదైతేను ఆగాల్సి వచ్చింది. తగ్గగానే వెళ్ళిపోతాను" అన్నాను.

నా కంగారు చూసి ఆమె నవ్వింది. ఎంత బావుందో నవ్వు. గ్రీష్మరుతువులో సాయంకాలాలు వీచే చల్లనిగాలిలా...

"జల్లు పడుతోంది. తడిసిపోతావు. లోపలికొచ్చి కూచో. వర్షం ఇప్పుడప్పుడే తగ్గేలా లేదు" అంది.

"పర్లేదండీ" అన్నాను. అప్పటికే ముద్దగా తడిసి నీరు కారుతున్న నా బట్టలవైపు చూసుకుంటూ.

"ఇలా తడిస్తే జలుబు చేసి జ్వరం వస్తుంది. లోపలికి రా" అంది. ఆమె గొంతులో అధికారం.. చిన్నపిల్లాడిని శాసించే తల్లిలా. ఆమె స్వరంలో ఏదో అయస్కాంతశక్తి బలంగా లాగేస్తూ...

లోపలికెళ్ళి ఓ మూల నిలబడ్డాను. బట్టల్లోంచి నీరు కారి అక్కడి నేలమీద మడుగు కట్టాయి.

ఆమె లోపలికెళ్ళి టర్కీటవల్ తెచ్చి చేతికిస్తూ, "మొదట తల తుడుచుకో. తర్వాత ఒళ్ళు కూడా తుడుచుకో. చొక్కా విప్పదీసి పిండి అదుగో ఆ కుర్చీమీద ఆరవేయి" అంది.

తల తుడుచుకుంటున్నప్పుడు ఫ్యాన్ వేసింది. ఒక్కసారిగా శరీరంలో వణుకు పుట్టుకొచ్చింది.

ఒళ్ళు తుడుచుకోకుండా టవల్ తిరిగి ఇచ్చేస్తుంటే, "చొక్కా తీసి తుడుచుకో" అంది.

"వద్దండీ... ఇలానే నిలబడతాను".

ఆమె మనోహరంగా నవ్వింది. "మగపిల్లాడివి. అంత మొహమాటం మంచిది కాదు. చలి జ్వరంతో

